కోవడం లోను అవిదితమైన సంతోషమేదో అంతర్లీనంగా ఉండదా! అలాగే.

గడచిన జీవితంలో అన్నీ కష్టాలే అయితే ఏమో తప్ప కష్టాలే అయినా అవి గట్టెక్కిన విషయం తలచుకొని కూడా ఒక సంతోషానుభూతి ఉండవచ్చు. జీవితయాత్రలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక క్షణంలో, తన జీవితంలో గడచిపోయిన సన్నివేశాలను తలచుకోవడానికి ఇష్టపడని వ్యక్తులుండరు. ఏమంటే మనసులో మమతల సౌగంధ్యాన్ని ఈ తలపులు తలుపులు తెరచి ఆస్వాదింప చేస్తాయి. ఆ సంఘటనలు, ఆ అనుభూతులు మళ్ళీ మళ్ళీ ఇక రావులే అనే భావం కూడా గడచిన రోజులపట్ల ఒక గాఢానురాగ బంధాన్ని పెంపొంది స్తుందేమో! సృష్టిలోని అంద చందాలు, సార్థకతలు, జీవిత లోని రహో మాధుర్యాలు వ్యక్తావ్యక్తంగా అనుభూత మయ్యే అభివ్యక్తమయ్యే రోజులను గూర్చి ఒకసారి తలచు కోకుండా ఎవరుండగలరు!

ఈ మధ్య ఆదిభట్ల నారాయణదాసుగారి ఆత్మక చదివినప్పుడు ఆయన కూడా మనిషి జీవితంలో బాల్య బంగారు కాలమని అన్నారు. తీర్చగల వారెవరైనా వచ్చి ఏకోర్కెనైనా తీరుస్తాను కోరుకో అంటే, పదేళ్ళ నుంచి పాతికేళ్ళ వరకు నా బాల్య కౌమార యౌవనానుభూతులను ఒక్కసారి చాలు ఒక్కసారి ప్రసాదించ వలసిందిగా కోర కుందామని భావోద్వేగం నన్ను తొందర పెడుతుంది ఆ జీవిత కాలిక వ్యవధానంలో ఎన్నో అవమానాలు, అసం తృప్తులు, ఇరుకులు, ఇబ్బందులు ఉండి ఉండుగాక, స్నేహి తులు, ఆట పాటలు అభిమానాలు, అమ్మా నాన్నల అంత

లేని అనురాగాలు, తోబుట్టువుల మమతలు, పత్రికలు, కథలు కమ్మని కన్నీళ్ళు, చేదే అయినా ఆస్వాదనీయమైన అనుభూతులు, హాస్యాలు, మానసికంగా ఆహ్లాదం కొలిపే కదలికలు' ఉంటవి కదా. అందుకని ఎవరి తారుణ్య జీవితానుభవాలు వాళ్ళకు అబ్బురమైనవి. స్పందించే మనసుండి చూడగలగాలి, వినగలగాలి, ప్రకృతి అంతా మనసుకి ఉత్సుకత్వాన్నే గొలుపుతుంది. చెట్టు, పిట్ట, పువ్వు, నవ్వు, మాట, మన్నన, మనసులో అనుభూతి ముద్రను అచ్చొత్తుతాయి. చిన్ననాటి దృశ్యాలు- అప్పుడే కోసుకొచ్చిన తామరాకులో వేడి వేడి అన్నం తినడం, వైశాఖమాసంలో నృసింహ జయంతి మరునాడు జరిగే సంతర్పణ సంరంభం, శంకర జయంతి నాటి అర్చనలు, గదినిండా పోసిన నిమ్మకాయలు, దడినిండా పూసే రాధా మనోహరాలు, తొలి మలి సంజల గొబ్బిళ్ళు, అట్లతద్దె, ఉండ్రాళ్ళతద్దెలు- అన్నీ గుర్తు తెచ్చుకున్నారు రచయిత్రి ఆనందంగా. నిజంగా ఇది ఆత్మకథే.

ఆత్మకథ అనేది ప్రక్రియాపరంగా తెలుగులో ఆధునిక సాహిత్య ప్రక్రియ అని చెప్పాలి. అంటే ఈ శతాబ్దంలో వికాస దశకి చేరుకొన్నది. కిందటి శతాబ్దంలో పద్యాల్లో తమ చరిత్రను రాసుకొన్నవాళ్ళు కొందరున్నారు. కాని వచన ప్రక్రియగా ప్రయోగ వైవిధ్యంతో ఇటీవలే ఈ ప్రక్రియ తన ప్రత్యేకతను సాధించుకుంటున్నది. సుప్రసిద్ధ కథా, నవలా రచయిత స్వర్గీయ బుచ్చిబాబు రాసుకున్న అంతరంగ కథనం- ఆత్మకథలో కొత్త ప్రయోగం. కొంతలో కొంత అలాటి నవ్యధోరణి పార్వతిగారి ఈ ఆత్మకథలోనూ కనపడుతున్నది. జీవితానుభవాలను, జీవితాన్నీ పరస్పర

ప్రభావశీలంగా ప్రతిపాదించడం, రచయిత కావడానికి జీవితం ఎంతవరకు దోహదం చేసింది, జీవితంలోని పరిసరాలు ఎంత ప్రభావితం చేశాయి, అని విశ్లేషించడం కనపడుతుంది- బుచ్చిబాబు వినిపించిన అంతరంగ కథనంలో. అలాగే తాను రచయిత్రి కావడానికి దోహదం చేసిన సంస్కారాలు, తపనలు, విచికిత్సలు, ఆత్మకథితం చేశారిందులో శ్రీమతి పార్వతి.

సమకాలీన సమాజం పట్ల రచయిత్రిగా తమ బాధ్యతను జాగ్రత్తగా నిర్వహించే ఉద్దేశ్యంతోనే ఆమె తన రచనలు చేశారు. చేస్తున్నారు. సమాజ సమస్యల పట్ల, వాటి మూల కారణాల పట్ల సదవగాహన, వాటిని పరిష్కరించడానికి పెంపొందించ వలసిన దృక్పథం పట్ల సమ్యగవగాహన బాధితుల యెడల సానుభూతి, రచనా శిల్ప విషయికంగా పాటి చవలసిన మెళుకువలు, ఆయా సందర్భాలలో ప్రస్తావికంగా శ్రీమతి పార్వతిగారు ఈ ఆత్మకథలో పొందుపరచారు. నినాదాలతోను సైద్ధాంతిక చర్చలతోనూ మాత్రమే తృప్తి పడకుండా కళాత్మకమైన విలువల పట్ల కూడా తగినంత శ్రద్ధాసక్తులు కనపరచడం వల్ల ఆమె రచనలు చాలామంది మెప్పును చూరగొన్నాయి. కథ, నవల, వ్యాసం, విమర్శ, వచన కవిత వంటి నవ్య ప్రక్రియ లన్నిటిలోనూ కృషి చేసి తన స్థానాన్ని నిరూపించుకొన్నారు శ్రీమతి పార్వతిగారు.

అసలీమె ఎవరు? ఆత్మకథ రాసుకునే ఆవశ్యకత ఏమిటీమెకు? ఈమె ఆత్మకథ రాయాల్సిన అగత్యం ఉందా? నలుగురూ తెలుసు కోవాల్సిన ఉత్తేజకరమైన విషయాలు కాని, ఘట్టాలు కాని ఈమె జీవిత సంఘర్షణలో, సంఘటన

లలో ఉన్నాయా అని ఎవరైనా శంకితులు, ప్రాశ్నికులు అడుగుతారనుకోండి! అటువంటి సందేహికి ఒక్కటే సమాధానం, ఇరవయ్యో శతాబ్ది సామాజిక భావ విప్లవాన్ని దయతో అర్థం చేసుకుంటే ఇటువంటి ప్రశ్నలే రావని. గడచిన మూడు నాలుగు వందల సంవత్సరాల చరిత్రతో ఏ మాత్రం పరిచయం ఉన్నా ఈ శతాబ్దిలో భారతీయ మహిళ సాధించిన మానసిక వికాసాన్ని గూర్చి సహృదయు లెవరైనా తన్మయులే కాగలరు. అంటే గతాన్ని పూర్తిగా ఈసడించుకునే ధోరణిగా ఈ మాటలను ఎవరూ అపార్థం చేసుకోకూడదు. గతాన్ని అదే పనిగా పొగడటం ఎంత తప్పో, తెగడటమూ అంత తప్పే. కాని అనేక చారిత్రక కారణాల వల్ల గడచిన ఇటీవల శతాబ్దాలలో భారత దేశంలో మహిళలు అనుభవించిన ఇక్కట్లు మనకు తెలియనివి కావు. అంతదాక ఎందుకు! ఈ శతాబ్ది ప్రథమ దశకాలంలో కూడా మహిళలు బహిరంగ సభలకు సమావేశాలకు రావడానికి సాంఘిక సంకోచాలు వ్యక్తమయ్యేవి. ఆటువంటి కాలమంతా గడచిపోయి రచయిత్రిగా ఈనాటి ప్రతినిధిగా శ్రీమతి పార్వతిగారు తన ఆత్మకథను వినిపించడం ఎంతగా స్వాగతించ వలసిన విషయం! గొప్పగా భావించ వలసిన సంగతి కదా ఇది! ఇంతేకాదు పార్వతిగారు ఆత్మకథ వినిపించడానికి ఆమెకు గొప్ప అర్హత, యోగ్యత ఇంకో విధంగా కూడా ఉన్నాయి.

నిన్నటి ఇతిహాసాన్ని ఇమె కళ్ళారా చూసింది. శతాబ్దుల తరబడి భారతీయులు స్మరించ వలసిన దివ్యోజ్జ్వల చరిత్ర అది. పరువమైన బాల్యమంతా ఆమె ప్రత్యక్షంగా ఆ చరిత్ర గతిని వీక్షించింది.

ఉత్తమ దేశభక్తులు, మేధావి, స్వాతంత్ర్య సమర యోధులు, నిర్మాణ కార్యక్రమ దీక్షాదక్షులు స్వర్గీయ రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారు పార్వతిగారి తండ్రిగారు. కొవ్వూరులో తమ తండ్రిగారి కార్యక్షేత్రంలో వారి ఉత్తమ సంస్కార వాతావరణంలో ఆమె ప్రభావితురాలు కావడం సహజం. స్వాతంత్ర్యోద్యమంలో శ్రీ మందేశ్వరశర్మగారు రెండు సార్లు కారాగారవాసాన్ని అనుభవించారు. తరువాత నిర్మాణ కార్య క్రమంలో పాల్గొన్నారు. వినోబాభావేజీకి తెలుగు నేర్పడానికి ఎవరినైనా పంపించ వలసిందంటూ గాంధీజీ శర్మగారికి రాశారని తెలుసుకుంటే శర్మగారి వ్యక్తిత్వం గాంధీజీని ఎంతగానో ఆకర్షించినట్లు కదా! స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జీవిత సుఖాలన్నిటినీ త్యాగంచేసిన మహనీయుల నుద్దేశించి వీరమందిరం నిర్మింప చేశారు కొవ్వూరులో శ్రీశర్మగారు. ఆయన భోగిగా జన్మించి గొప్ప త్యాగిగా పరిణతి చెందారు. 'త్యాగేనైకేన అమృతత్వ మానశుః' అని కదా అభియుక్తులంటారు.

దయానంద, వివేకానంద, అరవిందుల దివ్యసందేశాల ఆచరణాకృతి శ్రీ మందేశ్వర శర్మగారు. ఆయన సుకృతి, గొప్పమేధావి, స్వయంభువు. లేకపోతే దేశ విదేశాలలో గొప్ప గొప్ప విశ్వ విద్యాలయాలలో రాజనీతి, తత్త్వ శాస్త్రం, సమాజ పరిణామ శాస్త్రాల తులనాత్మక అధ్యయనంలో తల పండించు కోకుండానే, శంకరులు, మార్క్స్, గాంధీల యుగ సందేశాన్ని సమన్వయింప చేయడం అనితర సాధ్యం. ప్రతి దేశానికీ యుగ కాలాల ననుసరించి ఒక సనాతన జీవన విధానమూ, స్వాత్మీయ వ్యవస్థా స్వరూపమూ,

సాంఘిక సంవిధానమూ ఉంటాయనీ, వాటి కనుగుణంగా మాత్రమే మహోద్యమాల ఫలసిద్ధి ఉంటుందనీ శర్మగారి తాత్త్వికదృక్పథం. రష్యాలో నెలకొన్న కమ్యూనిజానికీ, భారత దేశంలోని గాంధేయ విప్లవానికీ ఆదర్శంలో అట్టే తేడా ఏమీ లేదనీ, ప్రపంచంలోని ఆయా ఖండాల సాముదాయక జీవన స్థితి గతులకు, చారిత్రక సంస్కృతులకు అనుగుణంగానే సాంస్కృతిక, సాంఘిక, రాజకీయ భావవిప్లవాలు ఆయా దేశాలను ప్రభావితం చేయగలవని వారి నమ్మకం. సిద్ధాంతం కూడా. ఈ దృష్టితోనే వారు గ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతాన్ని రూపొందించారు. శ్రీ మందేశ్వర శర్మగారి భావాలు అత్యంతాధునిక సామాజిక సమస్యా పరిష్కార సాధనాలుగా ఉన్నాయి. విద్యా సంస్థలు, న్యాయస్థానాలు, రాజ్యాంగాలలో ప్రవేశపెట్ట వలసిన మౌలికమైన మార్పులు, శాసన సభలు, శాసన సభ్యులు, ఎన్నికలు, అధికార వికేంద్రీకరణం, ఆదివాసుల అభ్యున్నతి కోసం తీసుకోవలసిన చర్యలు, సాంఘిక నియంత్రణలు, పెట్టుబడి, ఉత్పత్తులు, జాతీయీకరణం, మొదలైన విషయాలను గురించి వారు వెల్లడించిన ఆశయాలు, పరమోదారమైనవి అనే మాట అట్లా ఉంచి, సమ సమాజ నిర్మాణానికి ఎంత అగత్యమైనవో అనే విషయమూ, సుమారు పాతిక ముప్ఫై సంవత్సరాలకు పూర్వమే శర్మగారు వీటిని ప్రతిపాదించి ఉండడమూ ఆయన మేధావితకు నిదర్శనమని మనకు బోధపడుతుంది. ఈ విషయాలన్నీ పారిశ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతపు ప్రచార వాహికల ద్వారా తెలుసుకోవచ్చు.

ఇటీవల శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ప్రచారం

చేస్తూ వచ్చిన సంపూర్ణ విప్లవాదర్శాలను ఇరవై ఏడు సంవత్స రాల క్రితమే శర్మగారు ప్రచురించిన వ్యాసాలలోను, చేతి పుస్తకాలలోను ప్రతిపాదించి ఉండడం చాలా ఆశ్చర్యకర మైన విషయం. ఎన్నికలలో తమ ప్రతినిధులుగా తామే ఎన్నుకొన్న ప్రజా ప్రతినిధులను అవసర మనుకొన్నప్పుడు వెనక్కు పిలిపించి వారి సభ్యత్వాలను రద్దుచేయగల అధి కారం, హక్కు, ప్రజలకుండాలి అనే ప్రతిపాదనను కూడా ఆనాడే శ్రీ శర్మగారు చేశారు. ప్రజాస్వామ్యంలో వ్యక్తి స్వేచ్ఛ పేరిట పెట్టుబడి దారీ వ్యవస్థ బలం పుంజుకోకుండా నియంత్రణ ఉండాలనీ, ఎన్నికలు ధనం విరజిమ్మ గలవారికి విహార భూములు కారాదనీ, తక్కువ ఖర్చుతో ఎన్నికలు జరిగేటట్లు ప్రభుత్వం బాధ్యత వహించవలసి ఉంటుందనీ, అభ్యర్థుల ఖర్చులు కూడా ప్రభుత్వమే భరించాలని, న్యాయ పరిపాలనలో మౌలికమైన మార్పులెన్నో తేవాలసి, బీద వాళ్ళకు త్వరితంగాను, ఖర్చులేకుండాను న్యాయం లభించా లనీ, ఇటువంటి ఆదర్శాలు వారి నవభారత శ్రామిక ధర్మ రాజ్య సిద్ధాంతాన్ని వివరిస్తూ ప్రతిపాదించారు శ్రీ శర్మగారు. విద్యావంతులంతా జాతీ యోత్పత్తి పెంచే కృషిలో నిర్మా ణాత్మకంగా పాలుపంచు కోవాలనీ, వారు గ్రామసీమల్లో విధిగా పని చేయవలసి ఉంటుందనీ, హక్కుల కన్నా ప్రజా స్వామ్యంలో విధులకే ప్రాధాన్యం వుండాలనీ ఆయన ప్రబో ధించారు. శ్రీ శర్మగారు అచ్చమైన గాంధేయవాది. ఆచర ణలో మహాత్ముని ప్రబోధాలన్నీ పాటించారు. కొండజాతి ప్రజల విద్యా వికాసాల కోసం తమ ఆస్తిని, శక్తిని ఎంత గానో వెచ్చించారు. సుమారు ముప్పై సంవత్సరాల క్రితం

భారతదేశం లోని మేధావులు ఆయన కృషిని గుర్తించారు. సర్వేపల్లి రాధాకృష్ణన్, నళినీకాంత భద్రా, కాళిదాసనాగ్ వంటి మహనీయులంతా ఆయన సిద్ధాంతాలను మెచ్చుకున్నారు. సుప్రసిద్ధ ఆదిమజాతి సేవా కార్యశీలి శ్రీ ధక్కరు బాబా శ్రీ శర్మగారింటికి వస్తూ పోతూ వీరి సేవా కార్యక్రమాలను చూచి సంతోషించే వారు. ఇంగ్లండ్ లోని సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త ఆచార్య లాస్కీ శ్రీశర్మగారి సిద్ధాంతాలు మెచ్చుకున్నారు. ఆంధ్రరాష్ట్ర జమీన్ రైతు సంఘానికి ఆంధ్ర కేసరి అధ్యక్షులుగా ఉన్నప్పుడు శ్రీ మందేశ్వర శర్మగారు కార్యదర్శి. ఆనాటి తెలుగు దేశపు రాజకీయ మేధావులలో, నిర్మాణ కార్యక్రమ ప్రబోధకులలో శర్మగారు అగ్రేసర శ్రేణిలోనే వుండేవారు.

అటువంటి శర్మగారి పుత్రిక పార్వతిగారు. సొంత డబ్బు ఖర్చుపెట్టి కొవ్వూరులో వీరసంస్మరణ మందిరం నిర్మించారు శ్రీ శర్మగారు. అజ్ఞాత వీరు లెందరిచరిత్రలో గ్రథితం చేయించారు. అటువంటి శ్రీ శర్మగారి గురించి తమ ఆత్మకథలో శ్రీమతి పార్వతి చాలా సంగతులు రాశారు. ఇందువల్ల కూడా ఈ ఆత్మకథకి ఎంతో విలువవుంది. త్యాగధనులైన శ్రీమందేశ్వర శర్మగారి గురించి, వారి సంతానం గురించి, ఆ రోజుల ముచ్చట్లు చాలా ఉత్తేజాన్ని ఆర్ద్రమైన అనుభూతులను కలిగించేవి ఈ ఆత్మకథలో ఉన్నాయి. సుమారు అరవై డెబ్భై సంవత్సరాల క్రితం సంస్కారం గల

కుటుంబాలలో బంధుప్రేమలు, దాన ధర్మాలు, పరోపకార ప్రవృత్తి, శీలసంపదలు ఏ విధంగా ఉండేవో చదువుతూ ఉంటే గొప్ప కథలూ, నవలలూ చదివినప్పటి అనుభూతి కలుగుతుంది. ఇటువంటి సన్నివేశాలు కూడా పార్వతిగారు ఇందులో వర్ణించడం పూవుకు ఆకర్షణీయమైన తావి కూడా అబ్బినట్లయింది. రచయితలూ, రచయిత్రులూ కూడా తప్పక మననం చేయాల్సిన గొప్ప భావాలు, మామూలు మాటల్లో చెప్పారు ఒకటి రెండు చోట్ల. సమాజానికి ఏ సంస్కారాన్ని మప్పాలని తహ తహ పడుతున్నారో, రచనలు చేస్తున్నారో, వారే ఆ సంస్కారాలకు వ్యక్తిగత జీవితాలలో దూరమైతే ఆ రచయితల వల్లగాని రచనల వల్లగాని ప్రయోజనం ఏముందని సున్నితంగా మందలిస్తున్నారు పార్వతిగారు. ఇది నిజం. వేదికల మీద ఉపన్యాసాలు, పత్రికలలో ప్రశంసలు, బహుమానాలు, గుర్తింపుల కోసం తహ తహ పడకుండా, నిజాయితీ, చిత్తశుద్ధి ప్రదర్శించే రచనలు కావాలని, రావాలని, శ్రీమతి పార్వతిగారు కాంక్షించడం, హెచ్చరించడం, వర్తమాన సాహితీ పరులందరూ గుర్తుంచుకోవలసిన విషయం.

తెలుగులో మహిళలు రాసిన స్వీయ చరిత్రలు వేళ్ళ మీద లెక్క పెట్ట దగినన్ని కూడా లేవు. 'అప్పారావు గారూ-నేనూ' అని ఇటీవలే పరమపదించిన శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు తమ స్వీయ జీవితానుభవాలు సాక్షరం

చేశారు. ఈమె బసవరాజు అప్పారావుగారి ఇల్లాలు. ఈజీవి తానుభవాలు ఆమె ఎంతో భావోద్వేగంతో రాశారు. రాజ్యలక్ష్మమ్మగారు మంచి కవయిత్రికూడా కనుక రచనలో స్పందన గుణం బాగా కనపడుతుంది. 'సౌదామిని' పేరుతో ఈమె రాసిన మంచి కవితలు కొన్ని 'వైతాళికులు' కవితా సంకలనంలో చూడవచ్చు. సంగం లక్ష్మీబాయమ్మగారు 'నా అనుభవములు' అనే పేరుతో తమ జీవితానుభవాలు కొన్నిటిని గ్రథితం చేశారు. లక్ష్మీబాయమ్మగారు నేడు కూడా సమాజ నిర్మాణ కార్యక్రమాలలోను, విద్యాలయాలు నిర్వహించడంలోను కృషి చేస్తున్నారు. గుంటూరులో ఆనాడు పేరు ప్రఖ్యాతులు వహించిన శారదా నికేతనంలోనూ, ఆ తరువాత మద్రాసులోని క్వీన్ మేరీస్ కాలేజిలోనూ విద్యాభ్యాసం చేసి, తమ వ్యక్తిత్వం రూపొందించుకున్నారు లక్ష్మీబాయమ్మగారు. విద్యార్థినిగా ఉన్న ఆ రోజుల అనుభవాలు కొన్నిటిని, తెలంగాణంలో రాజకీయ సంచలనపు రోజుల అనుభవాలు కొన్నిటిని, రజాకార్ దౌర్జన్యాల నాటి అనుభవాలు కొన్నిటిని, ఈఅనుభవాల పేరుతో పుస్తక రూపంగా ఆమె వెలువరించారు. మరినాకు తెలిసినంత వరకూ పుస్తక రూపాన మహిళలు రాసిన ఆత్మకథ ఇంత వరకు ఎవరిదీ వెలువడలేదు. ఇటీవల 'లత' గారు రాసిన జీవితానుభవాలు కొన్ని ఒక వార పత్రికలో వెలువడ్డాయి. కాని పుస్తక రూపంలో ఇంకా రాలేదు.

నాకు తెలిసినంత వరకు తెలుగులో వెలువడిన ఆత్మకథలలో శ్రీమతి పార్వతిగారిదే ఇప్పటికి చివరిది. మహిళలు రాసిన ఆత్మకథలో మొదటిది కూడా ఇదేనని చెప్పవచ్చు

నేమో! ఏమంటే బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారి పుస్తకం అనుభవాలు- జ్ఞాపకాలు కోవలోకి వస్తుంది. అంతేకాక బసవరాజు అప్పారావుగారి వ్యక్తిత్వ నిరూపణమే ప్రధానాంశం. మరి పార్వతిగారి ఈ ఆత్మకథ అటువంటిది కాదు. 'లత' గారి పుస్తకం పూర్తిగా చూస్తేగాని ఏ విషయమూ నిర్ధరించలేము. ఆయా రంగాలలో విశేష కృషిచేసి, లోకానికి ఉపకరించగల జీవితానుభవాలు గల మహిళామ తల్లులు వారి వారి జీవిత గాథలను తామే స్వయంగా రాసుకుంటే అవి యువతరానికి విజ్ఞానదాయకంగా ఉద్బోధ కారకంగా ఉండటంలో సందేహం లేదు. గతంలో జరిగిన మేలైన కృషిని గురించి సంస్మరించుకోవడం ఎంతైనా పునరుజ్జీవకమని పార్వతిగారు కూడా తమ ఆత్మకథలో చెప్పారు. 'కృతమెరుగుట పుణ్యము' అని సూక్తి.

యథార్థ జీవితానుభవాలు కల్పనల కథల కన్నా ఒక్కొక్కప్పుడు విస్మయానవహంగా ఉంటాయని ఇంగ్లీషులో ఒక సూక్తి ఉంది. కట్టుకథల కన్నా గడ్డు నిజాలు విచిత్రాతి విచిత్రంగా ఉంటాయని దీని భావం. కాబట్టి గొప్పగా రాసిన గొప్ప గొప్ప జీవిత చరిత్రలు, ఆత్మకథలు మన వ్యక్తిత్వాలను వాస్తవికంగా ప్రభావితం చేయగలవు- అవి జీవితాలే కాబట్టి.

నవ్య సాహిత్య పథ ప్రవర్తకుడైన వీరేశలింగం నుంచి నేటివరకూ తెలుగులో నూటికి పైగానే ఆత్మ చరిత్రలు రాసుకొనే ప్రయత్నాలు జరిగాయి. కొన్ని అసంపూర్ణాలు.. కొన్ని మరీ సంగ్రహాలు. కొన్ని రేఖా ప్రణాళికలు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి మనస్వి రాసిన స్వీయ చరిత్ర ఈ శతాబ్ది సాంఘిక పరిణామ చరిత్రగా ఉంది. దరిశి చెంచయ్యగారి 'నేనూ- నాదేశం' తెలుగులో వచ్చిన స్వీయ చరిత్రలలో ఎంతగానో మెచ్చగగింది. వీరేశలింగం స్వీయ చరిత్రను గూర్చి చెప్పేదేముంది! అది ఆధునికేతిహాసం. ఆచంట జానకిరామ్, సంజీవదేవ్‌ల ఆత్మకథలు జీవిత సౌందర్య దర్శనాలు. తమ స్వీయ చరిత్రలు ఇంగ్లీషులో రాసుకొన్న వారున్నారు కొందరు తెలుగువారు సుప్రసిద్ధ పాత్రికే యులుగాను, విద్యావేత్తలుగాను ఖ్యాతి కెక్కిన కోటంరాజు రామారావు, డి. ఎస్. శర్మ మొదలైనవారు. రాజకీయ జీవితం గడిపిన మహనీయు లెందరో తమ స్వీయ చరిత్రలు రాసుకున్నారు- కొండ వెంకటప్పయ్య పంతులు, కాశీశ్వర రావు, పట్టాభి, ప్రకాశం, మొదలైనవారు. విశ్వనాథ ఆత్మ కథ అసంపూర్ణంగా లభ్యమైంది. స్థానం నరసింహారావు గారి ఆత్మకథలో తెలుగునాట ఆధునిక దృశ్యకావ్య చరిత్ర పరమ రమణీయంగా ప్రసక్తమైంది.

వీరేశలింగం స్వీయచరిత్ర వెంటనే తెలుగులో వెలు వడ్డ స్వీయచరిత్ర రాంభొట్ల జగన్నాథశాస్త్రిగారిది. కిందటి శతాబ్ది ఉత్తరార్థంలో కళింగాంధ్రాన్ని కళ్ళముందు నిలిపే గొప్ప ఆత్మకథ జగన్నాథశాస్త్రిగారిది. రాయసం వెంకట శివుడు, వల్లూరి సూర్యనారాయణరావు, చిలకమర్తి, కే. ఎన్. కేసరి, పెద్దిభొట్ల వీరయ్య, మొదలైన మహనీయు లెందరో వివిధ రంగాలలో తెలుగువారి అభ్యుదయం కోసం కృషి చేసినవారు తమ స్వీయ చరిత్రలు రాసుకున్నారు.

వేటూరి ప్రభాకరశాస్త్రి గారి ఆత్మకథ అసంపూర్ణంగా లభ్యమవుతున్నది. తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు ఆత్మకథ పద్యాలలో రాశారు. పద్యాలలోనే రాసుకున్న జాషువా ఆత్మకథ అందరూ చదవాల్సింది.

తెలంగాణంలో పునరుజ్జీవనోద్యమంలో కృషి చేసిన రావి నారాయణరెడ్డి, మందుముల నరసింగరావు, కొండ వెంకట రంగారెడ్డి, మాదిరాజు రామకోటేశ్వరరావు గార్ల స్వీయ చరిత్రలు వచ్చాయి. కవులు, కళాకారులు, రాజకీయ వేత్తలు తమ జీవిత గాథలు వినిపించిన వారు ఇంకా చాలా మంది ఉన్నారు. పేరు పేరునా నూరుగురిని మించిన వీరందరినీ పేర్కొనడం సబబూ కాదు. సమయమూ కాదు.

ఇప్పటికే ఎన్నో రచనలు పుస్తకరూపాన తెచ్చారు శ్రీమతి పార్వతిగారు. పాతిక సంవత్సరాలనుంచి సాహిత్య కృషి చేస్తూనే ఉన్నారు. అంటే ఈ సంవత్సరం వారి సాహిత్య కృషికి రజతోత్సవం జరప వచ్చునన్న మాట. ఇప్పటికే ఎన్నో కథా సంపుటాలు, నవలలు, కవితలు, వ్యాసాలు వీరివి పుస్తకరూపంలో వచ్చాయి. ఆచార్య రంగాజీ, శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ వంటి పెద్దలు, సంజీవదేవ్, ఆర్. ఎస్. సుదర్శనం, నవీన్‌ల వంటి సృజనాత్మక ప్రతిభాశాలురు వీరి రచనలను అభినందించారు. కొన్ని గీతికలు వీరివి ఆంగ్లంలోకి కూడా అనూదితమైనవి. డా॥ గంటి శ్రీరామమూర్తిగారి వంటి ప్రతిభావంతులు, ఆంధ్రాంగ్ల సంస్కృత భాషా కోవిదులు వీరి 'కాంతివర్షం'

కవితలను ఇంగ్లీషులోకి అనువదించడం ఈమెకు సమకాలీన సాహితీ లోకంలో సముచిత స్థానాన్ని నిరూపిస్తున్నది.

తెలుగు వారి స్వీయ చరిత్రలను గూర్చి ఆసక్తితో విషయ సేకరణ చేస్తున్నానన్న విషయం విని ఆదరంతో నాకీ అవకాశం కల్పించిన సోదరి శ్రీమతి పార్వతిగారి పట్ల నేను చాలా కృతజ్ఞుణ్ణి. ఈ విధంగా శ్రీమతి పార్వతిగారి ఆత్మకథకి ముందు మాట రాయడం గొప్ప గౌరవంగా భావిస్తూ, తమ ఆత్మకథను ఆంధ్రావళి కర్పించినందు కామెను ఎంతగానో అభినందిస్తున్నాను.

—అక్కిరాజు రమాపతిరావు,
హైదరాబాదు.

కాళయుక్తి
విజయదశమి
9 - 10 - 1978

# నా మాట

(రచనా కాలం- 1977 డిసెంబరు నుంచి 78మే వరకు)

ఒక్క క్షణం కాలాన్ని వెనక్కి తిప్పి చూస్తే అన్న ఈ ఆత్మ కథని వ్రాశాను. ఆత్మకథ వ్రాయటం కూడా కొంచెం కష్టమే. ఎందు చేతనంటే స్వవిషయాలు, ఇతర విషయాలు వ్రాస్తూ ఉండాలి. అయితే అవి విసుగు కలిగించకుండా పాఠకులకు ఆసక్తి కలిగించేలా ఉండాలి. కళాత్మకంగా ఒక సుందర కావ్యంలా ఉండాలి. ఆత్మకథలలో కేవలం వాళ్ళ కుటుంబ చరిత్ర, సాహిత్యం, ఇంకా వారు చేసిన మంచి పనులని గురించే కాక, అనేక విషయాలు కూడ చోటు చేసుకుంటాయి. రచయిత మంచి కవి అయితే అతని రచనలో ఎక్కువగా కవితా శిల్పం తొణికిస లాడుతుంది. ఆధ్యాత్మికవాదైతే ఎడ నెడ ఆధ్యాత్మికత చోటు చేసు కుంటుంది. ఏవిషయం మీద చెప్పినా ఆ చెప్పేది నల్గురికి ప్రయోజనం కల్గించేదిగా ఉంచే బావుంటుంది.

మన తెలుగు వారిలో ఆత్మకథలు వ్రాసుకున్న వారు చాలాతక్కువ మందే కనిపిస్తారు. శ్రీ వీరేశలింగం గారు, శ్రీ చిలకమర్తి వారు, శ్రీ వల్లూరి సూర్యనారాయణ గారి జీవిత చరిత్రలు నేను చదివాను. నెహ్రూ, గాంధీజీల ఆత్మకథలు కూడా చదివాను. శ్రీ చలం, అచంట జానకిరామ్‌గారి సాగుతున్న యాత్ర, శ్రీమతి లత అంతరంగ తరంగాలు. ఇంకా మరి కొందరి ఆత్మకథలు చదివాను. శ్రీ శరత్‌బాబు జీవితం గూర్చి కూడా చదివాను. శ్రీ బాలగంగాధర్ తిలక్, శరత్ ఇంకా మరి కొందరి రచయితల లేఖలు ప్రచురింప బడ్డాయి-చదివాను, దీనివల్ల కూడా వారి జీవిత విశేషాలు తెలుస్తాయి. రచయితలు, సంఘ సంస్కర్తలు

# విషయ సూచిక

దేశ భక్తులు, మరే రంగంలో గొప్పవారైనా ఆత్మకథ వ్రాసుకోవడం అవసరం. ఎందుచేతనంటే వీరి పుస్తకాల వల్ల తెలిసిందంతా ఒక ఎత్తు, ఈ ఆత్మకథల వల్ల వారిని గూర్చి తెలిసింది ఒక ఎత్తుగా ఉంటుంది. వారి గురించి వారి రచనల గురించి, సేవా కార్యక్రమాల గురించి ప్రజలకి ఇతోధికంగా తెలుస్తుంది. అలాంటి గొప్ప వారెవరైనా వారి ఆత్మకథలు వ్రాసుకోకుండా మరణించి నప్పుడు వారి కుటుంబ సభ్యులు కాని, వారితో పరిచయమున్న మిత్రులుగాని వారి జీవితగాథలను వ్రాసి ప్రకటింపవచ్చు. అలా చేసినందువల్ల మరుగుపడ్డ ఎన్నో మాణిక్యాల్ని మనం సందర్శింపవచ్చు. అసలు ప్రతి ఊరిలో ఉన్న గొప్ప వ్యక్తుల్ని, ఈ తరం వారు, వెనకటి తరం వార్ని గూర్చి కూడా తెలిపే పుస్తకాలు ముద్రించ బడాలి. గొప్పవారైన ఆ వ్యక్తుల జీవిత చరిత్రలని విద్యార్థులకి పాఠ్య గ్రంథాలుగా కూడా ఉంచాలి. అలా చేసిన వాడు వారి ప్రభావం కొంత అయినా యువతరం మీద ఉండి ముందుకు రాగల్గుతారు.

రచయితకి బుద్ధి బలంతోపాటు భుజ బలం కూడా బాగా ఉండాలి. ఎందుచేతంటే ఆలోచించడానికి మేధాశక్తి ఎంత అవసరమో, వ్రాయడానికి భుజ బలం కూడా అంతే అవసరం. మనకి ఆలోచించడానికి, చెప్పడానికి శక్తి ఉండి, వ్రాయడానికి శక్తి లేకపోతే అప్పుడు లేఖకుల్ని ఆశ్రయించాలి. శ్రీ అల్లసాని పెద్దనగారిలా ఆత్మకి ఇంపైన భోజనం, ఊయల మంచం, రమణీ ప్రియదూతిక తెచ్చిచ్చు కప్పురపు విడెము ఉన్నా లేకపోయినా ఊహ తెలిసిన లేఖకోత్తము లుండాలి. ఇప్పుడలాంటి లేఖకోత్తము లెవరు కనబడరు. మనకి వ్రాయడానికి శక్తి లేకపోతే మనింట్లో వారి నెవరినైనా బతిమాలి వ్రాయించుకోవాలి. న్యాయానికి ఎవరంతట వారు బాగా ఆలోచించి స్థిమితంగా కూర్చుని వ్రాసి అది బాగోలేకపోతే మళ్ళీ కొట్టేసి ఇంకోసారి రాసుకుని అలా వెనకా ముందు చూసుకుని వ్రాస్తే బావుంటుంది. మామూలుగా కథలు,

నవలలు వ్యాసాలు ఒకరిచే చెప్పి వ్రాయించినా ఆత్మకథన్నది నిజంగా మనం చూసుకొని వ్రాసుకోకపోతే బాగా సౌందర్యంగా కుదరదు. ఎందు చేత నంటే ఇది నిజంగా జరిగిన కథ కనుక. పైకి కథలా కన్పడక పోయినా ఓ మంచి కథలా ఆసక్తి దాయకంగా వ్రాయకపోతే పాఠకులు చదవరు. కనుక దీన్ని ఎవరతంట వారే ఏ విషయం ఎలా చెప్తే బావుంటుందా అని ఆలోచించాలి. ఒక క్రమ పద్ధతిలో బాల్యం. విద్యాభ్యాసం, కుటుంబ చరిత్ర, సాహిత్య విశేషాలు, కొన్ని ముఖ్య విషయాలు ఇలా ప్రత్యేకంగా విభాగించి వ్రాసుకు పోతే పాఠకులకి, రీసెర్చ్ స్కాలర్స్‌కి ప్రయోజనకారిగా ఉంటుంది.

కొందరు ఆత్మకథలో వ్యక్తిగత జీవితానికి, వాళ్ళ విశేషాలకి ఎక్కువ ప్రాముఖ్యత నిస్తారు. మరికొందరు ఇతర విషయాలకి ప్రాముఖ్యత నిస్తారు ఏదైనా ఈ రెండూ అవసరమే నేను వయస్సులో అంత పెద్దదాన్ని కాకపోయినా కొన్ని ఏళ్ళనుంచి గుండె నొప్పితో బాధపడ్తూ శరీర బలం లేకుండా ఉన్నాను. అందుచేత భుజ బలం సన్నగిల్లింది. మా పిల్లలకి ఖాళీ ఉన్నప్పుడు అప్పుడప్పుడు కొన్ని విషయాలు చెప్పి వాళ్ళచేత వ్రాయించాను దీన్ని. అందుచేత దీన్లో వరుస క్రమంలో విషయాలన్నీ రాకపోవచ్చు. కాని మొత్తంమీద చెప్ప దల్చుకున్న విషయాలు చాలా చెప్పాను. ఇందులో ఉన్న మంచి గ్రహించి విజ్ఞులైన వారు, పాఠకులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని తలుస్తాను.

మా నాన్నగారు కీ॥ శే రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారు గాంధీజీ శిష్యులు ప్రముఖ కాంగ్రెస్ నాయకులు. దేశం కోసం నిస్వార్థంగా పని చేసిన వారు. గొప్ప రచయితలు. వారి గురించి, వారి కృతుల గురించి తెలుసుకోవాలన్న వారిక్కూడా ఈ పుస్తకం ఉప

యోగిస్తుంది. నేను ఏమంత గొప్ప వ్యక్తిని కానుగాని ఒక రచయిత్రిగా నా రచనల గురించి, జీవిత విశేషాల గురించి కొన్ని మంచి విషయాల గురించి, మా నాన్నగారి కృషి గురించి, నలుగురికీ తెలియాలని ఈ స్వీయచరిత్రని వ్రాశాను. ఎప్పుడూ నన్నాదరిస్తూ వస్తున్న ఆంధ్ర పాఠకలోకం ఈ రచనని కూడా ఆదరిస్తారని తలుస్తాను.

మీ రచయిత్రి,
అడవికొలను పార్వతి,
గాంధీనగర్, చామర్తివారి వీధి,
కాకినాడ_4.

# కృతజ్ఞతలు

ఈ ఆత్మకథకు నాయందు ఎంతో ఆదరంతో ముందు మాట వ్రాసిన సోదరులు, సుప్రసిద్ధ రచయితలు, పరిశోధకులు డా॥ అక్కిరాజు రమాపతిరావుగార్కి (మంజుశ్రీ) నా కృతజ్ఞతలు. ఈ పుస్తకం అత్యంత శ్రద్ధతో చదివి నాకు తగు సూచనలిచ్చిన సోదరులు డా॥ జి. శ్రీరామమూర్తిగార్కి నా కృతజ్ఞతలు.

ముఖ చిత్రాన్ని అందంగా అలంకరించిన యువ చిత్రకారుడు చి॥ ఈశ్వర్‌కు నా ఆశీస్సులు. ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించిన ప్రోగ్రెసివ్ ప్రింటర్స్‌కి నా కృతజ్ఞతలు.

—ఆడెపికొలను పార్వతి

అపర్ణా పబ్లికేషన్స్,
గాంధీనగర్,
కాకినాడ — 4.

# ఒక్కక్షణం కాలాన్ని వెనక్కిత్రిప్పిచూస్తే
## (ఆత్మకథ)

### నా మొట్టమొదటి జ్ఞాపకం

నాకిప్పటికీ నాలుగే ళ్ళుంటాయి. కొవ్వూరులో మా యింట్లో రాధా మనోహరం చెట్టుంది. మొక్కలను మేకలు తినకుండా వెదురు కర్రతో దడి కట్టారు. నేను జడ విరబోసుకుని రంగు పెన్సిలుతో దడిమీద గీతలు గీస్తున్నాను. ఇంతలో పని మనుషులు ఎవరో వచ్చి తమ్ముడికి నీళ్ళు పోస్తున్నాము. నువ్వు కూడా రా అని తీసుకు వెళ్ళారు. అప్పటి నుండి నాకు జ్ఞాపకం ఉంది. మా తమ్ముడు పుట్టి ఆ రోజుకి 11వ రోజు. పురిటి స్నానం ఆ వేళ. పురిటి స్నానం అప్పుడు ఎడపిల్లని పక్కన కూర్చోబెట్టుకుని నీళ్ళుపోస్తే కీడు పోతుందని అంటారు.

### మా వంశం - నా బాల్యం

ప్రసిద్ధ రచయితలు ప్రముఖ కాంగ్రెస్ నాయకులు కీ॥ శే॥ రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారు మా నాన్నగారు. ఆయన తల్లిదండ్రులు కీ॥ శే॥ రామయ్య, సీతమ్మగార్లకి చాలామంది పిల్లలు పుట్టి పోగా మిగిలిన ఒకే ఒక్క కొడుకు. మా నాన్నగార్కి ఒకే ఒక్క చెల్లెలు వేమూరి అమ్మాయమ్మగారు! మా నాన్నగారిలా దేశంకోసం సర్వ

స్వం త్యాగం చేసిన కీ॥ శే॥ వేమూరి రామకృష్ణారావుగారు ఆమె భర్త.

నా చిన్నప్పుడు మా నాన్నగారు ఇంట్లో ఉండడం అరుదు. కాంగ్రెస్ ఉద్యమంలో తిరుగుతూ ఉండేవారు. మా ఇంట్లో అందరూ ఖద్దరు కట్టుకునే వాళ్ళం. మా నాన్న గారు అప్పుడప్పుడు ఊళ్ళో ఉన్నప్పుడు మటుకు రాత్రి మా హాల్లో చాపవేసుకుని కూర్చుని పేపరు చదువుతూ పేప ర్లోని విశేషాలు చెప్తూ ఉండేవారు గాంధీజీ సిద్ధాంతాలు తుచ తప్పక ఆచరించేవారు.

మా ఇంట్లో చాప, తివాసీ తప్ప కుర్చీలు గాని, సోఫాలుగాని వాడేవారు కారు, నిరాడంబరంగా ఉండాలని. 7, 8 సంవత్సరాలుంటాయనుకుంటాను. అప్పుడు ఆయన నేటి భారతి రాజ్యాంగమో లేక రాజ్యాంగ వివేకమో అనే పుస్త కాన్ని నోటికి చెప్తూంటే ఇటీవలే స్వర్గస్థులైన సోదరులు కీ॥ శే॥ కళాప్రపూర్ణ అప్పారావుగారు రాస్తూండేవారు. ఆయన అక్షరాలు చాలా చిన్నవిగా సన్నగా ఉండేవి. గాంధీ జీకి నెహ్రూలాగ శ్రీ రామకృష్ణ పరమహంసకి శ్రీ వివేకా నందునిగా మా నాన్నగారికి ముఖ్యమైన ప్రియశిష్యులు అప్పారావుగారు. నేను పుట్టినప్పుడు అంటే 1931 లో మా నాన్నగారు స్వాతంత్ర్య సమరంలో జైలుకెళ్ళారు. అందుకని నా బారసాల చెయ్యలేదు.

మా అమ్మగారి పేరు లక్ష్మీనరసమ్మగారు. ఆమె తండ్రి కీ॥ శే॥ బోడపాటి రాజన్నగారు తుని, బొబ్బిలి, దారా కోట, సాలూరు సంస్థానాలలో దివానుగా ఉండేవారు. నీతికి నిజాయితీకి పేరెన్నికగన్న వ్యక్తి. ఆయన బ్రాహ్మణులయినా

సరే నిద్రపోతుంటే లేపేవారు కారు. మా అమ్మమ్మగారు పార్వతమ్మగారు. కల్లా కపటం ఎరుగని వ్యక్తి. ఆవిడకు ఆరుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. కడుపు శోకం ఎరుగని చల్లనితల్లి. ఆవిడ. ఆవిడ పేరే నాది. మేము ముగ్గురం అక్కచెల్లెళ్ళం. ఇద్దరు అన్నదమ్ములు. నేను 22-3-1931న అనకాపల్లిలో జన్మించాను. మా రెండో మేనమామ శ్రీ బోడపాటి నారాయణమూర్తి గారు అక్కడ ఇంజనీరుగా ఉండేవారు. మా అమ్మగార్ని పురిటికి తీసుకెళ్ళారు. మా నాన్నగారు అమ్మగారు ప్రకృతి వైద్యంచేసి పూర్తిగా అపక్వాహారంతో ఉండేవారు. పుట్టాక నాకు కూడా ప్రకృతి వైద్యమే. పళ్ళరసం, మేకపాలు పట్టేవారు. తొట్టెస్నానం చేయించేవారు. సూరన్న అని మా ఇంట్లో నమ్మకమైన నౌకరు ఉండేవాడు. వాడే నన్ను పెంచాడు. పెద్దయ్యాక కూడా వాడిని చూస్తే పెంచిన విశ్వాసం కొద్దీ నాకెంతో ఆప్యాయంగా ఉండేది. నేను పుట్టినపుడు నాన్నగారు జైలులో ఉండటం వలన నాకు బారసాల చేసి పేరు పెట్టలేదు.

మా నాన్నగారు జైలునుంచి వచ్చాక షేక్స్పియర్ నాటకంలోని ఒక పాత్ర పేరుతో నన్ను పిలిచేవారు. చాలా రోజులు ఆ పేరుతోనే అందరూ పిలిచేవారు తరువాత మా అమ్మగారు వాళ్ళ అమ్మ పేరుతో పిలవసాగరు. అప్పుడప్పుడు మా నాన్నగారితో సభలకి వెళ్ళేదాన్ని. సుప్రసిద్ధులు కీ॥ శే॥ వల్లూరి సూర్యనారాయణరావు గారిది మా ఊరే (కొవ్వూరు). అప్పటికి నాకు 8 సం॥రాలు గాని ఉండవనుకుంటాను. మా నాన్న గారితో కూడా ఒకసారి వాళ్ళింటికి వెళ్లాను ఆయనతో మాట్లాడి ఇంటికి వస్తుంటే మా నాన్న

స్వం త్యాగం చేసిన కీ॥ శే॥ వేమూరి రామకృష్ణారావుగారు ఆమె భర్త.

నా చిన్నప్పుడు మా నాన్నగారు ఇంట్లో ఉండడం అరుదు. కాంగ్రెస్ ఉద్యమంలో తిరుగుతూ ఉండేవారు. మా ఇంట్లో అందరూ ఖద్దరు కట్టుకునే వాళ్ళం. మా నాన్నగారు అప్పుడప్పుడు ఊళ్ళో ఉన్నప్పుడు మటుకు రాత్రి మా హాల్లో చాపవేసుకుని కూర్చుని పేపరు చదువుతూ పేపర్లోని విశేషాలు చెప్తూ ఉండేవారు గాంధీజీ సిద్ధాంతాలు తుచ తప్పక ఆచరించేవారు.

మా ఇంట్లో చాప, తివాసీ తప్ప కుర్చీలు గాని, సోఫాలుగాని వాడేవారు కారు, నిరాడంబరంగా ఉండాలని. 7, 8 సంవత్సరాలుంటా యనుకుంటాను. అప్పుడు ఆయన నేటి భారత రాజ్యాంగమో లేక రాజ్యాంగ వివేకమో అనే పుస్తకాన్ని నోటితో చెప్తూంటే ఇటీవలే స్వర్గస్థులైన సోదరులు కీ॥ శే॥ కళాప్రపూర్ణ అప్పారావుగారు రాస్తూండేవారు. ఆయన అక్షరాలు చాలా చిన్నవిగా సన్నగా ఉండేవి. గాంధీజీకి నెహ్రూలాగ శ్రీరామకృష్ణ పరమహంసకి శ్రీ వివేకానందునిలాగ మా నాన్నగారికి ముఖ్యమైన ప్రియశిష్యులు అప్పారావుగారు. నేను పుట్టినప్పుడు అంటే 1931 లో మా నాన్నగారు స్వాతంత్ర్య సమరంలో జైలుకెళ్ళారు. అందుకని నా బారసాల చెయ్యలేదు.

మా అమ్మగారి పేరు లక్ష్మీనరసమ్మగారు. ఆమె తండ్రి కీ॥ శే॥ బోడపాటి రాజన్నగారు తుని, బొబ్బిలి, దారాకోట, సాలూరు సంస్థానాలలో దివానుగా ఉండేవారు. నీతికి నిజాయితీకి పేరెన్నిక గన్న వ్యక్తి. ఆయన బ్రతికోతునయినా

సరే నిద్రపోతుంటే లేపేవారు కారు. మా అమ్మమ్మగారు పార్వతమ్మగారు. కల్లా కపటం ఎరుగని వ్యక్తి. ఆవిడకు ఆరుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. కడుపు శోకం ఎరుగని చల్లనితల్లి. ఆవిడ. ఆవిడ పేరే నాది. మేము ముగ్గురం అక్కచెల్లెళ్ళం. ఇద్దరు అన్నదమ్ములు. నేను 22-3-1931న అనకాపల్లిలో జన్మించాను. మా రెండో మేనమామ శ్రీ బోడపాటి నారాయణమూర్తి గారు అక్కడ ఇంజనీరుగా ఉండేవారు. మా అమ్మగార్ని పురిటికి తీసుకెళ్ళారు. మా నాన్నగారు అమ్మగారు ప్రకృతి వైద్యంచేసి పూర్తిగా అపక్వాహారంతో ఉండేవారు. పుట్టాక నాకు కూడా ప్రకృతి వైద్యమే. పళ్ళరసం, మేకపాలు పట్టేవారు. తొట్టెస్నానం చేయించేవారు. సూరన్న అని మా ఇంట్లో నమ్మకమైన నౌకరు ఉండేవాడు. వాడే నన్ను పెంచాడు. పెద్దయ్యాక కూడా వాడిని చూస్తే పెంచిన విశ్వాసం కొద్దీ నాకెంతో ఆప్యాయంగా ఉండేది. నేను పుట్టినపుడు నాన్నగారు జైలులో ఉండటం వలన నాకు బారసాల చేసి పేరు పెట్టలేదు.

మా నాన్నగారు జైలునుంచి వచ్చాక షేక్స్‌పియర్ నాటకంలోని ఒక పాత్ర పేరుతో నన్ను పిలిచేవారు. చాలా రోజులు ఆ పేరుతోనే అందరూ పిలిచేవారు తరువాత మా అమ్మగారు వాళ్ళ అమ్మ పేరుతో పిలవసాగరు. అప్పుడప్పుడు మా నాన్నగారితో సభలకి వెళ్ళేదాన్ని. సుప్రసిద్ధులు కీ॥ శే॥ వల్లూరి సూర్యనారాయణరావు గారిది మా ఊరే (కొవ్వూరు). అప్పటికి నాకు 8 సం॥రాలు గాని ఉండవనుకుంటాను. మా నాన్న గారితో కూడా ఒకసారి వాళ్ళింటికి వెళ్లాను ఆయనతో మాట్లాడి ఇంటికి వస్తుంటే మా నాన్న

గారిని దారిలో ఇలా అడిగాను. "నాన్నా! నువ్వెందుకు ఆయనకు నమస్కారం పెట్టావు. ఆయన మళ్ళీ నీ కెందుకు పెట్టా" రని. అలా చెయ్యడం మర్యాదని చెప్పారు. సాయంత్రం మా వీథరుగు మీద ఉన్న బెంచీపై కూర్చుని జుట్టు నెరిసిన వృద్ధుడు ఆవాల్టి ఇంగ్లీషు పేపర్లోని వాక్యాల్ని పైకి రాగ వరుసలో గట్టిగా చదివేవారు. ఆయనే ఆంధ్రుల చరిత్ర వ్రాసిన మనీషి కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారు. అప్పట్లో ఆయన గొప్పతనం నాకు తెలియదు. కొవ్వూరులో హైస్కూల్లో నేను థర్డ్ ఫారం ప్యాసు అయ్యాక పెద్ద మనిషి నయ్యానని స్కూలు మాన్పించారు మావాళ్ళు.

## నా వివాహం

14 సం॥రాలు నిండగానే పెళ్ళి చేశారు. కీ॥ శే॥ రావు సాహెబ్ అడవికొలను వేణుగోపాలరావుగారు (డిస్ట్రిక్ట్ జడ్జి) మా మామగారు. వారి మూడో అబ్బాయి మావారు. శ్రీ సాంబశివరావుగారు బి. కాం. ఇన్‌కమ్ టాక్స్ ఇన్‌స్పెక్టర్ గా ఉంటున్నారు. మా అత్తవారి ఊరు వైజాగ్. స్కూల్లోకూడా మా నాన్నగారు తెలుగు వద్దు సంస్కృతం తీసుకోమనేవారు. అందువల్ల నేను సంస్కృతం కూడా నేర్చుకున్నాను. నేను ఎక్కువగా మంచి పుస్తకాలు చదివేదాన్ని. చిన్నతనంలోనే పెళ్ళి అయి కాపురం, ఆ తర్వాత పిల్లలు. మా అత్తగారిది పెద్దకుటుంబం. అక్కడ ఆడవారికి ఎప్పుడు పనిపాటలతో సరిపోయేది. కొవ్వూరులో మా పుట్టింటి కొచ్చి నప్పుడు ఎక్కువగా చదువుకోవటానికి వీలయ్యేది, నాకు నల్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు. రుక్మిణి పుట్టే

గారిని దారిలో ఇలా అడిగాను. "నాన్నా! నువ్వెందుకు ఆయనకు నమస్కారం పెట్టావు. ఆయన మళ్ళీ నీ కెందుకు పెట్టా" రని. అలా చెయ్యడం మర్యాదని చెప్పారు. సాయంత్రం మా వీధరుగు మీద ఉన్న బెంచీపై కూర్చుని జుట్టు నెరిసిన వృద్ధుడు ఆవాల్టి ఇంగ్లీషు పేపర్లోని వాక్యాల్ని పైకి రాగ వరుసలో గట్టిగా చదివేవారు. ఆయనే ఆంధ్రుల చరిత్ర వ్రాసిన మనీషి కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారు. అప్పట్లో ఆయన గొప్పతనం నాకు తెలియదు. కొవ్వూరులో హైస్కూల్లో నేను థర్డ్‌ఫారం ప్యాసు అయ్యాక పెద్ద మనిషి నయ్యానని స్కూలు మాన్పించారు మావాళ్ళు.

## నా వివాహం

14 సం॥రాలు నిండగానే పెళ్ళి చేశారు. కీ॥ శే॥ రావు సాహెబ్ అడవికొలను వేణుగోపాలరావుగారు (డిస్ట్రిక్ట్ జడ్జి) మా మామగారు. వారి మూడో అబ్బాయి మావారు. శ్రీ సాంబశివరావుగారు బి. కాం. ఇన్‌కమ్ టాక్స్ ఇన్‌స్పెక్టర్‌గా ఉంటున్నారు. మా అత్తవారి ఊరు వైజాగ్. స్కూల్లోకూడా మా నాన్నగారు తెలుగు బదులు సంస్కృతం తీసుకోమనేవారు. అందువల్ల నేను సంస్కృతం కూడా నేర్చుకున్నాను. నేను ఎక్కువగా మంచి పుస్తకాలు చదివేదాన్ని. చిన్నతనంలోనే పెళ్ళి అయి కాపురం, ఆ తర్వాత పిల్లలు. మా అత్తగారిది పెద్దకుటుంబం. అక్కడ ఆడవారికి ఎప్పుడు పనిపాటలతో సరిపోయేది. కొవ్వూరులో మా పుట్టింటికొచ్చి నప్పుడు ఎక్కువగా చదువుకోవటానికి వీలయ్యేది. నాకు నల్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు. రుక్మిణి పుట్టే

సరికి నాకు 13 సం॥రాలు నిండాయి. ఆ అమ్మాయి డాక్టరు. ఆమె భర్త శ్రీ అత్తిలి వెంకటరత్నం డాక్టరు. ఎమ్. డి. తను కూడా మంచి రచయిత. కథలు, నవలలు బాగా వ్రాస్తాడు. వాళ్ళిప్పుడు జాంబియాలో ఉంటున్నారు. వాళ్ళ కొక అమ్మాయి, అబ్బాయి. మా అమ్మాయి కూతురు భారతిని కడుపుతున్నప్పుడు ఇటీవలే స్వర్గస్థులైన సుప్రసిద్ధ రచయితలు కీ॥ శే॥ ముక్కపాటి నరసింహశాస్త్రి గారు యిలా అన్నారు నాతో - "ఇదేమిటమ్మా మీ అమ్మాయి ఇంత చిన్నప్పుడే నిన్ను అమ్మమ్మని చేస్తోంది. కొన్నాళ్ళు ఆగకుండా" అని.

## నా మొదటి రచన - సాహిత్యం గురించి

నా మొదటి రచన ఆంధ్ర సచిత్ర వారపత్రిక వనితాలోకంలో ప్రచురితమైంది. 14-5-1952 చల్లని చూపు-చల్లని మాట అన్నది. 25 సం॥ రాలనుండి ఎన్నో కథలు, వ్యాసాలు, పద్యాలు, నవలలు, గేయాలు వ్రాశాను. అన్ని అచ్చయ్యాయి. స్త్రీగా పుట్టి, ఎన్నో కష్ట నిష్ఠూరాలు ఎదుర్కొన్నాను. సమాజంలో ఎంతోమంది స్త్రీల జీవితాల్ని పరిశీలించాను. అందుకని నేను ఎక్కువగా స్త్రీల సమస్యల మీద కథలు, నవలలు, గేయాలు, వ్యాసాలు వ్రాశాను. విశాలాంధ్రలో వారం వారం ప్రచురింపబడే 'మహిళాభ్యుదయం' శీర్షికలో నా ఎన్నో వ్యాసాలు అచ్చయ్యాయి. అప్పుడు ప్రసిద్ధ రచయితలు పూజ్యులు శ్రీ మహీధర రామమోహన రావుగారు ఇలా అన్నారు నాతో - "మీరు చెప్పదల్చుకున్న విషయాలు కథగా వ్రాస్తే ఇంకా ప్రయోజనం ఇతోధి

కంగా ఉంటుం" దన్నారు. అప్పటి నుంచి కథలు వ్రాయటం మొదలు పెట్టాను. నా మొదటి కథ 'అబల' అన్నది జయశ్రీ వారపత్రికలో అచ్చయ్యింది. ఆ కథకి ఒక్కదానికే నేను పెన్ నేమ్ 'వారిజ' అని పెట్టుకున్నాను. ఇటీవలే నేను ప్రచురించిన 'మందారమాల' కథాసంపుటిలో ఆ కథ కూడా ఉంది. తెలుగులో వెలువడుతున్న పెద్ద, చిన్న పత్రికలు 60 దాకా ఉంటాయి. వాటిలో నా రచనలు అసంఖ్యాకంగా ప్రచురింపబడ్డాయి.

కొవ్వూరులో మా పుట్టింట్లో సంస్కృత పాఠశాల విద్యార్థులకి రోజూ వారా లుండేవి. వాళ్ళ దగ్గర నేను పుస్తకాలు తీసుకొని చదువుకొని నా అంతట నేనే ఛందస్సులో పద్యాలు వ్రాయడం మొదలు పెట్టాను. ఆ పద్యాలలో కొన్నింటిని 'నీలాంబరా' లనే పుస్తకం క్రింద తీసుకు రాదల్చుకున్నాను. 1978 లో నా గేయాలు కొన్నిటిని 'ఉదయ పవనాలనే' పేరుతో పుస్తకం క్రింద ప్రచురించిన తరువాత వలయంలో బాపిస, పద్మాలు—పారిజాతాలు, మందారాల మాల లనే కథాసంపుటాలు ప్రచురించాను.

'అరుణ కిరణా'లనే అభ్యుదయ కవితా సంపుటికి సాహిత్య అకాడమి 500 రు. ధన సహాయం చేసింది. వ్యాస పద్మం అనే వ్యాస సంపుటిని ప్రచురించారు. 'కాంతివర్షం' అనే వచన కవిత అచ్చయింది. దాంట్లోని గేయాల్ని ఇంగ్లీషులోకి అనకాపల్లి కాలేజీ వైస్‌ప్రిన్స్‌పాల్ డా॥ జి. శ్రీరామ మూర్తి గారు అనువాదం చేశారు. ఇంగ్లీషు, తెలుగు కలిపి ముద్రించాను. 'రెండుతరాల(స్త్రీ)' అనే నవల విజయవాడలోని జయంతి పబ్లికేషన్స్ వారు అచ్చువేశారు 'తిరగ

బడ్డ నవతరం' అనేనవల జయశ్రీ మంత్లీ సీరియల్‌గా వచ్చింది. ఈ నవల విజయవాడలోని వాహినీ పబ్లికేషన్స్‌వారు ముద్రించారు. ఈ రెండు నవలలు స్త్రీల సమస్యలను తీసుకొని వ్రాయబడినవే. "సాహిత్యం నాకు హాబీకాదు జీవితం కన్నా ప్రియమైనట్టిది. బాధ్యతాయుత మైనట్టిది. సమాజంలో అన్యాయాలు తొలగిపోయి నవ సమాజ నిర్మాణం జరగాలని నా ఆకాంక్ష." సోదరులు శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ గారు (క్వాలిటీ పబ్లిషర్స్) నా రచనల మీద ఇచ్చిన అభిప్రాయము నాకెంతో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తున్నాయి. నాకృషిని గుర్తించారు వీరు. ఇలా అన్నారు: "మీ అరుణ కిరణాలు ఏకబిగిన చదివాననేకంటే మీ పుస్తకం చదివించింది అంటే బావుంటుంది. మీరు మంచి మాత్రా ఛందస్సు ఉన్న వచన కవిత వ్రాశారు. స్త్రీలలో మీలా వ్రాసేవారు లేరుకదా!

"మీ మందారాలమాల చాలా చాలా మంచి ఉత్తమ ఉన్నతమైన గ్రంథం. సాంప్రదాయ మధ్యతరగతి కుటుంబాల లోని స్త్రీలు చాలామంది మీరు వ్రాసిన ఏదో ఒక సంఘటనకి గురి అవుతారు. అది నిజం. అలాంటి పుస్తకం ఇలాంటి ప్రత్యేక సమస్యల మీద వచ్చినది, తెలుగు సాహిత్యంలో ఇదే మొదటిది. అందుకు మీకు జాతి ఋణపడి ఉంది. ఇంతవరకు ఈ సమస్యల మీద ఏ ఆడ రచయితలు కనీసం ఆడంగి రచయితలైనా వ్రాస్తే బావుంటుంది అనుకునే వాడిని. ఇప్పుడు మీరు అసలైన ఆడవారై యుండి వ్రాసి ఎంతో ఉపకారం చేశారు సాహిత్యానికి. అందుకు నా ధన్యవాదాలు. మీ రచనలు ముఖ్యంగా ఈ రెండు పుస్తకాలు

అమూల్యమైనవి. తెలుగు జాతికి ముఖ్యంగా స్త్రీజాతికి మందారాలమాల పెట్టని ఆభరణం." ఇప్పటికీ నేను ఎక్కువగా మంచి మంచి గ్రంథాలు, తెలుగులో వెలువడే అన్ని పేపర్లు చదువుతాను నేనేమంత గొప్ప వ్యక్తిని కాను. దేశం కోసం పెద్ద పెద్ద త్యాగాలు చెయ్యలేదు. అయినా నాకున్న పరిధిలో సాహిత్యం ద్వారా సమాజంలోని కుళ్ళును కడిగేసి మంచిని పెంచాలని నా ఆశయం. నా రచన అందుకు ఏ మాత్రం సహకరించినా అదే నా కృషికి ఫలితం.

* * *

మా నాన్నగారి నుండి సాహిత్యం నాకు వారసత్వంగా సంక్రమించింది. ఆయ నెప్పుడూ ఒక్క క్షణం వృథాగా గడిపేవారు కారు. వ్రాసుకుంటూనో, చదువుకుంటూనో, పనిలోనో గడిపేవారు. ఎందుకమ్మా ఈ ఆడవాళ్ళు గంటల తరబడి వంటింట్లోనే కాలక్షేపం చేస్తారు? ప్రతి క్షణం తనకైనా ఉపయోగ పడాలి. దేశానికైనా ఉపయోగపడాలి అని అనేవారు. ఆయన కెవరైనా ఊర్కే మాట్లాడుతూ గంటల తరబడి కూర్చోవడం ఇష్టం ఉండేది కాదు.

నాన్నగారు మార్క్స్, గాంధీ, శంకరాచార్యుల సిద్ధాంతాలని సమన్వయం చేస్తూ శ్రామిక ధర్మ రాజ్య అనే కొత్తసిద్ధాంతాన్ని రూపొందించారు. మొట్టమొదటిసారిగా ఆ సిద్ధాంతాలలోని విషయాల్ని నాకు చెప్తూ ఉండేవారు. ఈ సిద్ధాంతాన్ని డా॥ రాధాకృష్ణన్, పండిట్ విశ్వబంధు శాస్త్రి, డా॥ కాళిదాసు నాగ్, ప్రొఫెసరు ఆత్రేయ మొ॥ పెద్దలు మెచ్చుకున్నారు. ఆంధ్రా యూనివర్సిటీలో కూడా రాధాకృష్ణన్ అధ్యక్షతన ఉపన్యాసాలు ఇచ్చారు.

మద్రాసు, ఢిల్లీలో సెంటర్లు ఏర్పాటు చేసి సెక్రటరీలను పెట్టి ప్రచారం చేశారు. ఈసిద్ధాంతం మీద తెలుగు ఇంగ్లీషు లో పుస్తకాలు వ్రాశారు. మొదటిసారిగా ఈ పుస్తకం గురించి మోడ్రన్ రివ్యూ ప్రకటించింది. మోడ్రన్ రివ్యూ ఎడిటర్ నళినీ కాంత్ భద్రాకి ఈ సిద్ధాంతం అంటే చాలా ఇష్టం. మానాన్న గారంటే గౌరవం. కలకత్తా నుంచి కొవ్వూరు వస్తూ ఉండేవారు. మానాన్న గార్కి గాంధీ, మార్క్సు, శంకరాచార్యుల సిద్ధాంతాలంటే ఒకే గౌరవం ఉండేది.

మా పెళ్ళిళ్ళు అయినప్పుడు గాంధీగారి ఫోటో ఎదురుగా పెట్టేవారు. మా హాల్లో ఎదురుగా గోడపై గాంధీ గారి ఫోటో ఉండేది. ఆ ఫోటో క్రింద అచ్చులో "పరిత్రాణాయ సాధూనాం"అనే గీతా శ్లోకం వ్రాసి ఉండేది. నాన్న గారు రోజూ తకిలి వడికేవారు. నేనుకూడా చిన్నప్పుడు వడికేదాన్ని. మా ఇంట్లో అందరం ఖద్దరు కట్టేవాళ్ళం. నాన్నగారు దుప్పట్లు, గలేబులు కూడా ఖద్దరే వాడేవారు. వృద్ధులైన మా తాతగారు, బామ్మగారుకూడా ఖద్దరే కట్టే వారుట. అప్పుడు ఖద్దరు చీరలు చాలా ముతకగా వచ్చేవిట. మా బామ్మగారు ఉతకలేక కట్టుకోలేక అవస్థ పడుతుంటే చుట్టు ప్రక్కల వాళ్ళు ఇలా అనేవారట. పోనీ మీరు పెద్ద వారు ఆ బట్టలు మానేయకూడదా, అవస్థ పడుతున్నారని. మా కొడుకు కాంగ్రెసులో పని చేస్తుంటే ఎలాగండీ మిల్లు బట్టలు కట్టడం అనే వారుట.

మొదటి సారిగా మా నాన్నగారు భారత వస్త్ర పరిశ్రమల చరిత్ర అనే పుస్తకాన్ని వ్రాశారు. అవి ఇప్పుడు

ప్రతులు లేవు. ఆ పుస్తకాన్ని చిన్నతనంలోనే చనిపోయిన వాళ్ళ పెద్దక్క సీతామణి గార్కి అంకితం ఇచ్చారు నాన్న.

"నాన్నా! నువ్వెందుకు ఆత్మకథ వ్రాసుకోలేదు?" అని అడిగాను ఒకసారి.

"నా డైరీలో పాయింట్సు నోట్ చేశాను. ఎవరైనా వ్రాయాలి" అన్నారు.

ఆయన వ్రాసిన రాజ్యాంగ వివేకం అనే పుస్తకం (ఆర్థిక రాజకీయ గ్రంథం) నాగపూర్ యూనివర్సిటీలో బి. ఏ. వాళ్ళకి కొన్నాళ్ళు పాఠ్య గ్రంథం క్రింద పెట్టారు. లండన్‌లోని ప్రొఫెసర్ లాస్కీ వంటివారు ఆయన గ్రంథాల్ని మెచ్చుకున్నారు. 'రాజ్యాంగ వివేకం' రెండవ భాగం ఇంకా ప్రచురించవలసి ఉంది. అది వ్రాత ప్రతి ఉంది. పుస్తక రూపంలో తేవాలి.

194? వ సం॥ రంలో కొవ్వూరులో గోదావరి నది వడ్డున వీర సంస్మరణ మందిరం అనే ఒక బిల్డింగు కట్టించారు- కాంగ్రెస్ లోని మృతవీరుల సంస్మరణార్థం. స్వాతంత్ర్యం రాగానే ముందు చెయ్యాల్సిన పని కాంగ్రెస్ లోని మృత వీరుల జీవిత చరిత్రలు సేకరించి ప్రచురించి, వారిని సంస్మరించాలని కాంగ్రెస్ పెద్దలు నిర్ణయించారుట. ఆ పని స్వాతంత్ర్యం వచ్చాక ఎవ్వరూ చెయ్యలేదు. కాంగ్రెస్ లోని చిన్న, పెద్ద లందరు పదవుల కోసం ఎగబడ్డారు. మా నాన్న గారు జ్ఞాపకం చేసినా ఎవరూ వినిపించుకోలేదు. ఆయన స్వంత డబ్బుతో 10, 000రు॥ ఖర్చుపెట్టి కాంగ్రెస్ లోని మృతవీరుల జీవిత చరిత్రలు సేకరించి "ఆంధ్రవీర సంస్మరణ కుసుమాంజలి" అనే పుస్తకాన్ని ప్రచురించారు. కాంగ్రె

సులో పని చేసిన కలగ సత్యన్నారాయణ గారనే మిత్రుడు ఊరూరా వెళ్ళి జీవిత చరిత్రలు సేకరించారు. ఈ పుస్తకాన్ని లైబ్రరీలు అన్నీ తీసుకునేటట్లు ఆర్డరు వేయించమని నాన్న గారు అధికారంలో ఉన్న పాత మిత్రుని అడగ్గా ఆయన వినిపించుకోలేదు. ఈ పుస్తకాలన్నీ అలా పడి ఉన్నాయి. ఎంతోమంది స్వాతంత్ర్య సమరంలో పనిచేసి ఆస్తులని పెద్ద ఉద్యోగాలని త్యాగం చేశారు. దరిద్రులైపోయారు. ఎంతో వెలుగు లోకి రావలసిన వారి పిల్లలకి చదువులు చెప్పించుకోలేక పోయారు. ఆడపిల్లలకి కట్నాలు ఇచ్చి మంచి సంబంధాలు తేలేక పోయారు. రెండో పెళ్ళి వాడికిచ్చి పెళ్ళిళ్ళు చేసి ఉంటారు. అలా కొన్ని లక్షల కుటుంబాలు చేసిన త్యాగాల ఫలితంగా మనకీ నాడు స్వాతంత్ర్యం వచ్చింది. కాని దానిని అనుభవిస్తున్నది ధనిక భూస్వాములు, పెట్టుబడి దారులు, అవకాశవాదులు. ఆ మహాత్యాగుల పిల్లలు ఏదైనా చిన్న ఉద్యోగం కోసం రికమెండేషన్ కోసం తమ తండ్రి పాత మిత్రుని-ఇవాళ అధికారంలో ఉన్నవారి-దగ్గరకు వెళ్ళే మొహం చూపించడం లేదు ఇదే విషయాల్ని సూచిస్తు 'ఉదయ పవనా' లనే వచన కవితా సంపుటిలో "శ్రాద్ధ తిరుగుడు పూలు" లో ఇలా వ్రాశాను. "ఒకనాటి నిస్వార్థ ప్రజా సేవకులు, పదవి, ధనం కోరని వాళ్ళు ఎదురైతే మొహం చాటు వేసి, అందితే అణిచేసే గోమాయువులు (కొందరు నాయకమ్మన్యులు)."

1942 లో దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గారు కొవ్వూరులో వీరసంస్మరణ మందిరానికి ప్రారంభోత్సవం చేశారు. ఏలూరు నుండి సుప్రసిద్ధ దేశసేవిక రత్తమ్మ

గారు కూడా వచ్చారు. అప్పుడు నేను చిన్నదాన్ని. ఆవిడ ప్రక్కన కూర్చుని ఉపన్యాసాలు వినడం జ్ఞాపకం ఉంది. ఆ భవనంలో మధ్య హాలులో కాంగ్రెస్ లోని మృతవీరుల ఫోటోలకు ఖద్దరు దండలు వేసి ఉంటాయి. చాలా రోజులు ఆ హాల్లోకి ఖద్దరు బట్టలు కట్టుకునే వాళ్ళని తప్ప రానిచ్చే వారు కారు. మా నాన్నగారు రోజు అక్కడికి వెళ్ళి వర్క్ చూసుకునే వారు. మానాన్న గారు ఎన్నో కుటుంబాలు కాంగ్రెస్ లో పనిచేసి తిండిలేక ఎలా ఇబ్బంది పడుతున్నది నాతో చెప్పేవారు. కాంగ్రెస్ లోని శ్రీ సూరంపూడి శ్రీ హరిరావు గారు 16 సార్లు జైలు కెళ్ళారనిచెప్పారు. మా నాన్నగారు 100 ఎకరాలు కాంగ్రెస్ కోసం ఖర్చు పెట్టారు. తరువాత కూడా గాంధీ, మార్క్స్ సిద్ధాంతాల ప్రకారం సొంత ఆస్థిని సమాజపరం చేయాలని కొన్ని లక్షల ఖరీదు చేసే తన వాటా ఆస్తినంతా సంఘంలోని మంచి కార్యాలకి శ్రామిక ధర్మ రాజ్య సిద్ధాంతంకి, కొండజాతి ప్రజలకి వినియోగం చేయమని విల్లు వ్రాశారు. ఆయన మాడుగుల కొండజాతి ప్రజల కోసం తన శక్తినంతా ధారపోశారు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాడి గొత్తి, ముఠాదారీ విధానాలను రద్దుచేయించారు. వాళ్ళలో త్యాగుడు మాన్పించారు. గాంధీగారు ఆయన్ని తన పేపరు యంగ్ ఇండియన్ లోనో, హరిజన్ లోనో ఈ కృషిని చాలా మెచ్చుకుంటూ ఆశీర్వదించారు.

కొవ్వూరులో కొంతమంది కొండవార్ని మాయింటికి రప్పించి విద్య నేర్పించారు. కొండల్లో స్కూల్స్ పెట్టించారు. కొవ్వూరుకి కొంతమంది కొండవార్ని రప్పించి వారిని

ఉపాధ్యాయులుగా తర్ఫీదు చేయించారు. చిన్నప్పుడు వారికి నేనుకూడా చెప్పేదాన్ని. సుప్రసిద్ధ ఆదిమజాతి సంఘ సేవ కులు శ్రీ ఠక్కరు బాబుగారు మాయింటికి రావడం గుర్తుంది. ఆయన భోజనం చేస్తుంటే మాఅమ్మగార్ని హిందీ లోనో, ఇంగ్లీషులోనో ఇలాఅడిగారు. "మీవారు ఇలా సేవ చేయడం మీకు ఇష్టమేనా?" అని. ఇష్టమే అన్నారు మా అమ్మగారు.

ఎప్పుడూ కాంగ్రెస్‌లోని మిత్రులతోనో కొండజాతి వాళ్ళతోనో ఇంకా వచ్చే పోయే ఇతర జనంతోనో మా ఇల్లు సత్రంలా ఉండేది. బస్తా బియ్యం దంపితే మూడు రోజులు వచ్చేవి కావు. వంట మనుషులు ఉన్నా ఇంతమందికి భోజన సదుపాయాలు చూసి మాఅమ్మగారు భోంచేసే సరికి 12 గం॥ లు అయ్యేది. ఆవుపాలు మంచివని మా నాన్నగారు ఆవుని మా ఇంట్లో ఉంచేవారు. దూడలని మధ్యాహ్నం కాసేపు విప్పి చూడాల్సిన బాధ్యత నామీద పెట్టారు. అస్త మానం కట్టి పడేస్తే వాటికేమీ తోచదని కొంచెంసేపు స్వేచ్ఛగా పెరడులో తిరగనిచ్చి కట్టేసేదాన్ని. ఆడపిల్లలకి పశుసంరక్షణ చేయడం నుంచి 'దుహిత' అనే పేరు వచ్చిం దని శాస్త్రజ్ఞులన్నారు. సాయంత్రం నీరెండలో గార్డెన్ వర్కు చేస్తే శరీరఆరోగ్యం మంచిదని మా నాన్నగారు మొక్కల్లో గడ్డిపీక మనేవారు. మా దొడ్లో పూలమొక్కలు చూస్తుంటే కన్నుకుడుతుం దనేవారు మా స్నేహితులు. మా ఇంట్లో చాలా పెద్ద తోట ఉండేది.

నేను ఇటీవల ప్రచురించిన వలయంలో బానిస అనే కథా సంపుటిలో 'శకుంతలా హృదయం' అనే కథలో

మొదటి సారిగా కాపురానికి వెళ్ళిన శకుంతల పుట్టింటికి వ్రాసిన ఉత్తరంలో "అవుదూడ ఎలాఉంది? పూలమొక్కలని పరామర్శించడం" అదీ వ్రాశాను. చిన్నప్పటి నా అనుభవం దీనిలో కనిపిస్తుంది. ఈ కథ అత్తిల్లు-పుట్టిల్లు అనే పేరుతో జయశ్రీలో అచ్చయ్యింది. నా రెండవ కథ 'సవతిపోరు' అనే పేరుతో తెలుగు వెలుగు అనే విజయవాడ నుంచి వచ్చే పేపర్లో అచ్చయ్యింది. స్త్రీలకున్న అన్ని బాధల్లో ఎక్కువైంది ఏదని ఆలోచించగా సవతిపోరని తేలింది. దానిమీద కథ వ్రాశాను.

1975 వనితా సం॥ సందర్భంగా నేను ప్రచురించిన పద్మాలు-పారిజాతాలు అనే కథాసంపుటిలో ఇది మొదటి కథగా అచ్చయ్యింది. ఈ కథ పేరు పద్మాలు-పారిజాతాలు అని మార్చాను. తెలుగు వెలుగు సంపాదకులు నాదెళ్ళ భాస్కరరావుగారు. రచయిత లంటే గౌరవం ఉన్నవ్యక్తి. మేము ఏ ఊర్లో ఉన్నా ఆ ఊరు వస్తే కల్సుకోందే వెళ్ళే వారు కాదు. ఆయన పబ్లికేషన్స్ తరఫున అచ్చు వేసిన పుస్తకాలు చాలా ఇచ్చారు. నేను రచనని డబ్బుకోసం పేరు కోసం చేయలేదు. నాకు డబ్బు ఎక్కువగా రాలేదు. డబ్బు ఇచ్చే పేపర్లకి పంపాలని నియమం పెట్టుకోలేదు. ఇవ్వక పోయినా నేను అడగను. మొదట్లో రచనకి పేపరు వాళ్ళు పంపితే మనం డబ్బు తీసుకోవడం ఏమిటి ఇది నామోషి అనుకునేదాన్ని. తీరా మనియార్డరు వచ్చిందికదా అని కొంత డబ్బు దాన ధర్మాలు చేసేదాన్ని. పది సం॥ రాల క్రితం ఆదర్శ గ్రంథమండలి (విజయవాడలో) నా కథలు అచ్చు వేస్తామని అచ్చువేయలేదు సరికదా పారేశారు. అచ్చువేస్తే

అమ్మించుకోవడం కష్టమని చాలా కాలం నా రచనలు పుస్తకం క్రింద తీసుకురాలేదు.

మా రెండో అబ్బాయి వెంకటేశ్వర్లును కడుపుతున్నప్పుడు కీళ్ళవాతం వచ్చింది. దానిమీద గుండెనొప్పి ప్రవేశించింది. అప్పటినుండి గుండెజబ్బు కీళ్ళనొప్పులతో బాధపడుతున్నాను. ఒక్కొక్కసారి రచన చేస్తుంటే గుండె నొప్పి వచ్చేది. నొప్పి వచ్చినా సరే ఇది పూర్తి చెయ్యకపోతే మళ్ళీ ఉంటానో ఉండనో అని మొండితనంగా పూర్తి చేసే దాన్ని. ఇంట్లోకూడా రచనకి ఏమాత్రం సహకారం ఉండేది కాదు. నా ఆరోగ్యం, ఇంట్లో అననుకూల వాతావరణం నన్నింకా పైకి ఎదగనివ్వలేదు. నా రచనలపై ఎవరి ప్రభావం లేదు. ఇవన్నీ నా స్వతంత్ర మైనవే! పబ్లిషర్స్ అందరు కవితలు, కథలు, వ్యాసాలు వద్దు నవలలు కావాలంటున్నారు.

1973లో నేను ఉదయపవనాలు వచనకవిత అచ్చువేశాను. అప్పుడు రీము కాగితం 50 రు॥ 500ల ప్రతులు వేశాను. దానికి 500రు॥ లయింది. తర్వాత నేను గుండెనొప్పి కీళ్ళ నొప్పులు ఎక్కువై మంచం మీద ఉన్నాను. అప్పుడు నేను ఇలా అనుకొన్నాను. స్త్రీలకున్న ఒక్కొక్క సమస్య తీసికొని ఒక్కొక్క కథ వ్రాశాను. ఆవేదనతో తపనతో స్త్రీలకి జరిగే అన్యాయాలు సమసి పోవాలని కలం చేత పట్టాను. నేను మంచం మీద ఉన్నాను. ఇంక నా తర్వాత ఎవరూ ఈ కథలన్నీ పుస్తకంక్రింద తీసుకురారని 'వలయంలో శాసిస' అనే కథా సంపుటి 1000రు, పెట్టి వేశాను. ఇది మా అమ్మగార్కి, నాన్నగార్కి అంకితం ఇచ్చాను. దీనికి ముందు మాట కీ॥ శే॥ కళాప్రపూర్ణ కె. వి. యన్. అప్పారావుగారు

వ్రాశారు. ఈ పుస్తకం పాఠకుల మేధావుల మన్నన పొందినది.

## నా రచనలగూర్చి పూజ్యులైన పెద్దలు, ప్రముఖులు, తోటి రచయితలు ఏమను కుంటున్నారు?

సుప్రసిద్ధ అభ్యుదయ రచయిత శ్రీ నవీన్ గారు నా కథల గురించి ఇలా అన్నారు-'పొగడ్త కాదు. మీ కథలన్నీ నాకు నచ్చాయి. నిజం చెప్తున్నాను. మీ పుస్తకం అందగానే ఈనాడు అసంఖ్యాకంగా వెలువడుతున్న కథల్లో ఇవి కొన్ని అనుకొన్నాను. కాని కథల వెనుక విశిష్టమైన సామాజిక అవగాహన, సమాజంలో స్త్రీ యొక్క అసహాయతను చిత్రించాలన్న తపన ఈ కథలు వ్రాసిన రచయిత్రిలో ఉన్నాయని నేను అనుకోలేదు. ఈ కథలు చదవడం నాకొక ప్లజంట్ సర్ ప్రైజ్. స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల్ని చిత్రించడంలో కృతకృత్యులయ్యారు. మీ కథలు చదివాక మంచి కథలు చదివానన్న సంతృప్తి కలిగింది. మీకు నా హృదయ పూర్వకాభినందనలు.

శ్రీమతి దుర్గాభాయ్ దేశ్ ముఖ్ నాపుస్తకం గూర్చి ఇలా అన్నారు.

Dear Smt. Parvathi,

It is also nice and thoughtful of view to have sent me your book 'Padmalu - Parijatalu'. I am sorry for you delay in acknowledging the receipt of this book. Now I have completed I am writing to you to inform you that I have gone through all the stories.

I enjoyed in going through them and in congratulating you have chosen for these five stories are excellent they represent varied aspects problems of young women and bring out how successfully the tried to tackle them. The stories are very interesting instructive and also informative. Iam sure that you will be sending future publications and when they are out and I will be happy to go through them. In the mean while, let me thank you once again for sending this book to me, I am sending this to the Andhra Mahila Sabha Library which caters to the needs of thousands of young girls and women. The college of Andhra Mahila Sabha also will need such publications.

With all good wishes,

Yours sincerely,
DURGABAI DESHMUKH

శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ గారు ఆంధ్ర మహిళా సభ లైబ్రరీలో నా ప్రతి రచన పెడతానని వేలాది స్త్రీలకుపయోగకరంగా ఉండగలదని వ్రాయుట చేత నా ప్రతి పుస్తకం ఆవిడకు రిజిష్టర్ పోస్ట్‌లో పంపుతున్నాను.

## పుస్తకములు ముద్రించుట - వ్యాప్తి చెందుట

1975 వనితా సం॥ సందర్భంగా 'పద్మాలు, పారిజాతాలు' అనే కథా సంపుటిని ప్రచురించాను. నేను వలయం లో బాసిన వేసే సరికి రీము కాగితము 100రు॥ లు అయ్యింది. కొంతమంది సాహిత్య అకాడమీ వనితా విభాగం సెక్రటరీ ఇలాంటి పుస్తకాలకి ధన సహాయం చేస్తారని చెప్పుటచే

వారికీ పుస్తకం పంపి ఉత్తరం వ్రాశాను. అసలు సమాధానం లేదు. శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు ఈ పుస్తకం (పద్మాలు పారిజాతాలు) 1975 వనితా సం॥ రానికి ఉత్తమ మైన కానుక అన్నారు. ఆ మధ్య శ్రీమతి మాలతీ చందూర్ గారు ఆంధ్రప్రభ వారపత్రికలో ఇలా వ్రాశారు. కన్నడ దేశంలో వనితా సం॥ సందర్భంగా స్త్రీల సమస్యల మీద వ్రాసిన పుస్తకాలు ప్రభుత్వం ప్రతిచోట తీసుకొని అచ్చు వేసి కొనుగోలు చేయించిందని, అసలు అలాంటి సదుపాయం ఇక్కడ లేదని అన్నారు. మంచి పుస్తకాలు రావడం లేదు. అభ్యుదయ రచనలు- సామాజిక వాస్తవికతను తెల్పే రచ నలు రా లేదంటారు కాని అలాంటివి వస్తే కొనే వారెవరు? లైబ్రరీ లిస్టులో పుస్తకాలు రావడానికి చాలా కాలం పడు తుంది. లిస్టులో ఉంటే గాని ఎక్కువ కాపీలు బుక్ సెల్లర్స్ తీసుకోరు. నా పుస్తకాల్లో చాలా భాగం రచయిత మిత్రు లకి ఊరికే ఇచ్చేశాను. కొన్ని జిల్లా గ్రంథాలయ సంస్థలు నా బుక్స్ తీసుకొన్నాయి. విజయవాడ. మద్రాసు, సికింద్రా బాద్ బుక్ సెల్లర్స్ దగ్గర నాపుస్తకాలు న్నాయి.

ఎమెస్కో అధిపతులు శ్రీ ఎమ్. ఎన్. రావుగారు నాతో అన్నారు- "మీ మందారాలమాల (కథాసంపుటి) వ్యాసపద్మం (వ్యాససంపుటి) లండన్ అమెరికా పంపా"మని. ఆ మధ్య నేను మంచంమీద ఉన్నప్పుడు 'అరుణ కిరణా'లనే అభ్యుదయ వచన కవితా సంపుటి వ్రాశాను. దాని వ్రాత ప్రతిని సాహిత్య ఆకాడమీకి పంపిస్తే ఆదరంతో శ్రీ దేవుల పల్లి రామానుజరావు గారు 500 రు॥ లు ధన సహాయం చేశారు. ఇంకో 50 రు॥ పైన వేసి పుస్తకం ముద్రించాను.

దీనికి, పద్మాలు- పారిజాతాలుకి సుప్రసిద్ధ రచయిత శ్రీ శాస్త్రి శ్రీగారు ముందుమాట వ్రాశారు. తరువాత నా వ్యాసాల్లోని కొన్ని మంచివి ఏరి వ్యాసపద్మం అనే వ్యాస సంపుటి ప్రచురించాను. దీనికి ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు చీఫ్ జస్టిస్ శ్రీ ఆవుల సాంబశివరావుగారు ముందు మాట వ్రాశారు.

ఆ తర్వాత మందారాల మాల అనే కథాసంపుటి వేశాను. ఈమధ్యే 'కాంతివర్షం' అనే వచనకవిత ప్రెస్‌లో అచ్చయ్యింది. దీనిలోని గేయాల్ని సుప్రసిద్ధ రచయితలు శ్రీ పురిపండా అప్పలస్వామిగారు డా॥ జి శ్రీరామమూర్తి గారి చేత ఇంగ్లీషులోకి అనువాదం చేయించారు. దీనికి ఆంధ్రా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు గారు ముందుమాట వ్రాశారు. ఈ పుస్తకాలన్నిటికీ అచ్చు వెయ్యడానికి 7000రూ. పైగా అయింది. పెట్టినదాంట్లో సగం డబ్బు రావడం కూడా కష్టమైంది.

రెండు తరాల బట్టి సరస్వతీదేవి మా ఇంట్లో వాసం చేస్తోంది. ఇదేమంత చిన్నవిషయం కాదు.

## ఆత్మకథలంటే

ఒక రచయితవి గాని ఒక గొప్ప వ్యక్తివిగాని ఆత్మ కథలు చదవడం నాకు ఎక్కువ ఇష్టం. వాళ్ళు కొందరు మిత్రులకి వ్రాసిన లేఖలు కూడా పుస్తకాలుగా ప్రచు రిస్తారు. అవికూడా చాలా బావుంటాయి. ప్రసిద్ధవ్యక్తి జీవిత విశేషాలు వాళ్ళు చేసిన గొప్పపనులకి ధారితీసిన సంఘటనలు

రచయిత అయితే అతన్ని రచనకి పురికొల్పిన అనుభూతులు అవన్నీ ఉంటాయి. నెహ్రూ, గాంధీజీల ఆత్మకథలు, శరత్ బాబువి, శ్రీ ఆచంట జానకిరామ్ గారి సాగుతున్న యాత్ర ఇలాంటివే. మరికొన్ని పుస్తకాలు చాలాబావుంటాయి. ఇవి ఎక్కువగా పాఠకులు చదివిననాడు రచయితల గురించి తెలుసుకోగల్గుతారు. ఈ తరంలో కాని, వెనుకతరంలోకాని గొప్పగ్రంథాలు, జాతికి మేలు చేసే మంచి రచనలని మళ్ళీ అచ్చు వేస్తూ ఉండాలి. వారి విగ్రహాలు ఆయా ఊళ్ళలో నాల్గురోడ్లమధ్య ప్రతిష్టించు కోవాలి. వీధులకి పట్టణాలకి వారి పేర్లు పెట్టడంలోకూడా వారిని మనం గుర్తుంచుకోవాలి. దేశం కోసం త్యాగాలు చేసిన అమర వీరులని కూడా ఇలాగే సంస్మరించుకోవాలి.

## దేశభక్తులు - వారిని సంస్మరించవల్సిన విధానం

దేశం కోసం త్యాగం చేసిన అమర వీరులు ఎందరో ఉన్నారు. కాని వారిలో కొందరికే పేరు వస్తుంది. నెహ్రూ లాగ ప్రకాశంగారి లాగ త్యాగం చేసిన వాళ్ళు దేశంకోసం పని చేసిన వాళ్ళు చాలా మంది ఉండచ్చు. అయితే కొందరి పేర్లు అజ్ఞాతంగానే ఉంటాయి. ఏఊరు కాఊరు తీసుకొని అలా అజ్ఞాతంగా ఉండిపోయిన దేశభక్తుల్ని వెలుగులోకి తీసుకురావాలి. వారి వర్ధంతులు జరుపుకోవాలి. అందరికి వారి జీవిత విశేషాల్ని తెలపాలి. పేపర్లలో తరచు ఇలాంటి వాటిని గూర్చి వ్రాస్తూ ఉండాలి. దేశభక్తుల్ని మరచి పోవడం జాతికి క్షేమం కాదు.

# ప్రకృతివైద్యం - ఆరోగ్య సంరక్షణ
# నా మొదటి ఉపన్యాసం

నా చిన్నప్పుడు మా నాన్నగార్కి వాళ్ళకి ఆచార్య గారనే ఆయన ప్రకృతి వైద్యం చేసేవారు. నాకుకూడ పళ్ళు తినిపించి మా వాళ్ళు ప్రకృతి చికిత్సలో ఉంచినపుడు నన్ను చూసి ఇలా అనే వారుట ఆయన. "ఈ చిలుక రామచిలుక పళ్ళు తింటూ ఈ చెట్టు మీంచి ఆ చెట్టు మీదకి ఎగిరి ప్రకృతి వైద్యం వ్యాప్తిచేస్తుం" దని. కాకినాడలో 12 సం॥ రాల క్రితం పైగా గార్డెన్స్‌లో ప్రకృతి ఆశ్రమం వారు సభ జరిపారు. హైదరాబాదు నుంచి సుప్రసిద్ధ ప్రకృతి వైద్యులు డా॥ బి. వెంకట్రావుగారు వచ్చారు. మామూలుగా నేను కూడా వెళ్ళి కూర్చున్నాను. ఇంతలో వెంకట్రావుగారు ప్రకృతి వైద్యం గురించి మాట్లాడమన్నారు నన్ను. అప్పటి దాకా నేను వ్రాయడమే గాని, ఏ సభలోనూ మాట్లాడ లేదు. మాట్లాడగలనా? అని కొంచెం భయం కూడ వేసింది. సరే, భయమెందుకని ఒకసారి వివేకానందుని జ్ఞాపకం తెచ్చు కున్నాను. అప్పుడు ఆ సభలో మాట్లాడాను. శ్రీ వెంకట్రావు గారు ఆరోగ్య రక్షక పంచ తంత్రాలని రూపొందించారు. అవి ఇవి. 1. రోజుకి ఒకగంట వ్యాయామం. 2. రోజుకి రెండు సార్లు భోజనం. 3. వారానికి ఒకరోజు ఉపవాసం. 4. రోజూ ఇష్టదైవ ప్రార్థన. 5. రోజూ మంచినీళ్ళు ఎక్కువగా త్రాగ డం. హైదరాబాదు నుంచి డా॥ బి. వెంకట్రావుగారు ప్రకృతి అనే మాసపత్రిక నడుపుతున్నారు. ఇందులో ప్రకృతి చికిత్స గురించి ఉంటుంది చాలా రోజులనుండి ఇది చదువు తున్నాను.

ఇందులో కూడా నేను వ్యాసాలు, పద్యాలు, గేయాలు వ్రాశాను. రోగనామ జపం వదిలి రామనామ జపం చెయ్యి అంటాడు గాంధీజీ. ఆత్మవంతుడవై రోగాన్ని వదలా లంటారు. మనం చేసిన తప్పులకి ప్రకృతి విధించే శిక్షే రోగం. ఆహార నియమాలు, బ్రహ్మచర్యం, వ్యాయామం, మనస్సుని ఎల్లప్పుడు ప్రశాంతంగా ఉంచుకోవడం, శుచి, శుభ్రత, వేళకు నిద్ర, విటమినులు నశించని తిండి, మానసిక ప్రశాంతత ఇవన్నీ ఉంటే మన ఆరోగ్యాన్ని బాగుగా కాపాడుకో వచ్చును.

ఇప్పుడు ప్రతివారు వేళాపాళా లేకుండా అస్తమానం కాఫీలు, టీలు తీసుకోవడం, తీసుకున్న ఆహారాన్ని ఎక్కువగా ఉడకబెట్టిగాని, వేయించిగాని, దానిలో విటమినులు నశింపచేసి పుచ్చుకోవడం, ఎక్కువ కొవ్వు పదార్థములు డాల్డా నెయ్యి తీసుకోవడం చేస్తున్నారు. ఎంత జాగ్రత్తగా కుక్కర్ మీద ఉడకబెట్టినా ఉడక బెట్టగానే పదార్థంలోని విటమినులు నశిస్తాయి. అందుకని రోజు ప్రతివారు కొన్నింటి నైనా ఉడకబెట్టకుండా తీసుకోవాలి. ఎవరి శక్తిని బట్టి వారు పళ్ళు తీసుకోవాలి. అసలు ఫలహారం అంటే టిఫిన్ అని కాదు. పళ్ళు తీసుకోవడం అని అర్థం. మన యింటికి ఎవరైనా వస్తే అది గొప్ప మర్యాదని ఈ రోజుల్లో కాఫీ, టీలు ఇచ్చి గాని పంపం. అది మర్యా దనుకొంటాము.

పూర్వం ఎవరైనా యింటికి వస్తేపండు, తాంబూలం యిచ్చేవారు. ఇది మర్యాదగా ఉంటుంది. వచ్చిన వారి ఆరోగ్యానికి దోహదం చేస్తుంది. అవి లేకపోతే మజ్జిగ ఇచ్చినా మంచిదే. కాఫీలు, టీలు ఇస్తేగాని మర్యాద కాదనే

భావం మనలో పోవాలి. నేడు చాలా మందికి బ్లడ్ ప్రెషర్, గుండె జబ్బులు ఇలాంటి మొండి జబ్బులు రావడానికి కారణం ఆహార విహారాల్లో లోపం ఉండుట వలననే. ఎక్కడ చూసినా హోటళ్ళు ఖరీదైన తిను బండారాలు. ఇవి ఆరోగ్యాన్ని నాశనం చేస్తాయి. డబ్బు ఖర్చు పెట్టిస్తాయి. హోటల్ తిండికి అలవాటు పడిన మగవారికి ఇంట్లో టిఫిన్ చేసినా రుచించదు. వాళ్ళు తినడమే కాక, స్నేహితులకు కూడా పెట్టిస్తారు. దానికి సునాయాసంగా రోజుకి 4 రు॥ లు ఖర్చు అవుతుంది. 600 రు॥ లు జీతగాడుగా ఉన్నాడనుకోండి. అతనికి నెలకి 120 రు॥ లు హోటలు ఖర్చు, సిగరెట్లు 100 రు॥ కిళ్ళీ లేక వక్క పొడి పొట్లాలు 20 రు॥ ఒక నెలకి 200 రు॥, పైనే అయిందనుకోండి. ఇంట్లో అతనికి 400 రు॥ లతో సంసారం గడవడం కష్టమే కదా!

ఆడవాళ్ళు చాలామంది పొదుపు చేస్తారు. కూరలు, పాలు, నెయ్యి దగ్గర నుంచి వాళ్ళెంత పొదుపు చేసినా మగవాళ్ళు అలా ఖర్చు పెడితే ఆ సంసారం రాణించదు. హోటళ్ళకి, సిగరెట్లకి, సినిమాలకి, త్రాగుడికి, పేకాటకి, పై ఆడవాళ్ళకి, రేసులకి, ఏదో వ్యసనము పాలై ఖర్చు పెడ్తారు. ఎంత పెద్ద ఆస్తి ఉన్నా, ఎంత పెద్ద ఉద్యోగం ఉన్నా చివరికీ ఆ సంసారం కృంగి పోక తప్పదు. ఆఖరికి ఆరోగ్యం నాశనం అవుతుంది. ఇంట్లో తినడానికి తిండి ఉండదు. ఇలాంటి కుటుంబాలు ఎన్నో చూశాము భార్య మెడలో పుస్తెకూడ అమ్మేస్తారు. వ్యసన పరులైన వారి భార్యల జీవితాలు రోజూ శోక పూరితంగా ఉంటాయి. పిల్లల జీవితాలు కూడా పైకి తేలేరు. అందుకే మొదటి నుంచి వ్యసనాలకి దూరంగా ఉం

డాలి. వ్యసనాలకు బానిసలైన వారు ఎంత గొప్పవారైనా వాటిని వదిలించుకోలేరు.

## వ్యసనపరులై ఆస్తిని పాడుచేసుకున్న వారిని గూర్చిన కథ

వ్యసనాల పాలై పాడైన వారిని గురించి జానకి కథలో వ్రాశాను. ఈ కథ విని ఒక రచయిత మిత్రులు ఇలా అన్నారు. "శ్రీ పాదసుబ్రహ్మణ్యం శాస్త్రిగారు మునుపు ఇలాంటి కథలు వ్రాసేవారు" అని. భారతంలో జిహ్వాని ఉపస్థని జయించిన వాడే నిజమైన తపస్వి అని ఉంది. భార్యతోనే నియమిత కాలంలో సంసారం చేసిన వాడిని బ్రహ్మచారి అనవచ్చునని శాస్త్రంలో ఉంది. ఈ నాడు చూసే సినిమాలు, పుస్తకాలు ఎక్కువగా సెక్సుని ప్రేరేపిస్తున్నాయి- లేనిదాన్ని ఎక్కువగా ఎక్స్‌పోజ్ చేసి చూపిస్తున్నాయి. స్త్రీ పురుషుల కలయికవల్ల కొద్ది నిమిషాలు ఏర్పడే సుఖం ప్రపంచంలో అన్నిటికన్నా గొప్పదనుకోవడం భ్రమ. మనం సరిగ్గా చూస్తే ఒక మంచి పుస్తకం చదవడంలో గాని ఏదైనా ఆపదలో ఉన్నవారిని ఆదుకున్నప్పుడు వాళ్ళ కళ్ళ మెరిసే మెరుపు రేఖ లో ఎక్కువ ఆనందం ఉంటుంది. మా నాన్నగారు అనేవారు. తల్లి పిల్లల ఆరోగ్యం కోసం ఒక్కొక్కసారి పిల్లకి 3 సం॥ రాలు వచ్చేదాక బ్రహ్మచర్యంగా ఉండే వాడినని. మా ఇంట్లో అందరికి 4 సంవత్సరాలు ఎడం ఉంది. యువతీ యువకులు బ్రహ్మచర్యాన్ని పాటించి ఆహార విహారాల్లో నియమంగా ఉండి శరీర ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ

మానసికంగా, శాంతం, సహనం, దయ, ప్రశాంతత అల వర్చుకోవాలి.

నేడు వస్తున్న పత్రికలలో సినిమాలలో ఆడదాన్ని నగ్నంగా నుంచో బెట్టి లోపల వంపులు, వక్షోజాలు బిగువు, ఎర్ర త్రికోణాన్ని వీటిని ఎక్స్పోజ్ చేసి చూపిస్తున్నారు. ఇవి పురుషులను రెచ్చగొడుతున్నాయి. మగ వాళ్ళేమో చదువవ లేదనో, ఉద్యోగాలు రాలేదనో త్వరగా పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదు. ఎక్కువ కట్నాలు ఇవ్వలేక ఎదిగిన ఆడ పిల్లలు ఉండి పోతున్నారు. లాలస కోసం, డబ్బుకోసం, తిండి కోసం వ్యభిచారం పెరిగి పోతుంది. ఫ్యామిలీ ప్లానింగ్ పద్ధతులు వ్యభిచారానికి పనికి వస్తున్నాయి. వీధి వీధికి ఇంకా గౌరవం గానో, అగౌరవంగానో పనిచేసే వ్యభిచార గృహాలుంటూనే ఉన్నాయి. పెద్ద పెద్ద ఊళ్ళలో ఖరీదైన హోటళ్ళలో ధన సంపాదన కోసం కొంతమంది వ్యభిచారాన్ని నిరాటంకంగా నిర్వహిస్తున్నారు. ఇప్పుడు కొందరు తేలికగా ధన సంపాదన కోసం వ్యభిచారిణు లౌతున్నారు. దొంగతనం, వ్యభిచారం ఎక్కువ అవడం జాతి పతనానికి చిహ్నాలు. యువతీ యువకులు నైతికంగా ధృఢశీలులై ఉండాలి. సద్గ్రంధ పఠనం, సాత్వికాహారం, సెక్సుని ఉద్రేకపరిచే సినిమాలకి సాహిత్యానికి దూరంగా ఉండడం మత్తు పదార్థాన్ని సేవించక పోవడం బ్రహ్మచర్యాన్ని కాపాడు కోడానికి దోహదం చేస్తాయి.

మనమెంత సంఘ సేవకులమైనా, మేధావులమైనా, ఎంత బలమైన రాజకీయ దురంధరులమైన, దేశభక్తులమైన, మహాత్ములమైన నైతికంగా మన ప్రవర్తన బాగుండకపోతే

అది పెద్ద లోపమే. మనం చెప్పే దొకటి చేసే దొకటిగా ఉండరాదు. మనం మన ప్రవర్తన దిద్దుకున్నప్పుడే ఎవరి కైనా చెప్పే అర్హత ఉంటుంది. స్త్రీ పురుషులు శీలాన్ని పవిత్రంగా కాపాడు కోవాలి. అవినీతి, లంచగొండితనం, ఇతరుల్ని బాధ పెట్టడం ఇంకా ఎన్నో చెడ్డ గుణాల్ని మనం నశింపచేసి మంచి గుణాల్ని అలవర్చు కోవాలి. ఇవి ఏవో నీతి సూత్రాలు చెప్తున్నానని అనుకోవద్దు. ఇవి బాగా పరి శీలించి, లోకాన్ని, సమాజాన్ని చూసి చెప్పిన సత్యాలు.

## స్వామి వివేకానంద పుస్తకాలు

ఇవికూడా ఆత్మవిశ్వాసాన్ని మంచి ధైర్యం ఇస్తాయి. కార్య శీలతకు పురికొల్పుతాయి. చిన్న తనం నుంచి ఇలాంటి పుస్తకాలు చదవడం అలవర్చుకోవాలి. శ్రీ వివేకానందుడు నా దేశంలో ఒక కుక్క కూడా పస్తుంటే సహించ లేన న్నారు. ఆయన అంత జీవకారుణ్యం కలవాడు. ఆయనలాగే నోరులేని ప్రాణుల్లోను మానవుని లోని మాధవుడిని చూడ గల్గాలి. 'Thus Speak Vivekananda' అన్న చిన్న పుస్తకం (పాకెట్ సైజు) లో వివేకానందుని సూక్తులున్నాయి. ఇవి రోజూ ప్రతివారు మననం చేయ దగ్గవి. వివేకానందుని రాజ యోగం పుస్తకం మీద నేను కొన్ని వ్యాసాలు వ్రాశాను.

## నాన్నగారి జైలు జీవితం స్వాతంత్ర్య సమరంలో

24 సం॥ ల కాలాన్ని సాంఘిక కారక్యలాపాల కోసం, దేశం కోసం, మరి ఏ మంచి పనికైనా వినియోగించేవాళ్ళు

కుటుంబానికి కొంత న్యాయం చేయలేరు. వారిశక్తి, ధనం ఆ పనికి వినియోగం అవుతుంది. ఇంట్లో పనులంటే విసుగు వస్తుంది. మా నాన్నగారు కూడా ఇంట్లో కొంచెం చిరాకు పడేవారు.

జైలులో ఇనుప కళాయిలలో పులుసు వండి పెట్టే వారుట. ఒకసారి జైల్లో మా నాన్నగారికి బోల్డు కాగితాల కట్ట యిచ్చి మోసుకుని రమ్మన్నారట. ఆయన అసలే బల మైన మనిషి కాదు. బక్కగా ఉండేవారు. మా నాన్నగారు నీరసం వలన పడేశారో, లేక కొంటెతనానికి పడేశారో నాకు తెలియదు కాని కట్టల్ని ప్రక్కనున్న మురికి కాలవలో పడే శారట. "ఆ బక్క అతనిచేత ఇవి ఎందుకు మోయించావని" జైలు సూపరింటెండెంటువార్డెన్‌ని కేకలేశాడట. శేఠ్ జమునా లాల్ బజాజీ ప్రభుత్వాని కిలా అర్జీ పెట్టాడట. అప్పుడు ఆయన కూడా జైలులో ఉండేవారట- ఈ అబ్బాయి గొప్ప వాళ్ళ అబ్బాయి, తండ్రికి ఒక్కడే కొడుకు 'బి' క్లాసు ఇప్పించ వలసిందని...

ఒకసారి జైలులో ఉన్నప్పుడు జమునాలాల్ బజాజీ తండ్రికి తద్దినం వచ్చిందట. అప్పుడు బజాజీ 'శర్మా! నీవు బ్రాహ్మణుడివి. ఈరోజు నీకు భగవద్గీత దానం చేస్తున్నాను' అని భగవద్గీత ఇచ్చారు. ఇప్పటికీ మా ఇంట్లో ఉందా పుస్త కం. కీ॥ శే॥ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, మా నాన్న గారు అపక్వాహారంతో ఉండేవారు. జైల్లో నానబెట్టిన పెసలు, వేరుసెనగకాయలు తినేవారు. అందుకని అక్కడ వాళ్ళు శర్మాస్ డైట్, శాస్త్రిస్ డైట్ అని పిలిచేవారు.

నాకు 11 నెలలు ఉన్నప్పుడు కొఫ్యూరులో మా మ్మగారి

చూడడానికి మా చిన్న బామ్మగారు వచ్చారు- శ్రీమతి రెబ్బాప్రగడ కామేశ్వరమ్మగారు. మా తాతగారి తమ్ముడు కీ॥ శే॥ రెబ్బాప్రగడ పాపయ్యగారి భార్య. పాపయ్యగారు కందుకూరి వీరేశలింగంగారి శిష్యుడు. ఆయన సేవా కార్య క్రమాలలో సాయంగా ఉండేవారు.

మా చిన్న బామ్మగారు మాఅమ్మను చూసి 'ఏమే పిల్లకి అన్నప్రాసన చేశావా?' అన్నారట. 'ఏదో ఏం చేస్తాం లెండి. ఆయన జైల్లో (కడలూరు) ఉన్నారు. తోచడం లేదు అందుకని చేయలేదు' అన్నారట. 'అదేమిటే అలా బాధ పడ్తావు? వాడికేం సిక్షేప రాయుళ్ళా ఉన్నాడక్కడ. పూల రంగడులా తిరిగి యింటికొస్తాడు. పిల్లకి అన్నప్రాసన చెయ్యి' అని చేయించారట. ఇటీవలనే నేను కాకినాడలో బ్రహ్మ సమాజమందిరంలో కందుకూరి వీరేశలింగంగారి గురించి మాట్లాడవలసి వచ్చింది. శ్రీమతి వేదుల మీనాక్షి దేవిగారు కూడా మాట్లాడారు. అప్పుడు ఆ సభానిర్వాహకులు అన్నారు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ పంతులుగారి మేన కోడలు కూతురు వేదుల మీనాక్షిగారు. నేను రెబ్బాప్రగడ పాపయ్యగారి అన్న మనుమరాలిని. మా తాత, వేదుల మీనాక్షిగారి తాత వీరేశలింగంగారి శిష్యులే. వారి వంశం వారైన ఈ రచయిత లిద్దరు ఈవేళ మాట్లాడటం చాలా బావుందన్నారు. అప్పుడు నేను కీ॥ శే॥ వీరేశలింగంగారి గురించి మాట్లాడాక ఒకాయన నా దగ్గరకి వచ్చి మీరు బాగా మాట్లాడారు. ఈ రోజు మీ ఉపన్యాసం విన్నాక. దుర్గాబాయ్ దేశ్ ముఖ్ గారి ఉపన్యాసం జ్ఞాపకం వచ్చింది ఆవిడ కూడా ఇలాగే ఇంత ఉత్సాహంగాను, ఉత్తేజంగాను

చూడడానికి మా చిన్న బామ్మగారు వచ్చారు- శ్రీమతి రెబ్బాప్రగడ కామేశ్వరమ్మగారు. మా తాతగారి తమ్ముడు కీ॥ శే॥ రెబ్బాప్రగడ పాపయ్యగారి భార్య. పాపయ్యగారు కందుకూరి వీరేశలింగంగారి శిష్యుడు. ఆయన సేవా కార్య క్రమాలలో సాయంగా ఉండేవారు.

మా చిన్న బామ్మగారు మాఅమ్మను చూసి 'ఏమే పిల్లకి అన్నప్రాసన చేశావా?' అన్నారట. 'ఏదో ఏం చేస్తాం లెండి. ఆయన జైల్లో (కడలూరు) ఉన్నారు. తోచడం లేదు అందుకని చేయలేదు' అన్నారట. 'అదేమిటే అలా బాధ పడ్డావు? వాడికేం సిక్షేప రాయుళ్ళా ఉన్నాడక్కడ. పూల రంగడులా తిరిగి యింటికొస్తాడు. పిల్లకి అన్నప్రాసన చెయ్యి' అని చేయించారట. ఇటీవలనే నేను కాకినాడలో బ్రహ్మ సమాజమందిరంలో కందుకూరి వీరేశలింగంగారి గురించి మాట్లాడవలసి వచ్చింది. శ్రీమతి వేదుల మీనాక్షి దేవిగారు కూడా మాట్లాడారు. అప్పుడు ఆ సభానిర్వాహకులు అన్నారు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ పంతులుగారి మేన కోడలు కూతురు వేదుల మీనాక్షిగారు. నేను రెబ్బాప్రగడ పాపయ్యగారి అన్న మనుమరాలిని. మాతాత, వేదుల మీనాక్షిగారి తాత వీరేశలింగంగారి శిష్యులే. వారి వంశం వారైన ఈ రచయిత లిద్దరు ఈవేళ మాట్లాడటం చాలా బావుందన్నారు. అప్పుడు నేను కీ॥ శే॥ వీరేశలింగంగారి గురించి మాట్లాడాక ఒకాయన నా దగ్గరకి వచ్చి మీరు బాగా మాట్లాడారు. ఈ రోజు మీ ఉపన్యాసం విన్నాక. దుర్గాబాయ్ దేశ్ ముఖ్ గారి ఉపన్యాసం జ్ఞాపకం వచ్చింది ఆవిడ కూడాగే ఇంత ఉత్సాహంగాను, ఉత్తేజంగాను

మాట్లాడేవారు అన్నారు. ఆయనే సుప్రసిద్ధులైన శ్రీ మాచి రాజు సీతాపతిరావు గారు.

## చిన్నతనంలో నేను మొదటి సారిగా చదివిన రచన పాలేరు నాటకం

జమీన్ రైతు అనే పేపరు నెల్లూరు నుంచి వెలువడేది. మాయింటికి వస్తూ ఉండేది. దాని సంపాదకులు శ్రీ నెల్లూరు రామానాయుడుగారు. అందులో శ్రీ బోయి భీమన్నగారి పాలేరు నాటకం సీరియల్‌గా వచ్చేది. నేను మొదటి సారిగా చదివిన రచన అది. అప్పుడు నాకు 8 సంవత్సరాల కన్నా ఉండవు. దాంట్లో కథ నాకు అంత జ్ఞాపకం లేదు గాని పాలేరు చద్దన్నం తిని పొలానికి వెళ్ళడం జ్ఞాపకం ఉంది. ఆమధ్య పద్మశ్రీ బోయి భీమన్నగారు ఈ ఊళ్ళోని సాహిత్య లహరికి వచ్చిన సందర్భంలో ఆయన రచన పాలేరు గురించి ప్రస్తావించాను. ఆ ప్రతు లిప్పుడు మీ దగ్గర ఉన్నాయా అనడిగారు నన్ను. అప్పటి జమీన్ రైతు సంచి కలు నాదగ్గర లేవు. బహుశా ఆయన దగ్గర కూడా పాలేరు ప్రతులు లేవేమో. అది బుక్ క్రింద వెలువడలేదు అను కుంటాను.

## మా ఇంట్లో గాంధీ సిద్ధాంతాల ఆచరణ

మట్టిలోని మాణిక్యాలని వెలుగులోకి తీసిన మహానుభావులు శ్రీ గాంధీజీ. ధనిక, బీద కులమత ప్రసక్తి లేకుండా ఎందరో ప్రజలు ఆయన పిలుపు విని స్వరాజ్య సమరంలోకి

దూకారు. భోగ భాగ్యాలతో తుల తూగుతున్న ఇంట్లోని యువకులు ఆయన పిలుపు విని ముతక ఖద్దరు బట్టలు తొడుక్కొని పదవులు వదిలి కాలేజీలు మానుకొని జైళ్ళల్లో కష్ట కష్టలు పడ్డారు. గాంధీగారు ఎవరి పని వారు చేసుకోమన్నా రని మా నాన్నగారు తన గది తను ఊడ్చుకునేవారు. మా అన్నయ్య తమ్ముడికి పిల్లనిస్తామని పెళ్ళి వారు వచ్చి మీకు కట్నం ఎంత కావాలి అని అడగ్గా నేను గాంధీ సిద్ధాంతం ప్రకారం నడుచుకునేవాణ్ణి. కట్నాలు పుచ్చుకోనని చెప్పారు. అప్పుడు వాళ్ళు మాఅమ్మ గారి దగ్గరికి వచ్చి మీకు అత్త గారి లాంఛనాలు ఏం కావాలని అడిగారు. మా అమ్మగారు కూడా 'గాంధీ సిద్ధాంతం ప్రకారం నడిచే దానినే. లాంఛ నాలు తీసుకో' నని చెప్పారు. వాళ్ళు 'పసుపు, కుంకుమ, చీరలు, బొట్టుపెట్టె ఇలాంటివి అత్తగార్కి ఇవ్వడం ఉంటాయి కదా. మీరు పుచ్చుకు తీరా' లన్నారు. అప్పుడా విడ పసుపు కుంకుమని మీరిచ్చింది నేను తిరగ గొట్టకూడదు. నేను పుచ్చుకొని వెంటనే మీ అమ్మాయికే ఇచ్చేస్తానని చెప్పారు. అలాగే ఇద్దరు కోడళ్ళకి ఇచ్చేశారు. ఇలా ఆచ రణలోని సిద్ధాంతాలు అమలు జరిపే వారు నేడు ఎంత మంది ఉన్నారు?

## మా అమ్మ గారు

మా అమ్మగారు చాలా అమాయకురాలు. కోడళ్ళని, కూతుళ్ళని తేడాయే చూపరు. గొప్పా, బీద అనే తేడా లేకుండా అందర్నీ ఒకలాగ మర్యాద చేస్తారు. అందరూ మంచివాళ్ళే అనుకుంటారు. ఎవరైనా మజ్జిగ గాని క్షీర

గాయలు గాని అడిగితే తను పుల్ల మజ్జిగ వేసుకుని వాళ్ళకి మంచి మజ్జిగ ఇస్తారు. గడుసుతనం తెలియదు. చాలాకాలం కొవ్వూరులోని స్త్రీ సమాజానికి మా అమ్మగారు అధ్యక్షు రాలుగా ఉన్నారు. సుప్రసిద్ధ సంఘ సేవిక, దేశభక్తురాలు శ్రీమతి ద్రోణం రాజ్యలక్ష్మి బాయమ్మ ఈమె మేనత్త కూతురు. తండ్రి వైపు నుంచి సాహిత్యం, రాజకీయ అవగాహన, సాంఘిక దృక్పథం, సమసమాజ నిర్మాణం ఎడల ఆసక్తి నాకువస్తే, తల్లి వైపునుంచి స్నేహ శీలత్వం, విశాల హృదయం వారసత్వంగా వచ్చాయి. మా అమ్మగారు ఇప్పటికి ఖద్దరు బట్టలే వాడతారు.

## సోదరులు కళాప్రపూర్ణ కీ॥ శే॥ కె. వి. యస్. అప్పారావుగారు

గాంధీగారు కొవ్వూరు వచ్చారుట. ఆ సందర్భంలో మా నాన్నగారు గాంధీజీ, కస్తూరి బాయ్, ఇతర మిత్రులు తీయించుకున్న ఫోటో మా ఇంట్లో ఉంది ఒకసారి గాంధీ వినోబాభావేకి తెలుగు నేర్పడానికి ఎవరైనా ఉంటే పంపమని మా నాన్నకు ఉత్తరం వ్రాశారు. అప్పుడు నాన్నగారు సోదరులు కె. వి. యస్. అప్పారావు గార్ని పంపారు. సోదరులు కె. వి. యస్. అప్పారావు గారుకూడా గాంధీ సిద్ధాంతాన్ని తు. చ తప్పక ఆచరించే వ్యక్తి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో అప్పుడు నాన్నగారు తీవ్రమైన జబ్బులో ఉన్నారు. అప్పుడు క్విట్ ఇండియా ఉద్యమంలో అప్పారావుగారు పాల్గొన్నారు. పోలీసులు ఆయన్ని లాఠీతో తలమీద బాదారు. మా ఇంటికి ఎవరో వచ్చి అప్పారావు

గారు స్పృహ తప్పి పడిపోయారు తలమీద దెబ్బ తగిలిందని చెప్పారు. ఆయన ప్రైవేటు గానే హిందీ, సంస్కృతం ఎం. ఎ. పరీక్షలు కట్టి పాస్ అయ్యారు- నాన్నగారి సంస్థలన్నింటికి కార్యదర్శిగా ఉన్నారు.

ఒకసారి విశాఖపట్టణం జిల్లాలో మాడుగుల కొండ జాతి ప్రజలకి సేవచేయడానికి వెళ్ళినప్పుడు అప్పారావుగారికి తీవ్రంగా మలేరియా జ్వరం వచ్చింది. ఇంటికివచ్చి జ్వరంతో పడి పోయారు. టెంపరేచర్ 105° F దాటింది. ఇంట్లో అందరూ కంగారు పడ్డారు. అప్పుడు నాన్నగారు కూడా వెళ్లారు. జ్వరం తగ్గిందాకా ఉండి ఇంటికొచ్చి నాతో ఇలా అన్నారు. అప్పారావుకు జ్వరం తగ్గబట్టి సరిపోయిందిగాని లేకపోతే వాళ్ళింట్లోను, ఊళ్ళోను ఏమందురు నన్ను? ఈయన వల్లే మనిషి ఇద్దై పోయాడందురు. కొండలలోకి పంపాడు మలేరియా వచ్చింది అని అప్పుడు నాకు ఎంత అపఖ్యాతి వచ్చును అన్నారు. అప్పారావు గారు మంచి రచయిత. చాలా శాంత స్వభావులు, నిష్కామ కర్మయోగి. ఆయన్ని అజాత శత్రువనవచ్చును.

షేక్స్పియర్ నాటకంలోని ఒకపాత్ర 'ఎడ్డా'. దానితో నన్ను పిలిచేవారు. నాన్నగారు అన్నారు కదా. అది అందరి నోళ్ళలో పడి సరిగేసరికి 'డడ్డీ' కింద మారింది. డడ్డీని మాడుగుల కొండల్లోకి పంపితే నా అంత పని చేస్తుందనేవారు నాన్నగారు. ఎందుకో మరి ఆయన తర్వాత నన్ను రాజకీయ వారసురాలిగా చేయలేదు. మామూలు గృహిణిగానే ఉండనిచ్చారు.

గారు స్పృహ తప్పి పడిపోయారు తలమీద దెబ్బ తగిలిందని చెప్పారు. ఆయన ప్రైవేటు గానే హిందీ, సంస్కృతం ఎం. ఎ. పరీక్షలు కట్టి పాస్ అయ్యారు- నాన్నగారి సంస్థ లన్నింటికి కార్యదర్శిగా ఉన్నారు.

ఒకసారి విశాఖపట్టణం జిల్లాలో మాడుగుల కొండ జాతి ప్రజలకి సేవచేయడానికి వెళ్ళినప్పుడు అప్పారావుగారికి తీవ్రంగా మలేరియా జ్వరం వచ్చింది. ఇంటికివచ్చి జ్వరంతో పడి పోయారు. టెంపరేచర్ 105° F దాటింది. ఇంట్లో అం దరూ కంగారు పడ్డారు. అప్పుడు నాన్నగారు కూడా వెళ్లారు. జ్వరం తగ్గిందాకా ఉండి ఇంటికొచ్చి నాతో ఇలా అన్నారు. అప్పారావుకు జ్వరం తగ్గబట్టి సరిపోయిందిగాని లేకపోతే వాళ్ళింట్లోను, ఊళ్ళోను ఏమందురు నన్నా? ఈయన వల్లే మనిషి ఇద్దె పోయాడందురు. కొండలలోకి పంపాడు మలేరియా వచ్చింది అని అప్పుడు నాకు ఎంత అప ఖ్యాతి వచ్చును అన్నారు. అప్పారావు గారు మంచి రచయిత. చాలా శాంత స్వభావులు, నిష్కామ కర్మయోగి. ఆయన్ని అజాత శత్రువనవచ్చును.

షేక్స్పియర్ నాటకంలోని ఒకపాత్ర 'ఎడ్గా'. దానితో నన్ను పిలిచేవారు. నాన్నగారు అన్నారు కదా. అది అందరి నోళ్ళలో పడి నలిగేసరికి 'డడ్డీ' కింద మారింది. డడ్డీని మాడుగుల కొండల్లోకి పంపితే నా అంత పని చేస్తుందనేవారు నాన్నగారు. ఎందుకో మరి ఆయన తర్వాత నన్ను రాజ కీయ వారసురాలిగా చేయలేదు. మామూలు గృహిణిగానే ఉండనిచ్చారు.

# కొవ్వూరులో మా ఇంట్లో పూలతోట

మా యింట్లో పెద్ద పూలతోట ఉండేదని చెప్పాను కదా! అందులో రకరకాల రంగురంగుల పువ్వు లుండేవి. చిన్నప్పటినుంచి ఈ పూలకు నాకు చాలా సాన్నిహిత్యం వుంది. నారచనలు కొన్నిటికి, నా పుస్తకాలు కొన్నింటికి ఈ పూల పేర్లే పెట్టాను. నిజానికి ఈ పూలు, పూలపేర్లు కూడా చాలా అందంగా ఉంటాయి. మామూలు మందార, ముద్దమందార గులాబి రంగులో నిండుగా పూసిన ముద్దమందార, జూకా మందార, చిలకముక్కు మందార- ఇన్ని రకాల మందారా లుండేవి. నా స్నేహితురాలు చిలకముక్కు మందార అడుగు తొడిమి తీసి పీల్చిచూడమనేది తేనె వస్తుందని: అలాగే పీలిస్తే కొంచెం తేనె వచ్చేది. రాధామనోహరం పందిర్ని గుత్తులు గుత్తులుగా పూలు పూసి ఉండేవి. నైట్ క్వీన్, డే క్వీన్ కూడా ఉండేవి. వీటి పరిమళాలు ఆ ప్రక్కలంతా వ్యాపించేవి. మామూలు మల్లె, బొడ్డుమల్లె కూడా ఉండేవి. బొడ్డుమల్లె రెండు మూడు మల్లెపూలు కలిసినట్లు ముద్దగా ఉండేది. రోజారంగు గులాబి, ఆకుపచ్చ గులాబి, పాలనేరు కూడా ఉండేది. పాలనేరు గులాబి ఎర్రని రంగుతో పెద్ద పువ్వుగా ఉంటుంది. పసుపు కనకాంబరం చెట్టుక్రింద పూలు బాగాపూసి రాలి పడి ఉండేవి. ఆకుపచ్చ సంపెంగ చెట్టు పొడుగ్గా పెద్దదిగా ఉండేది. అది బోల్డు పూలుపూసి ఇంకా చెట్టుక్రింద రాలి పడి ఉండేవి. ఇవికూడా సువాసనగా ఉంటాయి.

డిసెంబరు, నవంబరులో పూసే డిసెంబరు పూలు చెట్లు నిండా విరగకాసేవి. వీటిలో రోజా రంగు, పసుపు రంగు ఉండేవి. ఈ పూలు అన్నీ కలిపి గాని, ఒక్కొక్క రంగు గాని ముద్దగా దండ గుచ్చుకొని నేను జడ నిండా పెట్టుకొని స్కూలుకి వెళ్ళేదాన్ని. ఈ ప్రపంచపు బాధలు భయాలు సుఖ దుఃఖాలు తెలియని ఆ చిన్న వయస్సులో పూలన్నీ చూస్తూంటే ఎంత ఆనందం! చెంగల్వ చెట్టు ఉండేది. అవి అప్పటి దాకా పువ్వులు లేకుండా ఉండి ఒక్క మెరుపు మెరిసి వర్షాలు కురవగానే తెల్లవారే సరికి హఠాత్తుగా చెట్టునిండా పూలు వచ్చేవి తెల్లగా. మా దొడ్డి ఇంటి ముందు మాలతీ లత పందిరిని పాకి ఉండేది. ఆ పూలుకూడా తెల్లగా సువాసనగా ఉంటాయి. దానిమ్మ చెట్టు, సీతాఫలం, రామాఫలం, నారింజ, కొబ్బరి చెట్లు, పోక చెట్లు ఉండేవి. పారిజాతం చెట్టు, దేవకాంచనం చెట్లు కూడా ఉండేవి. ఈ చెట్ల పేర్లు ఎంత అందంగా ఉన్నాయి! ప్రొద్దున్నే పారిజాతం చెట్టును దులిపితే పూలు జల జలా రాలేవి. సన్నని సువాసనతో అందంగా మృదువుగా తెల్లగా ఉంటాయి పారిజాతాలు. ఉదయ పవనాలనే నా వచన కవితలో మొదటి గేయం పారిజాతాలు. మా దొడ్డి వేపుఉన్న యింటి వెనుక సందులో పెద్ద జామ చెట్టు ఉండేది. దాని కాయలు కోసం నేను చిన్నప్పుడు చెట్టెక్కి, ఆ ప్రక్కన గోడెక్కి, గోడను ఆనుకుని ఉన్న ప్రక్కవాళ్ళ రేకుల షెడ్డు ఎక్కి కొమ్మల్లోంచి కాయలు కోసేదాన్ని. లైన్ తోటకూర నేల మీద ఏమైనా అక్షరాలు వ్రాసి ఆ వరుసలో పెంచే వాళ్ళం.

పూర్వం చాలా మందికి పెరళ్ళు పెద్దవిగా ఉండేవి.

ఇప్పుడు పట్టణ వాసంలో అయినా ఓ మధ్య తరగతి ఊళ్ళో అయినా చాలా మంది పెరడు ఎక్కువ ఉంచుకోవడంలేదు. కొందరు స్థలాల ధర పెరగడం వలన అసలు చిన్న స్థలం తీసుకుంటున్నారు. కొంతమంది స్థలమున్నా, వెనుక ముందు ఇళ్ళు కట్టి అద్దెలకు యిస్తున్నారు దొడ్డి లేకుండా చేసి. అసలు శాస్త్రప్రకారం యింటి కన్నా దొడ్డిఎక్కువగా ఉండాలి. అలా ఉండడం మన ఆరోగ్యానికి చాలా మంచిది. పూల మొక్కలు, పండ్ల కాయగూరల మొక్కలు, యితర మొక్కలు ఉండడంతో పెరడు అందంగా ఉంటుంది. మనకి మంచి గాలిని కూడా ఇస్తుంది. పరిశుభ్రమైన గాలి, ప్రాణ వాయువు శరీర ఆరోగ్యానికి మంచిదని వేరే చెప్పనక్కర లేదు కదా!

యింకా మా దొడ్లో జాజి, తీగగులాబి, విష్ణుకాంతం పూల మొక్కలు, తులసి మొక్కలు, ద్రాక్ష తీగ బంతి, నందివర్ధన బాతు మొక్కలు, చంద్ర కాంతం మొక్కలు, మెట్టతామర, శంఖు పూలచెట్టు, సెంటు పూలు, పూల మొక్కలుండేవి. పూలు పూస్తూ చంద్రకాంత మొక్కలు సాయంత్రం అయ్యేసరికి చెట్టునిండా చక్కగా తెలుపు, ఎరుపు, పసుపు రంగులలో పూసి ఉండేవి. బాతు మొక్క యిది తీగ. మా దొడ్డి వైపు సిమెంటు స్తంభాలు వేసి యినుప తీగలతో ఆర్చిల్లాగా వేసిన పందిరి మీద పాకి ఉండేది. ఈ పూలు బాతు ఆకారంలో తమాషాగా ఉంటాయి. ఇంకా నేను మా స్నేహితుల ఇండ్ల నుంచి తెచ్చి బంగాళా బంతి మొక్కలు, కొన్ని గులాబి మొక్కలు పాతేదాన్ని. రోజు ప్రొద్దున్నే లేచి అవి చిగురు వేశాయేమో

చూస్తూండేదాన్ని. అవి చిగిర్చి మొగ్గతొడిగితే ఎంత ఆనందం! అప్పుడు ఆ చిన్న వయసులో మా నాన్నగారు ఆఫీసు గదిలో కూర్చుని వ్రాసుకుంటున్నప్పుడు ఓ రోజు పొద్దున్న 10 గంటల వేళ నేను వెళ్ళి 'నాన్నా నీకేం కూర చెయ్యమంటావు?' అనడిగాను. ఆయన కూర్చున్న ఆఫీసు గది వెనకాల దొండ పందిరి ఉంది. 'దొండ కాయలు కోసి పట్టుకెళ్ళు. వేపుడు చేయమను' అన్నారు. నేను పందిరి దగ్గరకు వెళ్ళి చూసి 'నాన్నా దొండ కాయలు లేవు' అని చెప్పాను. అప్పుడాయన ఇవతలకి వచ్చి అలా కాదు చూడ గానే కనబడవు. ఆకు ఆకు సందున ఉంటాయి. ఇలా పరిశీ లించి చూడాలని చెప్పారు. అలాగే చూస్తే దొండ కాయ లున్నాయి.

## వంట బాగా చెయ్యడం కూడా ఒక కళే

ఒకసారి నాకు పదమూడేళ్ళు ఉన్నప్పుడు మా ఇంట్లో మా అక్కయ్యకు మా తమ్ముడుకు టైఫాయిడ్ జ్వరం వచ్చింది. సరిగ్గా అప్పుడే వంటమనిషి మానేసింది. మా అమ్మ గారికీ జ్వరం వాళ్ళతో సరిపోయేది. మా నాన్నగారు 'పెళ్ళీడు వచ్చిన పిల్లలు వంట నేర్చుకోవాలి. అందుకని కొన్నాళ్ళు వంట చెయ్యినువ్వు' అన్నారు. మా యింటికి వీధి ముందర పెద్ద డాబా ఉండేది. పెద్ద దొడ్డి మైన్ రోడ్డుదాకా ఉండేది. మైన్ రోడ్డుమీద ఉన్న కొంత స్థలం కాఫీ హోట ళ్ళకు, భోజన హోటళ్ళకి నేల అద్దె కిచ్చారు. ఈ అందమైన పెద్దడాబా తరువాత పెద్ద పెంకుటిల్లు ఉండేది. డాబాకి పెంకుటిల్లుకి మధ్య నుయ్యి. నుయ్యి తర్వాత ఒకచిన్న

డాబా ఉండేది. ఆ చిన్న డాబాలో ఒక గదిలో మడిగా ఊరగాయల జాడీలు పెట్టేవాళ్ళం. మధ్య గదిలో గాడి పొయ్యి తవ్వి ఉండేది. పెళ్ళిళ్ళు వచ్చినప్పుడు వంట చేసే వారు. ఆ ప్రక్కన ఇంకో గది స్నానానికి ఉండేది. డాబా మీద మడిబట్టలు ఆరేస్తుండేవారు. ఈ చిన్న డాబా ప్రక్కనే ధాన్యం దంపుతుండే పాక ఉండేది. ఒక ప్రక్క ఆవులు, దూడలు ఉండేవి. ఆ ప్రక్క ధాన్యం గాదులుండేవి. పెద్ద పెంకుటింట్లో వంట చేసే వాళ్ళం. మావాళ్ళకి మడి, ఆచారాలు ఎక్కువ. నేను మడిగా వండేదాన్ని. అప్పుడు మా యింట్లో ఉన్న ఒక చుట్టా లావిడ నాకు తోటకూర అల్లం పెట్టి ఎలావండాలో, చిక్కుడుకాయకూర, పులుసు బెల్లం వేసి ఎలా వండాలో దూరంనుంచే నుంచుని చెప్పారు. ఆవిడ ఒకసారి అలా చెప్పగానే నేను ఆరితేరిన పెద్దవాళ్ళు వండి నట్లు శుభ్రంగా వండాను. అవి తినినవాళ్ళందరూ పెద్దవాళ్ళు వండినట్లు చాలా బాగా వండావని మెచ్చుకున్నారు. అన్నం బిరుసు, మెత్తన కాకుండా పదునుగా సమంగా వండేదాన్ని. మా నాన్నగారు గిన్నెలమీద మూతలు తీసేటప్పుడు మూత వెనక్కి తిప్పి తీయాలి లేకపోతే ఆవిరి కొడ్తుందని చెప్పారు. అలా చిన్నపిల్లనైనా వంటా అది చేసి సమర్థవంతంగా ఇల్లు 1, 2 నెలలు నిర్వహించి నందుకు నాన్నగారు నాకు 100 రు॥ ప్రెజెంటేషన్ ఇచ్చారు. వంట సులభంగా చేస్తారు అంటారు గాని వంట బాగా చెయ్యడం కూడా ఒక కళే. ఏది ఎంత వరకు ఉడకాలో అంతమటుకే ఉడికించి తగుమాత్రం ఉప్పు, కారం వేయాలి. పోపు కమ్మగా పెట్టాలి. పోపులోనే రుచి వస్తుంది.

కొవ్వూరులోనే ఫ్యాక్టరీ దగ్గర మాకొక మామిడి తోట కూడా ఉండేది. ఎప్పుడైనా అక్కడికి షికారు వెళ్తుండే వాళ్ళం. ఆ మామిడి తోటలో గులాబ్ జామ్ చెట్లు ఇంకా ఇతర చెట్లు కూడా ఉండేవి. మా నాన్నగారు ఆ మామిడితోటలో నాకు ఇల్లు కట్టుకునేందుకు 1000 గజాల స్థలం ఇచ్చారు. మా నాన్నగారు అమ్మగారు మా అక్క చెల్లెళ్ళకి ముగ్గురికి కొంత ఆస్తి ఇచ్చారు.

## చిన్ననాటి హైస్కూలు జీవితం

కొవ్వూరులో బోర్డు హైస్కూల్లో నేను 5 వ క్లాసులో చేరాను. అప్పుడు 11 మంది ఆడపిల్లలు దాక ఉండేవాళ్ళం. క్రమేపి ఆ సంఖ్య థర్డ్ ఫారం లోకి వచ్చేసరికి 5 గురు ఆడ పిల్లలం మిగిలాం. నాకు స్కూల్లో 70, 80 మార్కులు వస్తూండేవి. వెంకన్న మాస్టారని ఉండేవారు. ఆయన మమ్మల్ని వేళాకోళం చేస్తూ ఇలా అనేవారు. ఇంకెన్నాళ్ళు లెండి మీరా చదువు? మీ వాళ్ళేలాగో మాన్పించేసి మీ పెళ్ళిళ్ళు చేసేస్తారని. మేము ఆయన మీద కోపగించుకునేవాళ్ళం- మేమేమి పెళ్ళి చేసుకోమండీ మాస్టారు! చదువుకుంటా మని. ఆయన చదువులో కొంచెం వెనుకగా ఉన్న మగ పిల్లల్ని ఇలా గసిరేవారు. మూడు పూట్ల మూడు కంచాల అన్నం శుభ్రంగా తినగలరూ? ఒక్కొక్కసారి కుంచెడు అన్నం లాగించేస్తారు సులువుగాను. చదువులో మటుకు మొద్దులా! మీ వాళ్ళు నెలకి ఆరు ముప్పావలా జీతం కడున్నారు. ఆ జీతం వాళ్ళు చేత ఎందుకు కట్టిస్తున్నారర్రా? తెంపి వెధవ ల్లారా! చీపురు కట్ట వెధవల్లారా! అని తిట్టేవారు.

ఇంకో మాస్టారు ఇంగ్లీషుకి కడియాల సుబ్రహ్మణ్యం గారు ఉండేవారు. ఆయన సుప్రసిద్ధ కవులు శ్రీ పాద కృష్ణ మూర్తి శాస్త్రిగారి అల్లుడు. ఆయన మాకు ఇంగ్లీషులో రవీంద్ర నాథ్ టాగూర్ పాఠం చెప్తూ శ్రీ పాద కృష్ణ మూర్తి శాస్త్రి ఈజ్ ఎ పొయెట్ అని చెప్పేవారు. ఆయన దగ్గర ఆ స్కూల్లోనే మా అక్కయ్య, మేము, మా మేనత్త పిల్లలు అందరు చదువుకున్నాం. అందుకని ఆయన నాతో "ఆ! నీకు చెప్పామోయ్ ఈ చదువు! మీ అమ్మకి చెప్పాం. మీ అమ్మమ్మకి చెప్పాం. అందరికీ చెప్పాం ఈ చదువు" అనేవారు. డి. ఇ. ఒ. ఇనస్పెక్షన్ కి వచ్చినప్పుడు మాష్టర్లందరూ చాలా భయపడి పోయి తమ క్లాసుల్ని చాలా జాగ్రత్తగా చూసేవారు. నేను 5 వ క్లాసు చదువుతున్నప్పుడు కుక్కనూరి సాంబశివరావుగారని చాలా స్ట్రిక్ట్ అయిన హెడ్ మాస్టరుండేవారు. ఆయన్ని చూస్తే అందరికీ హడలు. ఆయన ఖద్దరు తలపాగ చుట్టుకొని ఒక గళ్ళ కోటు తోడుక్కుని పంచె కట్టుకొని చేతిలో బెత్తంతో హుందాగా నిల్చునేవారు. పదయ్యేసరికి బెత్తం పుచ్చుకొని స్కూల్లో నాలుగు వైపులా వరండాల మీద రౌండ్సు తిరిగేవారు. కొంచెం ఆలస్యంగా వచ్చిన మగపిల్లల్ని "ఆ! ఎందుకు రాలేదు?" అని చేతి మీద బెత్తంతో ఒక దెబ్బ వేసి పంపించేవారు. ఇప్పటిలా కాకుండా పిల్లలకి అప్పటి హెడ్ మాష్టర్లంటే, మాష్టర్లంటే చాలా భయం ఉండేది. చదువు కూడా చాలా కట్టు దిట్టంగా చెప్పేవారు. మాకు కార్పెంటరీ, హిందీ కూడా ఉండేవి. స్కూల్లో గార్డెన్ కూడా ఉండేది. యస్. యల్. సి. లోకి వచ్చేసరికి ఇద్దరో ముగ్గురో

తప్ప ఆడపిల్లలుండేవారు కారు. అది సగపిల్లల బడి అవడంచే చాలా మంది తల్లిదండ్రులు పెద్దమనిషి అయ్యాక తమ పిల్లల్ని బడికి పంపేవారు కారు. అయినా అప్పట్లో యస్. యల్. సి అంటేనే పెద్దచదువు! యస్. యల్. సి. పాస్ అయిన పిల్లల్ని కొంత మంది పెళ్ళివారు చదువు కున్నపిల్లలు సరిగ్గా కాపురం చేస్తారా అని వెనక్కి వెళ్ళి పోవడం నాకు తెలుసు— మా నాన్నగారు కూడా నేను థర్డ్ ఫారం పాస్ అయ్యాక పెద్దమనిషి నయ్యానని స్కూలు మాన్పించి ఇంట్లోనే ఉంచి తెలుగు, సంస్కృతం నేర్పించారు అయితే ఇరవై ఏళ్ళలో స్త్రీ విద్య బాగా పెరిగింది. ఆడపిల్లలు చదువు కుంటే తప్పు లేదు. అయినా ఇప్పటికి లేని కుటుంబాలలో పల్లెటూళ్ళలో చాలామంది ఆడవాళ్ళు చాలా తక్కువ చదువుతో నిరక్షరాస్యులుగా ఉన్నారు. ఇప్పటికీ మొత్తం స్త్రీల సంఖ్యలో చదువు కున్న వారిసంఖ్య స్వల్పం. స్త్రీకి విద్య వున్న నాడు ఆమె తన కుటుంబాన్ని పిల్లల్ని తీర్చిదిద్ద గలుగుతుంది.

నేను ఇంటి దగ్గరే ఉండి ఐన్ స్టీన్ పరమాణువాదం, నుంచి ఆధునిక వైద్య విజ్ఞానం, ప్రాచీన విజ్ఞానం, కళలు, సాహిత్యం, పురాణాలు, ఉపనిషత్తులు, స్మృతులు, కావ్యాలు, ప్రపంచలోని మంచి రచయితల, రాజకీయ వేత్తల, మహా నాయక పుస్తకాలు, ఇంకా ఇతర అనేక ఉత్తమ గ్రంథాలు శ్రద్ధగా చదివాను. మననం చేశాను. ఇంటి దగ్గరే వుండి నా జ్ఞానాన్ని చాలా అభివృద్ధి పరచుకున్నాను. మార్క్సు, లెనిన్, ఎంగెల్స్ వ్రాసిన పుస్తకాలు ప్రతివారు చదవ తగ్గవి. చారిత్రక భౌతికవాదం, గతితార్కికవాదం గురించి ఇవి తెల్పుతాయి. హేతువాద దృష్టిని ఇవి పెంపొందింప

చేస్తాయి. చరిత్ర, సమాజ పరిణామ క్రమం ఇవి తెల్పు తాయి. కొవ్వూరులో నేను చదివిన హైస్కూల్లోనే మా పెద్దమ్మాయి రుక్మిణికూడ 7వ తరగతి వరకు చదివింది. నాకు చెప్పిన మాష్టర్లే కొందరు ఆమెకి చదువు చెప్పారు. మా నాన్నగారు ఆమెని మంచి స్కాలర్‌గా చేస్తాననేవారు. డిగ్రీలు ఎన్నిపుచ్చుకున్నా మన జ్ఞానాన్ని మనం ఎక్కువగా మంచి పుస్తకాలు చదివి అభివృద్ధి పరచుకోవాలి. కొంత మంది స్కూల్లో వాళ్ళకి సంబంధించిన విషయాలే చదువు తారు. ప్రపంచం గురించి ఏమీ తెలీదు. వాళ్ళు ఇతర పుస్తకాలుగానీ, కనీసం పేపర్ కూడ చదవరు. ప్రపంచంలో ఎంతోమంది మేధావుల్ని, రచయితల్ని పరిశీలిస్తే వాళ్ళు పెద్ద డిగ్రీలేమీ తీసుకున్నట్టు కనబడరు. కానీ వాళ్ళు వ్రాసిన పుస్తకాలు చదువుతుంటే పెద్ద పెద్ద డిగ్రీలకి పాఠ్య గ్రంథాలుగా పెట్ట తగ్గవిగా ఉంటాయి. అందుకని డిగ్రీలు లేనివారు విజ్ఞానవంతులు కారని, డిగ్రీలున్నవారే జ్ఞానవంతులని మనం అనుకోనక్కర లేదు.

## అసలు నా మొదటి రచన నా 16వ యేట

అసలు నా మొదటి రచన గురించి చెప్పాలంటే నా 16వ యేట విశాఖపట్నంలో మా మేడమీద గదిలో కూర్చుని గులాబీ పువ్వుని, స్త్రీ జీవితాన్ని పోలుస్తూ ఒక వచన కవిత వ్రాశాను. అది నా మొదటి రచనగా భావిస్తే నేను సాహిత్యంలో ప్రవేశించి ఇప్పటికి 31 ఏళ్ళు అయిందన్న మాట! అయితే ఆ కవితని నేను ఏ పేపర్‌కి పంపలేదు.

అది కొన్నాళ్ళు నేను ఎక్కడో దాచాను. ఇప్పుడు పోయింది. అచ్చయిన నా మొదటి రచన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 18-5-57లో వనితా లోకంలో "చల్లనిచూపు-చల్లనిమాట" అన్నది. అది హాస్పిటల్‌లో నర్సులు, వాళ్ళు రోగులకి సేవ చేయ వలసిన విధానం గురించి. అప్పట్నించీ ఇప్పటివరకూ వ్రాస్తూనే వున్నాను. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర, ప్రగతి, జయశ్రీ, శ్రీమతులు, అభిసారిక, కళాకేళి, ఆంధ్రప్రదేశ్, అనామిక, స్నేహ, యూనిలిట్, విశ్వరచన, తెలుగువెలుగు, ఆంధ్రజ్యోతి, స్రవంతి, లావణ్యా ఇంకా అనేక పెద్దపేపర్లు, చిన్నపేపర్లు, 60 దాకా ఉంటాయి అన్నిటిలోనూ నా రచనలు అసంఖ్యాకంగా ముద్రింపబడినవి. నా గేయాలు రేడియోలో ప్రసారమవుతూ వుంటాయి.

## కొన్ని బాల్య స్మృతులు

నా చిన్నప్పుడు మా యింటికి గుంటూరునుండి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు శారద నికేతనం విద్యార్థినులు ఏడాదికి ఒకసారి వచ్చేవారు. ఊళ్ళో పెద్ద వారందరి దగ్గరా చందాలు వసూలు చేయడానికి 2, 3రోజులు ఉండేవారు. ఆ అమ్మాయిలతో గుర్రంబండి మీద వెళ్ళి ఊళ్ళో పెద్ద వాళ్ళిళ్ళు చూపిస్తుండేదాన్ని. ఉన్నవ లక్ష్మీనారాయణగారు, వారి శ్రీమతికూడ గొప్ప సంస్కరణ వాదులు. ఆనాడు ఉన్నవవారు వ్రాసిన మాలపల్లి గొప్ప అభ్యుదయ పరమైన నవల. అలాగే శ్రీ వీరేశలింగంగారు కూడా గొప్ప సంస్కరణవాది. శ్రీ కందుకూరి వీరేశలింగం

గారు సంఘాన్ని మార్చిన గొప్పవ్యక్తి. ఆనాటి సంపన్నులైన గృహస్థులకి వేశ్య లుండేవారుట. రాజమండ్రిలో వేశ్యల్ని వుంచుకోవడం తప్పుగా కాక గొప్పగా పరిగణించే వారుట. ఎక్కువ వయసులేని మగపిల్లలుకూడ వేశ్యల దగ్గరికి వెళ్ళి డబ్బు వదిలించుకొని రోగాల పాలయ్యేవారు. వీరేశలింగం గారి ప్రభావం వల్ల చాలామంది పెద్దలు, పిన్నలు, వేశ్యల్ని ఉంచుకోవడం మానేశారు. ఆడపిల్లల బాల్య వివాహాలు తప్పిపోయాయి. వితంతు వివాహాలు జరిగాయి. స్త్రీ విద్య పెంపొందింది. పతనమైపోతున్న జాతిని రక్షించారాయన. వారి కృషిని ఇంకా మనం ముందుకు తీసుకెళ్ళాలి.

## మహాకవి కాళిదాస శాకుంతలంలోని శ్లోకాలు

మనం డిగ్రీలు ఎన్ని పుచ్చుకున్నా ఎంత చదువు చదివినా సంస్కృతములోని పంచకావ్యాలు చదువుకుంటే గానీ చదువు పరిపూర్తి కాదని మా నాన్నగారనే వారు. నే నెప్పుడు అత్తవారింటికి వెళ్ళినా కాళిదాసు శాకుంతలంలోని శకుంతలని దుష్యంతుని దగ్గరకి పంపేటప్పుడు శకుంతల, కణ్వుడు బాధపడిన ఘట్టంలోని శ్లోకాలు చదివేవారు.

"యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టము త్కంఠయా కణ్ఠస్తంభిత బాష్పవృత్తం"- ఈ శ్లోకం చదివే వారు. కాళిదాసుని శాకుంతలం చాలా అపూర్వమైన గ్రంథం. మానవ మనస్తత్వం అందులో బాగా చిత్రింప బడింది. అందుకే అది ఆనాటి నుంచి నేటిదాక సజీవంగా ఉంది. తను పెంచిన పూలచెట్టు మొదటిసారిగా మొగ్గతొడిగి

నప్పుడు శకుంతల పండుగ చేసు కొనేదిట. లతలకి, వృక్షాలకి నీళ్ళు పోయకుండా ఆమె అన్నం ముట్టేదికాదు. అత్తవారింటికి వెళ్ళేటప్పుడు శకుంతల ప్రతి చెట్టుని లతని పలుకరిస్తూ కంట తడి పెట్టుకొంటుంది. చాలా హృదయ విదారకంగా ఉంటుంది ఆ దృశ్యం! తపస్యులు, సన్యాసులమైన మనకే ఇంత బాధ, కన్నీళ్ళు వచ్చాయి. ఆడపిల్లని అత్తవారింటికి పంపేటప్పుడు మామూలు గృహస్థుల బాధ చెప్పేదేముంది? అంటాడు కణ్వుడు. ఎంత బాగా ఆడపిల్లని అత్తవారింటికి పంపేటప్పటి దృశ్యాన్ని పరిశీలించి వర్ణించాడు కాళిదాసు! అందుకే "కావ్యేషు నాటకం రమ్యం నాటకాంతా" శాకుంతలం" అంటారు.

శ్రీశ్రీ "ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసముహాము లేవి తల్లీ" అనుపాటలో "కాళిదాసు మహా కవీంద్రుని కవన వాహినిలో కరిగిన ఉజ్జయిని నేడెక్కడమ్మా ఉంది చూపించు" అంటాడు. శ్రీశ్రీ ఈ యుగపు మహాకవి. అతడు ఏం వ్రాసినా ఎలా వ్రాసినా కవిత్వమై కూర్చుంటుంది. అందుకే తిలక్ కూడా 'కవిత్వం అంటే కాళిదాసుకి తెలుసు, పెద్దనకి, శ్రీశ్రీ కి తెలుసు' అంటాడు. నాకు పాటలంటే కూడ చాలా యిష్టం. చిన్నప్పుడు పేరంటానికి వెళ్ళినప్పుడు ఈ అమ్మాయి కంఠం బావుంటుంది పాడమనే వారందరూ. శ్రీ బసవరాజు అప్పారావుగారు వ్రాసిన "గాంధీ మహాత్ముడు బయలు దేరితే కల కల నవ్వింది" అనే పాట నా చిన్నప్పుడు అందరూ పాడేవారు. ఈ పాటంటే నాకు చాలా యిష్టం. పాడతాను. ఆయన ఎంత బాగా పరిశీలించారో గాంధీని! ఆ పాటలో ఒక చరణంలో 'గాంధీ మహాత్ముడు

చకచక నడువగ కంపించిపోయింది భూదేవి కంపించిపోయింది' అన్నారు. ఈ పాట చాలా అర్థవంతంగా, అందంగా ఉంటుంది. అమరావతీ పట్టణంన ఆంధ్రులు బౌద్ధవిశ్వవిద్యాలయమును స్థాపించునాడు (రాయప్రోలు) అను పదము, (ఇది చక్కని వరుసలో గ్రామఫోన్ రికార్డ్‌గా వచ్చింది.) శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి పుష్పవిలాపం కూడా నాకెంతో యిష్టం. శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు గొంతులో పుష్పవిలాపం తేనె లూరుతూ, కరుణరసంలో ప్రవహిస్తూ అందంగా ఉంటుంది. కొల్లాయిగట్టితేనేమి అనే పాట, మా కొద్దీ తెల్ల దొరతనం అనేపాట నా చిన్నప్పుడు పాడేవారు. బేండు మేళంవాళ్ళు మా కొద్దీ తెల్లదొరతనం అనే పాట స్వాతంత్ర్యం రాక మునుపు వాయిస్తుంటే పోలీసులు ఏమిట్రా పాడుతున్నారు అని గదమాయిస్తుండేవారు. అప్పుడు వాళ్ళు పాట కాదండీ ఏదో నా నా నా నా అని వాయిస్తున్నాం అని తప్పించుకునేవారు.

## మంచి పుస్తకాలు

అడవి బాపిరాజుగారు రచించిన నారాయణరావు నవల నేను చాలాసార్లు చదివాను చిన్నప్పుడు. ఆనాటి సామాజిక పరిస్థితులు, కాంగ్రెస్ ఉద్యమం అన్నీ ఉంటాయి అందులో. ఏమైనా మంచి పుస్తకం చదువుతున్నప్పుడు, మంచి సాహిత్యం గురించి ప్రసంగాలు విన్నప్పుడు, రచన చేస్తున్నప్పుడు అలౌకికానందంగా ఉంటుంది. అది అయిపోయి మళ్ళీమామూలు ప్రపంచంలోకి రావాలంటే కొంచెం

కష్టంగానే వుంటుంది. ఇవేమి లేకుండా నిద్ర, తిండి, పని, ఉద్యోగాలు, ధనార్జన వీటితో ఎలా బ్రతుకుతున్నారు అందరూ అనిపిస్తుంది. నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియాలో ఇలా అంటాడు. తను ఆ రోజుల్లో మంచి పుస్తకాలు చదువుతున్నప్పుడు దాని గురించి ఏదో ఆలోచిస్తూ ఆవేశంలో భూతం పట్టినవాడిలా వుండే వాడినని. అంటే పుస్తకాలు ఆలోచనల్ని రేకెత్తించి వానిని బ్రెయిన్‌లో తిరుగుతూ ఉండేటట్లు చేస్తాయి. మనం యాంత్రికంగా శరీర కార్యక్రమాలు ఇతర పనులు నిర్వహిస్తున్నా ఆలోచన అటువైపే ఉంటుంది. మనస్సు ఇతర పనుల మీద వుండదు.

## కృతి అంకితం పుచ్చుకొనుట 1961

కొవ్వూరులో సుప్రసిద్ధ కవి పండితులు శ్రీ వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు సత్యద్రౌపదిసంవాదం అనే వారి కృతిని నాకు అంకితం యిచ్చారు. మహాభారతంలోని సత్యభామ ద్రౌపదిని నీ భర్తలు నువ్వంటే ఎందుకు అంత అనురాగంగా ఉన్నారు? వాళ్ళకేమైనా మంత్రం వేసి వశ పర్చుకున్నావా? ఏమైనా మందులు పెట్టావా? ఏమిటి కారణం? అని అడుగుతుంది. ద్రౌపది ఇవేమి కావు, తన పత్రివ్రవర్తనచే భర్తల్ని వశపర్చుకున్నానని, వారికి, అత్తమామలకి తను ఎంత సేవ చేసేది, ఇంట్లో ఎలా తను గృహకృత్యాలు నెరవేర్చేది చెప్తుంది. ఇవి పద్యాలలో వ్రాయబడినవి.

## రాహుల్ సాంకృత్యాయన్ 22 శతాబ్దం గురించి

రాహుల్ సాంకృత్యాయన్ వ్రాసిన 22 వ శతాబ్దం అనేపుస్తకం అంటే నాకు ఎంతో యిష్టము. దీనిమీద ఒక వ్యాసం వ్రాశాను. అది "అరుణరేఖ" అనే పేపరులో అచ్చయింది. వసుధైక ప్రభుత్వం, ప్రపంచ మానవులంతా ఒకటై సుఖంగా జీవించడం ఇందులో వుంటుంది. నాకు మంచి పుస్తకాల్ని దేనినైనా చదివితే వాటి గురించి వ్యాసం వ్రాయాలని వుంటుంది. రచయిత మిత్రులకు ఉత్తరాలలో దాని గురించి వ్రాసేదాన్ని.

నాకు మా తెలుగు తల్లికి మల్లెపూదండ పాట అంటే చాలా యిష్టం. పాడుతుండే దానిని.

## వివాహాలు-అన్నదానాలు

మా అక్క పెళ్ళి, నా పెళ్ళి కూడా శాస్త్రోక్తంగా 5 రోజులు చేశారు ఇల్లు, డాబా, దొడ్లు చాలక భోజనాలు పెట్టడానికి వీధులలో కూడా పందిళ్ళు వేయించి విస్తళ్ళు వేయించారు. పాఠశాల విద్యార్థులందరికీ మా ఇంట్లో భోజనం పెట్టించారు. ఊళ్ళోని హరిజనులకి కూడా భోజనం పెట్టారు. మామిడి పండ్లు వచ్చినపుడు మా నాన్నగారు ప్రత్యేకంగా హరిజనులకు కూడా పిలిచి ఇచ్చేవారు. మా పొలంలో పనిచేస్తున్న పాలేరు హరిజనుడు ముసలివాడై పని చేయలేకపోతే అతనికి పింఛెన్ ఏర్పాటు చేశారు. రెండు తరాల స్త్రీలన్నా నా వనలలో పాలేరుకు పింఛెన్ ఇవ్వడం గురించి రాయడం జరిగింది

## యాచకులు

నా చిన్నప్పుడు ఒక ముసలతను హరిజనుడు మాసిన కోటు తొడుక్కొని మా యింటికి ముష్టికి వచ్చేవాడు. కొందరు ముష్టివాళ్ళుగా వుండడం జాతి ప్రగతికి లోపమే! అప్పుడు దోసెడు నిండా బియ్యం వేసేవాళ్ళం. ఇప్పుడు గుప్పెడులోకి వచ్చింది. అతనికి రోజూ నేను బియ్యం వేసే దాన్ని. గుమ్మంలోకి వస్తూనే పార్వతమ్మగారూ అని పిలిచే వాడు. పొద్దున్నించీ మధ్యాహ్నందాకా యాచకులు వస్తూనే వుండే వాళ్ళు. వచ్చిన వాళ్ళకి లేదనకుండా దోసెడునిండా బియ్యం వేసి పంపే వాళ్ళం. నేను ముష్టివాళ్ళ సమస్యల మీద అనాథ యాచకులు, అనాథ భిక్షుకి, అనాథ బాలలు అని మూడు వ్యాసాలు వ్రాశాను. ఇవి తెలికోడి అన్న పేపర్‌లో అచ్చయ్యాయి. ఆ వ్యాసాలు అచ్చయినపుడు పాఠకుల దగ్గర్నించి ప్రశంసా పూర్వకమైన లేఖలు వచ్చాయని ఎడిటర్ శ్రీ జి. వి. యల్. నరసింహారావుగారు వ్రాశారు. అప్పుడు కానీకి కారబూందీ, కారపూస, అర్ధణాకి గులాబ్‌జామ్ ఇచ్చేవారు. సరుకులు చవకగా రుచిగా వుండేవి కూరలు, పప్పులు, నెయ్యి కమ్మగా వుండేవి. ఇప్పుడలా ఏమీ లేదు. పనిచేసే వాళ్ళదగ్గర కూడ నాను పుస్తెలతాడు వుండేవి. అప్పుడు పదిరూపాయలకు కూడ చిన్న సంసారం జరిగిపోయేదిట. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చిన దగ్గర్నుంచీ ధరలు పెరగడం మొదలు పెట్టాయి. అలా పెరిగి పెరిగి ఇప్పటికి తారాపథం చేరుకొన్నాయి. ఏ ప్రభుత్వం మారినా ధరలు తగ్గడం కనబడడం లేదు. జీవి

తావసర వస్తువులు తిండి, బట్ట, మందుల ధరలు, విపరీతంగా పెరుగుతున్నాయి. మామూలు ప్రజలు బ్రతకలేని స్థితికి వచ్చారు. ధరలు తగ్గేరోజు ఎప్పుడొస్తాయో! పాడిపంటలు సమృద్ధిగా వుండేరోజు ఎప్పుడు చూస్తామో!

## పాడిపంటలు - ధనధాన్యాలు

బాగా సంపన్నులఇల్లు అవటనుంచి మా ఇల్లెప్పుడు పాడి పంటలతో, ధన ధాన్యాలతో కళ కళ లాడుతూ వుండేది. వచ్చేపోయే బంధుమిత్రులతో సందడిగా ఉండేది. బంధువులో, స్నేహితులో, ఊళ్ళోవాళ్ళో ఎవరో ఒకరు బియ్యం కోసమో, డబ్బుకోసమో, మరి ఏ వస్తువు కోసమో వస్తూ వుండేవారు మా యిల్లు బజారులో మెయిన్ రోడ్డుకి దగ్గరలో వుండేది. ఇంటికి మూడు వైపులా పెద్దరోడ్డు సెంటరులో వుండేది యిల్లు. ఆ రోజుల్లో మా కొవ్వూరులో ఎలక్ట్రిసిటి లేదు. గొప్ప వాళ్ళిళ్ళల్లో మటుకు రాత్రి అయ్యే సరికి పెట్రోమాక్సు లైటు వెలిగించేవారు. మా నౌకరు సూరన్న సాయంత్రం అయ్యేసరికి పెట్రోమాక్సు లైటు వెలిగించి రంగు రంగుల రాళ్ళతో గచ్చు చేయించిన మా హాల్లో మధ్యన వ్రేలాడదీసిన ఇనప చువ్వకి తగిలించే వాడు. హాల్లో గోడలకి మా నాన్నగారు బొంబాయి నుంచి తెచ్చిన ఆయిల్ పెయింట్ సీనరీలు పెద్ద పెద్దవి అందంగా వుండేవి. ఎదురుగా వున్న అద్దాల బీరువాలో మద్రాసు నుంచి తెచ్చిన అందమైన బొమ్మ లుండేవి. మా యింట్లో హాల్లోనే మా పెళ్ళిళ్ళు జరిగాయి. హాలు మధ్య పసుపు

రంగు వేసిన నాలుగు పెద్ద స్తంభాలు డిజైన్‌తో వుండేవి. ఆ స్తంభాల పైన తెల్ల గుడ్డకట్టి ఆ గుడ్డమీద రంగు రంగుల కాయితం పూలు, ఆకులతో చాందినీ కట్టేవారు.

## నాన్నగారి కృషి గురించి

మా నాన్నగారు అనేవారు అప్పారావు ఒక్కడే ఈ యింటికి డబ్బుతో సంబంధం లేకుండా వచ్చే వ్యక్తి అని. మా నాన్నగారు పోయినప్పుడు సోదరులు కేశరాజు అప్పారావుగారు ఆయన జీవిత విశేషాల్ని సంక్షిప్త కార్యక్రమాల్ని తెలియపరుస్తూ ఒక వ్యాసం ఆంధ్రపత్రిక డైలీలో వ్రాశారు. తరువాత ఆ వ్యాసాన్ని రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారి సంక్షిప్త జీవిత చరిత్ర అని పుస్తకం క్రింద వేశారు. అందులో అప్పారావుగారు ఇలా వ్రాశారు. "వీరత్వం—నాలుగు తెరగులు. ధర్మ వీరత్వం, దయా వీరత్వం, దాన వీరత్వం, రణ వీరత్వం, ఈ నాల్గు శర్మగారిలో ఉన్నాయి. కొవ్వూరులో ఆయన కట్టించిన వీర సంస్మరణ మందిరం యావత్ భారత దేశంలో మొదటిది" అని వ్రాశారు. మా నాన్నగారు రాజమండ్రి లోని గౌతమి గ్రంథాలయానికీ, కొవ్వూరు గ్రంథాలయానికీ కొంత కాలం కార్యదర్శిగా పని చేశారు. ఎ. ఐ. సి. సి. లో ఆయన ప్రవేశ పెట్టిన తీర్మానాలు నెహ్రూ, రాజేంద్రప్రసాద్ మొదలగు పెద్దల మన్ననలను బడసేవి. 1959 లో నాన్నగారు పోయినప్పుడు రాజేంద్ర ప్రసాదు టెలిగ్రాం ద్వారా సానుభూతి సందేశం పంపారు. రాజేంద్రప్రసాద్‌ని అందరూ అజాత శత్రువు అంటారు. చాలా గొప్పవ్యక్తి. నాన్నగారు అంటే చాలా గౌరవం.

## గోదావరీ స్నానం

నా చిన్నప్పుడు పండగ పబ్బాలకి కార్తీక మాసంలో తెల్లారకట్ట మా అమ్మగారితో గోదావరీ స్నానానికి వెళ్ళే దాన్ని. ఎంత చలిగా వున్నా కొంచెం మునిగాక వెచ్చగా ఉంటుంది. నదిలో తేలిపోతున్న కార్తీక దీపాలు ఎంత అందంగా ఉంటాయి! వర్ష ఋతువులో ప్రతి ఏడూ గోదావరి గట్లు నొరుసుకుంటూ నీళ్ళతో నిండుగా సుళ్ళు తిరిగి ప్రవహిస్తూ ఉండేది. ఊళ్ళో అందరూ గోదావరి ఒడ్డుకెళ్ళి చూస్తూ ఉండేవారు. గోదావరిని చూస్తున్నప్పుడు నాకు అడవి బాపిరాజుగారి నవల నారాయణరావులో గోదావరిని గూర్చి గౌతమీ సుఖశీతోష్ణాంగి అని ఇంకా ఏదో అంటారు. అది జ్ఞాపకం వస్తుంది. రవీంద్రనాథ్ ఠాగూర్ నది ఒడ్డున కూర్చుంటే నది చేసే గుస గుసలలో (చప్పుళ్ళలో) గడిచి పోయిన గాథలెన్నో చెప్తున్నట్లుంటాయి అన్నారు. అది కూడా జ్ఞాపకం వస్తుంది.

## శ్రీ శంకరాచార్యులు

శ్రీ శంకరాచార్యులవారి సూత్ర భాష్యము రోజూ పారాయణము చేస్తుండేవారు నాన్నగారు. గ్రాహ్యగ్రాహక విముక్త శూన్య స్థితని బౌద్ధులంటే, శంకరులు "గ్రాహ్య గ్రాహక విముక్త బ్రహ్మస్థితి" అని ఆత్మ పదార్థమును అన్నారు అని నాన్నగారు చెబుతూ వుండేవారు. అంటే గ్రహించేది, గ్రహింపబడనిది అయిన శూన్యస్థితి నిర్వాణం అని బౌద్ధులంటే, గ్రహించేది, గ్రహింపబడనిది అయిన

బ్రహ్మస్థితి మోక్షమని శంకరు లన్నారు. శంకరాచార్యుల వారిని చాలామంది ప్రచ్ఛన్న బౌద్ధులనే వారు. ఆయన మండన మిశ్రునితో వాదనకి వెళ్దామని ఆ ఊరు వెళ్ళినప్పుడు ఊళ్ళోవాళ్ళని మండనమిశ్రుని ఇల్లు ఏదని అడుగగా "ఏ యింటిలో చిలుకలు, గోరువంకలు గుమ్మంముందు శాస్త్ర చర్చలు చేస్తుంటాయో ఆ యిల్లే ఆయనది" అన్నారట. మండన మిశ్రుని భార్య ఉభయ భారతి గొప్ప విద్వాంసు రాలు. నాన్నగారు సూత్రభాష్యము, ఉపనిషత్తులలోని విష యాలు నాకుకూడ చెప్తుండేవారు. మా యింటిలో రోజూ కొవ్వూరులోని సంస్కృత పాఠశాల పండితులు సాయంత్రం వచ్చి నాన్నగారికి రామాయణము, భారతము(సంస్కృతం) వినిపిస్తుండేవారు. నేను కూడా వాళ్ళ పురాణములు అయ్యే దాకా కూర్చొనేదాన్ని. క్రితంరోజు ఎంతదాకా చదివామని వాళ్ళు అనుకునే విషయాలని నేను అందించేదాన్ని.

## త్రిపుర రామధర కాంగ్రెస్ డాక్యుమెంటరీలు

సినీ నిర్మాత బి. యన్. రెడ్డిగారే అనుకుంటాను- ఆనాడు జరిగిన త్రిపుర రామధర్ కాంగ్రెసును డాక్యు మెంటరీ కింద తీశారు. ఎప్పుడైనా మళ్ళీ అది చూస్తే బాగుండును అనుకుంటాను. అందులో నాన్నగారు కని పించారు.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు న్నప్పుడు ఆంధ్రపత్రికలో నా వ్యాసము లేని రోజు అంటూ ఉండేది కాదమ్మా అనేవారు నాన్నగారు. ఒకసారి ఆయన వండే

మూతరం ఉద్యమంలో సైమన్ కమీషన్ వచ్చినప్పుడు ఒకబోర్డరు దాటి వెళ్ళితే అరెస్టు చేస్తామని గాని కాల్చి వేస్తామని గాని బ్రిటీష్ అధికారులు అన్నారు. ఆయన అప్పుడు చావుకి తెగించి అలా వెళ్ళినప్పుడు ఒక వ్యాసాన్ని ఆంధ్రపత్రికకి పంపాను.

చాలా రోజులు ఆ పేపర్ కటింగ్స్ మా యింట్లో ఉండేవి. శ్రీ ప్రకాశంగారు కూడా అప్పుడే సైమన్ కమీషన్‌కి గుండు పేల్చుకోమని ఛాతీ చూపించారు. అలనాటి నాయకుల ప్రసంగాలు అన్నీ ఆ పాత పేపర్లలో ఉంటాయి. అవన్నీ పుస్తకంగా ప్రచురించి విద్యార్థులకి పాఠ్య గ్రంథం కింద పెడితే ఎంత ఉపయోగకరంగా ఉంటుంది! ఆ నాడు తీసిన డాక్యుమెంటరీలు ఇప్పటి సినిమాల ముందు చూపిస్తే యువతరం ఆ విశేషాన్ని చూడగల్గుతుంది.

## భూములున్న ఊరు వెళ్ళేట

చిన్నప్పుడు మా నాన్నగారితో కలసి అప్పుడప్పుడు మా భూములున్న ఊరు కోరుమామిడి వెళ్ళేదాన్ని. నిడదవోలులో రైలుదిగగానే పాలేరు రెండెడ్ల బండి తెచ్చేవాడు. దారంతా గతుకులతో కుదుపులుగా ఉండేది. వెళ్తుంటే దార్లో ఏవో అడవిచెట్లు, లతలు, తీగెలు, చెరువులు, అందులో తామరపువ్వు లుండేవి. 'ఈ అన్యాయం నశించిపోవాలి' కథలో ఈ వాతావరణాన్ని వర్ణించాను. అక్కడ మరో పురాతనమైన మట్టి ఇల్లు ఉండేది. అందులో ఆ భూములు అజమాయిషీ చేసే గుమాస్తాగారు, భార్య కాపు

రం ఉండేవారు. ఆయన భార్య అప్పుడే చెఱువునుండి తెచ్చిన పచ్చి తామర ఆకుల్లో వేడి వేడి అన్నం వడ్డించేది. వేడి అన్నం ఆ ఆకుల్లో వడ్డించడంవల్ల అన్నం తామరాకు వాసన వేసేది. అప్పుడు కాసీకి 12 జీళ్ళు ఇచ్చేవారు. జీళ్ళు కొనుక్కునే దాన్ని. మధ్యాహ్నం పొలానికి బయలు దేరేటప్పుడు ఎండలో దాహం వేస్తే అక్కడ మంచినీళ్ళు ఉండవు. కనుక రాశి ఉసిరికాయ బుగ్గన పెట్టుకుని రమ్మనేవారు నాన్నగారు. దాహాన్ని ఆపుతుందిట. పొలంలో ధాన్యం రాసులకింద పోసి ఉండేవి. ఇవి ఎన్ని బస్తాలవుతాయో నాన్నగారు చెప్పమనే వారు. నేను కొంచెం ఇంచుమించు సరిగ్గానే చెప్పేదాన్ని. పాలేర్లు మమ్మల్ని కామందులొచ్చారు అనేవారు. నాకు కామందులన్నమాట కొంచెం చిత్రంగా తోచేది.

కరణాలొచ్చారు అనేవారు. కరణాలు అన్నప్పుడు ఒక విషయం చెప్పాలి. మా నాన్నగారు శాఖలు ఎలా ఏర్పడ్డాయో చెప్పేటప్పుడు కరణాలు అనే విషయాన్ని ఇలా చెప్పారు. పూర్వం బ్రాహ్మణులు ఉద్యోగాలు లేక బాధపడ్డారు. గోపరాజు ప్రధాని చూసి జాలిపడ్డాడు. గోపరాజు ప్రధాని తను పనిచేస్తున్న రాజుగారికి ఒకసారి ఏదో మేలు చేయగా ఆ రాజుగారు నీకు ఏం కావాలో కోరుకో అన్నారుట. నాకు అవసరమైనప్పుడు అడుగుతాను ఒక అరగంట కాలం మీ రాజముద్రిక ఇవ్వాలన్నాడట. సరే అన్నాడు రాజు. ఒకసారి గ్రహణం వచ్చిందిట. గ్రహణకాలము అప్పుడు రాజుగారి ముద్రిక అడిగి అరగంటలో ఆరువేలమంది బ్రాహ్మణులకు కరణీకం పట్టాలు వ్రాసి ముద్రిక వేశాడట. అలా ఆ ఉద్యోగంలో నియమింపబడిన వాళ్ళని ఆరువేల

నియోగులు అంటారు. అలా మేము ఆరువేల నియోగులమి అయ్యాము. ప్రగడ అంటే మంత్రి అని అర్థం. నియోగుల లోనే ప్రగడలుంటాయి. ఇది 16 ప్రగడలు. ఉదా: రెబ్బా ప్రగడ, తల్లాప్రగడ, పోల్లాప్రగడ, ధరణీప్రగడ, మంత్రి ప్రగడ మొదలైన ప్రగడ లున్నాయి. పూర్వులెవరో మాం త్రులు చేసి వుంటారు.

## నాన్నగారు - అనారోగ్యం

ఎడతెగని కృషి, కాంగ్రెస్ ఉద్యమంలో రెండుసార్లు జైలుకి వెళ్ళడం, మాడుగుల కొండజాతి వారికోసం అక్కడ కెళ్ళి తీవ్రంగా పనిచేయడం వీటన్నిటితో మానాన్నగారికి 1942లో తీవ్రంగా అనారోగ్యం వచ్చి తలతిరగడం, నరాల బలహీనతతో మానాన్నగారు మంచము ఎక్కారు. ప్రకృతి వైద్యము చేసేవారు. ప్రొద్దున్న, సాయంత్రము గోదావరి మన్ను పొత్తికడుపుమీద, గుడ్డని చుట్టబెట్టి వేసుకొనేవారు. మా ఆవుపి గుమ్మపాలు తీసుకునేవారు. బత్తాయిరసం తీసు కునే వారు. మధ్యాహ్నం వేళ కొబ్బరికోరు, అందులో టమోట కలిపి రుబ్బి ఇచ్చేవాళ్ళం. జీవితం అంతా అపక్వా హారంతో ఉన్నారు. ఆయన పనులు చేస్తుండేదాన్ని. వారాని కోసారి ఒళ్ళంతా ఆవునెయ్యి వ్రాసుకొని నాచేత మర్థనా చేయించుకొని తల రుద్దుకొనేవారు. అరుగుమీద నీరెండలో కూర్చొని ఆవునెయ్యి వ్రాయించుకొనేవారు. ఒకసారి ఆవు నెయ్యి వ్రాస్తుంటే "గాంధీగార్కి ఇలాగే రాజకుమారి అమృతకౌర్ వాళ్ళు చమురు మర్దనా చేస్తా" రన్నారు.

అప్పుడు లోనికి వస్తున్న అప్పారావుగారు ఆమాట విని హాస్యం చేశారు. అయితే మీరు గాంధీగారు, ఆవిడ రాజ కుమారి అమృతకౌర్ అన్నమాట అని. బ్లెడ్ ప్రెషర్ రాకుండా వుండాలని శీర్షాసనం వేసేవారు నాన్నగారు. ప్రాణాయామము చేసేవారు. మాచేతకూడ చిన్నప్పుడు ఆస నాలు, వేయించేవారు. ఆసనాలు, సూర్యనమస్కారాలు, ప్రాణాయామము ఇవి చాలా మంచివి. చిన్నప్పటినుంచి వాటిని అభ్యాసం చేయాలి. సౌమ్యవ్యాయామము ఎవరు చేసినా ఇబ్బంది లేదు. ఆధునిక వైద్యులుకూడ ఆసనాలు, బ్రీదింగ్ ఎక్సర్ సైజులు, సూర్యనమస్కారాలు ఇవన్నీ ఒంటికి చాలా మంచివని చెప్తున్నారు. అనేక జబ్బులు రాకుండా వీటివల్ల కాపాడుకోవచ్చు. వచ్చిన జబ్బుల్నికూడ తగ్గించుకోవచ్చు. మానాన్నగారు వాళ్ళఅమ్మ, నాన్నకి ఏ పన్నెండవ సంతా నమో అనుకుంటాను. తల్లిదండ్రులకి ముసలితనంలో పుట్టారు. అందుకని చాలా అర్భకంగా ఉండేవారు. చిన్నప్పుడు అస్త మానం జ్వరం వచ్చి కింద పెట్టడం, మీద పెట్టడంగా ఉండే దట. అలా బలహీనంగా ఉన్నా, ఆహారవిహారాల్లో నియమం అవలంబిస్తూ, ప్రకృతి చికిత్సచేస్తూ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకొనేవారు. ఆయన పోయేసరికి 60 ఏళ్ళు దాటాయి. శ్రీ అప్పారావుగారు అప్పుడిలా అన్నారు. ఆయన మంచి మానసికశక్తి వలన, ఆహారవిహారాల్లో జాగ్రత్తగా వుండడం వలన ఎన్నోసార్లు గుమ్మంలోకి వచ్చిన మృత్యువుని తరిమే శారు. ఒక సంస్థ చేయవలసిన పనిని ఒక మనిషి చేశారు. లేక పోతే ఆయన ఇంకా ఎక్కువ కాలము జీవించ వచ్చునన్నారు

"శర్మా! నీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకో. దేశానికి నువ్వు చాలా అవసరం." అని చాలామంది ఉత్తరాలు వ్రాసేవారు. ప్రతిరోజూ ఆయనకి చాలా ఉత్తరాలొచ్చేవి. ఆయన తను చేయవలసిన పనులన్నీ పూర్తి చేసుకొని ఇంక నాకు జీవితం మీద ఇచ్ఛ లేదు. ప్రాణం పోయినా ఫర్వా లేదు అనుకున్నాకే శరీరాన్ని విడిచారు. ఇంట్లోకూడ ఆయన కష్టాలు ఎరుగరు. మా అమ్మగార్కి మొదట మగపిల్లవాడు పుట్టి చనిపోయాడుట. మా నాన్నగారు అన్నారు. పిల్లాడిని నేను కంటితో అయినా చూడలేదు. ఆ కష్టం నాకంతగా తెలీదు. ఆ తర్వాత ఆయనకి పుట్టిన పిల్లలు అందరూ బావున్నారు. నేనే కష్టం ఎరుగనమ్మా! ఇది ఎంత అదృష్టం అనేవారు. నాక్కూడా ఒక విశ్వాసం ఉండేది. మా ఇంట్లో ఎవరికైనా జబ్బు చేస్తే నాన్నగారున్నంత కాలం ఏం ఫర్వా లేదు అని. ఆయనుండగా మృత్యువు దగ్గరికి రాదని మా నాన్నగారనేవారు. మా అమ్మ నాన్నలు అన్నదానం తెగ చేసేవారు. ఆ అన్నదాన ఫలితమే కాబోలు ఎన్ని జబ్బులు చేసినా బ్రతికి బట్ట కడుతున్నానని. మా నాన్నగారు గొప్ప తపస్వి. సంధ్యా వందనం చాలా నిష్టగాను, మడితో చేసేవారు. రోజూ లలితా సహస్ర నామాలు పొద్దునపూట పారాయణం చేసేవారు. భాగవతంలోని నారాయణ కవచం నిష్టగా చదువుకునేవారు. ఆయన లేవ లేనప్పుడు మాచేత చదివించే వారు. ఇది ఆపదలు లేకుండా కాపాడుతుందని వారి విశ్వాసం. ఆయన ఆస్తికులైనా మూఢ విశ్వాసాలు లేవు. హేతువాదంతో ఆలోచించేవారు విషయాల్ని.

## పితామహుల గురించి

మా తాతగారు కీ॥ శే॥ రెబ్బాప్రగడ రామయ్య గారు రాజమండ్రిలో కంచుమర్తి వారి దగ్గర ఎస్టేట్‌లో మేనేజర్‌గా ఉండేవారు. ఆయన చాలా నమ్మకస్తుడు. వాళ్ళన్నారుట. "మాకు పిల్లలు లేరు. రామయ్యా! తదనంతరం ఎస్టేటు అంతా నువ్వు తీసుకో" అని. అప్పుడు ఆయన అన్నారుట. "అబ్బె నేనలా చేయను. మీకు దత్తత చేస్తాను వంశం నిలుస్తుం" దని దత్తత చేయించారుట. తాతగారు రామయ్యగారు బామ్మ సీతమ్మగారు దానధర్మాలు ఎక్కువగా చేసేవారు. లేని వాళ్ళకి ఒడుగులు చేయించి, పెళ్ళిళ్ళు చేయించి చదువులు చెప్పించేవారు. పేదవాళ్ళని ఇంట్లో ఉంచి అన్నాలు పెట్టి చదువులు చెప్పించేవారు. రాజమండ్రిలో ఇసుక వీధిలో మా మేడ ఉండేది. అక్కడ ఉండేవారు. ఇలా మా బామ్మగారి దగ్గర ఉన్న విద్యార్థులలో చాలామంది బాగా చదువుకొని పెద్ద పెద్ద పదవులలోకి వచ్చారు. డాక్టర్లు, తాసిల్దార్లు అయ్యారు. వారంతా మా కుటుంబం అంటే చివరిదాక ఎంతో భక్తి, విశ్వాసాలతో వుండేవారు. మా బామ్మగారిక్కి చాలామంది పిల్లలు చనిపోవుటచే రాజమండ్రిలో ఆ మేడలో ఉండడం ఇష్టం లేక కొవ్వూరు మకాం మార్చేశారు. కీ॥ శే॥ వీరేశలింగంగారి భార్య రాజ్యలక్షమ్మ గారిక్కి, మా బామ్మగారిక్కి స్నేహం. ఆవిడ గుర్రం బండిమీద బామ్మగార్ని చూడడానికి వస్తుండేవారుట. మా నాన్నగారు బ్రిటీష్ వాళ్ళకి వ్యతిరేకంగా ఉపన్యాసాలిచ్చి వ్యాసాలువ్రాసి కాంగ్రెస్ ఉద్యమంలో

పని చేస్తూవుంటే, కొవ్వూరులో మా యింట్లో వుండి అన్నం తిని చదువుకుని పైకివచ్చిన తాసిల్దారు గారు వుండేవారుట. ఆయన నాన్నగారితో ఇలా అనేవారు "ఉపన్యాసాలిచ్చినా మరీ అంత ఘాటుగా ఇవ్వకురా! నువ్వింత ప్రభుత్వానికి వ్యతిరేకంగా మాట్లాడితే నిన్ను అరెస్టు చేయవలసి వస్తుంది. ఏదో అటు, ఇటు కాకుండా ఇస్తూవుండు. రామయ్య బావకి, సీతమ్మ అక్కకి మిగిలిన ఒకే కొడుకువి. నిన్ను అరెస్టు చేసి జైలుకి ఎలా పంపగలను" అని బాధ పడేవారుట. అప్పుడు మా నాన్న ఇలా అనేవారుట. "మామయ్యా! నువ్వేమీ బాధపడకు. నాపని నేనుచేస్తున్నాను. నీపని నువ్వు నేరవేర్చు. ఇందులో బంధుత్వాలకి, ప్రేమకి తావుండకూడదు." పైవిష యాలన్నీ ఎందుకు వ్రాస్తున్నానంటే మనకంటె ఒకతరం వెనకవున్న మన పూర్వులలో దానధర్మాలు ఎక్కువగా ఉండేవి. ఒక సంపన్నులున్నారంటే వాళ్ళ నాశ్రయించు కొని చుట్టాలు, స్నేహితులు ఇంకెంతమందో బ్రతికేవారు. అప్పుడిన్ని హోటళ్ళుండేవి కావుట. అన్నవిక్రయం పాపం అని పూర్వుల మతం. మనకున్నదాంట్లో ఇంత పెట్టాలి గానీ అన్నాన్ని విక్రయించకూడదని భారతీయ సిద్ధాంతం. ఇప్పు డెంత ఉన్నవాళ్ళయినా ఒకళ్ళకి పెట్టడం అంటే గిట్టదు. దగ్గర బంధువులు స్వంత తల్లివైపు తండ్రివైపు వాళ్ళొ స్తేనే గిట్టదు. బాగాఉన్న వాళ్ళుకూడ ఎవరైనా వీధిలోకి యాచనకి వస్తే పొమ్మంటారు గానీ, గుప్పెడు బియ్యం వెయ్యడం లేదు. ఎంత డబ్బునా్న ఇంకా డబ్బుని బాగా పెంచి, బ్యాంకుల్లో వేసి వ్యాపారాల్లో తాము ఎంత సుఖ పడదామా అని చూస్తున్నారు.

పూర్వం రోజుల్లా చవక రోజులు కావు. అలా దాన ధర్మాలు చేయలేమని ఎవరైనా అనవచ్చు. కానీ ఇది నూటికి నూరుపాళ్ళు నిజం కాదు. మనుషుల్లో వితరణ తగ్గింది. స్వార్థం పెరిగింది. పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్లనేమో! సమిష్టిగా ఆలోచించడం లేదు. ఆఖరికి కన్నతల్లి, తండ్రికూడ పిల్లలికి బరువైపోతున్నారు. ఇంక విదేశాల్లోలాగా కొన్నాళ్ళకి వృద్ధులకు శరణాలయాలు ఏర్పరచే అవస్థ వస్తుందేమో!

## స్వాతంత్ర్య సమర యోధులు మా మేనత్త భర్త శ్రీ వేమూరి కృష్ణారావు గారి గురించి, మా నాన్నగారి కృషి గురించి -

మా మేనత్తశ్రీ వేమూరి అమ్మాయమ్మగారి భర్త కీ॥ శే॥ వేమూరి రామకృష్ణారావుగారు కూడ దేశం కోసం సర్వస్వం త్యాగం చేసిన వ్యక్తి. కాంగ్రెస్‌లో జైలుకెళ్ళారు. గాంధీ సిద్ధాంతం ప్రకారం జీవితాంతం నడుచుకొన్నారు. ఆయన గనుక బ్రిటీష్ ప్రభుత్వంలో ఉద్యోగంలో చేరితే కలెక్టర్ అయి ఉండేవారు. కాంగ్రెసు ఉద్యమంలో జైలుకెళ్ళాక బ్రిటీష్ ప్రభుత్వం వాళ్ళు మళ్ళీ ఉద్యోగం ఇవ్వరు. ఏలూరు జాతీయ కళాశాలలో చాలాకాలం హెడ్ మాష్టరుగా ఉండేవారు. ఉత్తమ అధ్యాపకుడి ననిపించుకున్నారు, ఆయన రాజమండ్రి ఆర్ట్సు కాలేజిలో చదువుతున్నప్పుడు కూల్‌డ్రే దొర అధ్యాపకులుగా ఉండేవారట. మానాన్నగారు అనే వారు. "రామకృష్ణారావు ఎంత బలవంతుడమ్మా! ఫుట్ బాల్ ఆటలో బంతిని తంతే ఆకాశమంత ఎత్తుకు ఎగిరేదట." 1942 లో అనుకుంటాను. కొవ్వూరులో మా మామయ్య

గారింట్లో (మేనత్తభర్త) పోలీసులు రైడ్‌లో భగవత్ సింగ్ ఫోటో తీసేశారు. గోర్కీ వ్రాసిన అమ్మ పుస్తకాన్ని తీసే శారు. నా చిన్నప్పుడే ఆ పుస్తకాన్ని చదివాను. మానాన్న గారు, రామకృష్ణారావుగారు, వీళ్ళంతా కలసి కొవ్వూరులో రాజకీయ పాఠశాల నడుపుతుండేవారు. మాజీమంత్రి శ్రీ గాతు లచ్చన్నగారు మానాన్నగార్ని తనకి రాజకీయ గురువనేవారు. కీ॥ శే॥ సుప్రసిద్ధ రచయిత అడవి బాపిరాజు గారు, నాన్నగారు, రామకృష్ణారావుగారు మంచి స్నేహితులు. శ్రీమతి సుభద్ర, (బాపిరాజుగారి భార్య), మా మేనత్త స్నేహితులు. శ్రీమతి సుభద్రగారు బాపిరాజుగారు స్వాతంత్ర సమరంలో జైలుకి వెళ్ళినపుడు మా మేనత్తకి ఉత్తరాలు వ్రాశారు. తనకి చాలా బెంగగా వుందని, ఏమీ తోచడం లేదని ఆ ఉత్తరం నిండా ఉండేది. మా యింట్లో చాలా రోజులు పాత ఉత్తరాలన్నీ ఒక ఇనపతీగకి గుచ్చి వుండేవి. అందులో ఒక కార్డు నేను కొంచెం ఎదిగాక చదివాను.

## నేను పుట్టినప్పుడు వ్రాసిన ఉత్తరం

అది నేను పుట్టినప్పుడు మా మేనమామ మా తాత గారు రామయ్యగార్కి ఉత్తరం వ్రాసిన దానికి జవాబు. "నాకు పౌత్రురాలు, మీకు దౌహిత్రురాలు పుట్టినందుకు, మాకు కన్యాదానఫలం దక్కి మా వంశం తరిస్తున్నందుకు సంతోషిస్తున్నాను" అని వ్రాశారు. (పాపం ఆడపిల్ల పుట్టిందని విచారించలేదు.) మా యింట్లో నేను రెండో అమ్మాయిని. ఇప్పుడు నేను తాతయ్య ఉంటే అడిగేదాన్ని. "ఏం తాతయ్యా! కన్యాదానం అన్నావు? ఆడపిల్ల నోరులేని జడ

పదార్థమా? లేక చతుష్పాదా? దానం చేయడానికి" అని. నేను ఆ మధ్య విశాలాంధ్రలో కన్యాదానంలో బానిసత్వం అని ఒక వ్యాసం వ్రాశాను. ఆ వ్యాసాన్ని విశాలాంధ్ర సంపాదకులు మెచ్చుకున్నారు. నేను ధర్మార్థ కామ మోక్ష సంబంధమైన పుస్తకాల్ని చాలా చదివాను. లైబ్రరీ కెళ్ళి పుస్తకం తెచ్చుకుందాం అంటే నేను చదవనివి తక్కువగా ఉంటాయి. మార్క్సిజాన్ని, గాంధీ సిద్ధాంతాన్ని, సర్వోదయ సిద్ధాంతాన్ని అధ్యయనం చేశాను.

## కొవ్వూరు మహిళా సమాజం

మా మేనత్త అమ్మాయమ్మగారు కూడ కొవ్వూరు లోని స్త్రీ సమాజానికి చాలా రోజులు కార్యదర్శిగా పని చేశారు. నా చిన్నప్పుడు ఆమె అందరిళ్ళకి వెళ్ళి సమాజానికి చందాలు వసూలు చేసేవారు. నేను కూడ వెళ్ళేదాన్ని. కొవ్వూరులో శ్రీ చదలవాడ గోపీనాధన్ గారనే ప్లీడర్ వుండేవారు. వారి పెద్దమ్మాయి తాయారమ్మగారు కొవ్వూరులో స్త్రీ సమాజాన్ని స్థాపించారు. సంస్కృతం, హిందీ, తెలుగు, కుట్టుపని, సంగీతం ఆడపిల్లలకి నేర్పేవారు. యానివర్సరీ అప్పుడు శ్రీ కృష్ణతులాభారం నాటకం వెయ్యి స్తుండేవారు తాయారమ్మగారి చెల్లెళ్ళు చెన్నగంటమ్మగారు, సుగంధమ్మగారు సంగీతము నేర్పుతుండేవారు. వేదవల్లి తాయారమ్మగారు ఉభయ భాషాప్రవీణ, రచయిత్రికూడ. శ్రీమతి వీరవెంకట సుబ్బమ్మగారు అనే మరో అధ్యాపకురా లుండేవారు. ఆమె ఉభయ భాషాప్రవీణ. తాయారమ్మగారు, వీరవెంకట సుబ్బమ్మగారు రాజమండ్రిలో సదనంలో చదువు

ఉన్నారు. బత్తుల కామక్షమ్మ గారు దీన్ని స్థాపించారు. ఇందులో చాలామంది ఉభయభాషాప్రవీణ చదువుకొని పైకి వచ్చారు. అప్పట్లో స్త్రీలు సంస్కృతము చదువుకొనే సంస్థ ఇదొక్కటేనేమో! నా చిన్నప్పుడు చెన్నగంటమ్మగారి దగ్గర సంగీతము నేర్చుకొన్నాను. వీరవెంకట సుబ్బమ్మగారి దగ్గర కాళిదాసుని కుమార సంభవం చదివాను. వీరికి జీతాలు తక్కువైనా ఉన్నా లేకపోయినా అప్పటినుంచీ ఇప్పటికీ కూడ సమాజంలోనే పని చేస్తున్నారు.

## కొవ్వూరులో ప్రముఖ వ్యక్తులు

కొవ్వూరులో శనివారపు సుబ్బారావుగారు, బొడ్డు పల్లి నరసింహంగారు కూడా కాంగ్రెస్‌లో పని చేసిన సుప్రసిద్ధులు. కొవ్వూరులో తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు సంస్కృత పాఠశాల స్థాపించిన వ్యక్తి. విద్యార్థులకి ఉచితముగా భోజనం పెట్టేవారు. మా నాన్నగారిలాగే ఆస్థిని పిల్లల కివ్వక అంతా ప్రజోపయోగ కార్యాలకే దానం చేసినవ్యక్తి, హేతువాద రచయితలు కీ॥ శే॥ వల్లూరి సూర్యనారాయణరావుగారు. ఆయన ఉంటున్న చాలా పెద్ద యింటిని కూడ దానం చేశారు. మా నాన్నగారు కూడ మా పెద్ద యింటిని అలాగే దానం చేశారు. మా యింట్లో మధ్యహాలు 4 స్తంభాలతో పెద్దదిగా అందంగా ఉండేది అని చెప్పాను గదా! శ్రీ ఆచంట జానకిరామంగారు ఒకసారిలా అన్నారు. ఈ అందమైన హాల్లో కవితాగానం చేయాలని వుందని. కీ॥ శే॥ వల్లూరి సూర్యనారాయణరావుగారు పోయాక

పదార్థమా? లేక చతుష్పాదా? దానం చేయడానికి” అని. నేను ఆ మధ్య విశాలాంధ్రలో కన్యాదానంలో బానిసత్వం అని ఒక వ్యాసం వ్రాశాను. ఆ వ్యాసాన్ని విశాలాంధ్ర సంపాదకులు మెచ్చుకున్నారు. నేను ధర్మార్థ కామ మోక్ష సంబంధమైన పుస్తకాల్ని చాలా చదివాను. లైబ్రరీ కెళ్ళి పుస్తకం తెచ్చుకుందాం అంటే నేను చదవనివి తక్కువగా ఉంటాయి. మార్క్సిజాన్ని, గాంధీ సిద్ధాంతాన్ని, సర్వోదయ సిద్ధాంతాన్ని అధ్యయనం చేశాను.

## కొవ్వూరు మహిళా సమాజం

మా మేనత్త అమ్మాయమ్మగారు కూడ కొవ్వూరు లోని స్త్రీ సమాజానికి చాలా రోజులు కార్యదర్శిగా పని చేశారు. నా చిన్నప్పుడు ఆమె అందరిళ్ళకి వెళ్ళి సమాజానికి చందాలు వసూలు చేసేవారు. నేను కూడ వెళ్ళేదాన్ని. కొవ్వూరులో శ్రీ చదలవాడ గోపీనాథన్ గారనే ప్లీడర్ వుండేవారు. వారి పెద్దమ్మాయి తాయారమ్మగారు కొవ్వూరులో స్త్రీ సమాజాన్ని స్థాపించారు. సంస్కృతం, హిందీ, తెలుగు, కుట్టుపని, సంగీతం ఆడపిల్లలకి నేర్పేవారు. యానివర్సరీ అప్పుడు శ్రీ కృష్ణతులాభారం నాటకం వెయ్యి స్తుండేవారు తాయారమ్మగారి చెల్లెళ్ళు చెన్నగంటమ్మగారు, సుగంధమ్మగారు సంగీతము నేర్పుతుండేవారు. వేదవల్లి తాయారమ్మగారు ఉభయ భాషాప్రవీణ, రచయిత్రికూడ. శ్రీమతి వీరవెంకట సుబ్బమ్మగారు అనే మరో అధ్యాపకురా లుండేవారు. ఆమె ఉభయ భాషాప్రవీణ. తాయారమ్మగారు, వీరవెంకట సుబ్బమ్మగారు రాజమండ్రిలో సదనంలో చదువు

కున్నారు. బత్తుల కామక్షమ్మ గారు దీన్ని స్థాపించారు. ఇందులో చాలామంది ఉభయభాషాప్రవీణ చదువుకొని పైకి వచ్చారు. అప్పట్లో స్త్రీలు సంస్కృతము చదువుకొనే సంస్థ ఇదొక్కటేనేమో! నా చిన్నప్పుడు చెన్నగంటమ్మగారి దగ్గర సంగీతము నేర్చుకొన్నాను. వీరవెంకట సుబ్బమ్మగారి దగ్గర కాళిదాసుని కుమార సంభవం చదివాను. వీరికి జీతాలు తక్కువైనా ఉన్నా లేకపోయినా అప్పటినుంచీ ఇప్పటికీ కూడ సమాజంలోనే పని చేస్తున్నారు.

## కొవ్వూరులో ప్రముఖ వ్యక్తులు

కొవ్వూరులో శనివారపు సుబ్బారావుగారు, బొడ్డు పల్లి నరసింహంగారు కూడా కాంగ్రెస్‌లో పని చేసిన సుప్రసిద్ధులు. కొవ్వూరులో తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు సంస్కృత పాఠశాల స్థాపించిన వ్యక్తి. విద్యార్థులకి ఉచితముగా భోజనం పెట్టేవారు. మా నాన్నగారిలాగే ఆస్తిని పిల్లల కివ్వక అంతా ప్రజోపయోగ కార్యాలకే దానం చేసినవ్యక్తి, హేతువాద రచయితలు కీ॥ శే॥ వల్లూరి సూర్యనారాయణరావుగారు. ఆయన ఉంటున్న చాలా పెద్ద యింటిని కూడ దానం చేశారు. మా నాన్నగారు కూడ మా పెద్ద యింటిని అలాగే దానం చేశారు. మా యింట్లో మధ్యహాలు 4 స్తంభాలతో పెద్దదిగా అందంగా ఉండేది అని చెప్పాను గదా! శ్రీ ఆచంట జానకిరామంగారు ఒకసారిలా అన్నారు. ఈ అందమైన హాల్లో కవితాగానం చేయాలని వుందని. కీ॥ శే॥ వల్లూరి సూర్యనారాయణరావుగారు పోయాక

ఆ యింటిలో ఆయన భార్య పార్వతమ్మగారు ఉండేవారు. ఆవిడ కొడుకులు దూరప్రదేశంలో ఉండడం నుంచి మా నాన్నగారు వెళ్ళి ఆవిడ మంచి చెడ్డలు చూస్తుండేవారు. నాన్నగారిని ఆవిడ అబ్బాయి అని పిలచేది. వాళ్ళ రెండవ అమ్మాయి పాపాయమ్మగారిని కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి బావమరిది కిచ్చి వివాహం చేశారు.

## మద్రాసు ప్రయాణము - మా దొడ్డమ్మ నిడమర్తి నరసమ్మగారు

నా చిన్నప్పుడు ఒకసారి మాఅమ్మగారితో మా పెద్ద తల్లి యింటికి మద్రాసు వెళ్ళాను. అప్పుడు పాపాయమ్మ గార్ని చూడడం కోసం మాఅమ్మగారితో నాగేశ్వరరావు గారి యింటికి వెళ్ళాను. అప్పుడు వాళ్ళింట్లో ఎయిర్ కండిషన్ గది ఉండేది. అప్పట్లో వాళ్ళ యింట్లో ఆ గదినిగూర్చి అందరూ గొప్పగా చెప్పుకొనేవారు. ఎయిర్ కండిషన్ గదులు అప్పట్లో ఎవరికోగాని వుండేవి కావు. మా పెద్ద తల్లిగారు శ్రీమతి నిడమర్తి నరసమ్మగారి యిల్లు మద్రాసులో మైలాపూర్ లో వుండేది. ఆమెభర్త నిడమర్తి నరసింహం గారు సబ్ జడ్జి చేశారు. ఆయన బాగా ఆరోగ్యవంతుడు. పచ్చగా అందంగా ఉండేవారు. చచ్చిపోయేదాకా డాక్టర్ని చూసి ఎరుగరు. మానాన్నగారితో గాంధీజీ నాన్ వయొలెన్స సిద్ధాంతం బాగోలేదని వాదిస్తూ వుండేవారు. ఇప్పుడు సినిమాలు తీస్తున్న నిడమర్తివారు ఈయన తమ్ముళ్ళు, ఆయన పిల్లలే! రాజమండ్రిలో వీరేశలింగంగారి కాలంలో నిడమర్తి దుర్గయ్యగారని పెద్ద ప్లీడర ఉండేవారు. ఆ ఊళ్ళోని పెద్ద

తిలకోయల్లో ఆయనొకరు. ఆయన కొడుకే మా బాబయ్య గారు శ్రీ నరసింహంగారు. మా తాతగారు రాజన్నగారికీ, దుర్గయ్యగారికీ స్నేహమట. మా తాతగారు, "దుర్గయ్యా! నా పెద్దకూతుర్ని నీ కొడుక్కిస్తాను. నేను పిల్లలు గలవాడిని. కట్నం అట్టే ఇచ్చుకోలేను. 500రు॥ ఇస్తానన్నారుట. అప్పుడు దుర్గయ్యగారన్నారట. "రాజన్నా! నువ్వు పిల్లలు గలవాడివి. అదీ ఇవ్వద్దు. పిల్లను చేసుకొంటా" మన్నారట. అప్పట్లో స్నేహాలకు అంత ప్రాముఖ్యం ఉండేది. ఇప్పుడలా ఎవరైనా చేసుకొంటారా? అసలు అప్పుడు ఎవరైనా పెద్దమనుషులు పిల్లనిస్తామని యింటికి వస్తే తిరగగొట్ట కూడదట. అప్పుడు వంశాన్ని, సంప్రదాయాన్ని చూసి పెళ్ళిళ్ళు చేసుకొనే వారు. అందచందాలకి, డబ్బుకి ప్రాముఖ్యం తక్కువ. మా తాతగారు రాజన్నగారు మా బాబయ్యగారికీ ఒక పరీక్ష పెట్టారట. ఒక లెక్క యిచ్చి చెయ్యమన్నారట. ఆయన చేశారట. మా దొడ్డమ్మకి 7, మా బాబయ్యకి 9 సంవత్సరా లుంటాయట పెళ్ళి అప్పుడు. పెళ్ళి అయ్యాక ఆయన దగ్గరే చదువు ఆవిడ నేర్చుకున్నదిట. వాళ్ళది చాలా అనుకూల దాంపత్యము. "ఆయన స్వాధీన వల్లభుడు మీ దొడ్డమ్మకి" అనేవారు నాన్నగారు.

మా దొడ్డమ్మగారు చాలా మంచి వ్యవహర్త. బంధువులకి ఏ సహాయం కావలసి వచ్చినా అండ కింద వుండేవారు. పెద్ద పెద్ద ఉద్యోగస్థులతో, గొప్ప వాళ్ళతో, వాళ్ళ భార్యలతో ఆమెకి స్నేహం ఉండేది. బంధువులలో లేనివాళ్ళకి ఆమె వాళ్ళతో చెప్పి ఉద్యోగాలు ఇప్పిస్తుండే వారు. తక్కువ స్థితిలో వున్న బంధువులకి ధన సహాయం చేసేవారు.

ఆవిడ అనేవారు. ముందర నా బంధువులలో లేని వాళ్ళకి చూసిన తర్వాత మిగిలిన వాళ్ళకి దాన ధర్మాలు చేస్తానని. మద్రాసులో ఆంధ్ర మహిళా సభకి విరాళాలు ఇచ్చేవారు. ఆవిడకి ఆడపిల్లలు లేరు. మా అమ్మగార్ని కూతురు క్రింద చూసుకునే వారు. ఆవిడ బ్రతికి వున్నంత కాలం మా అమ్మ గార్కి ఏడాదికి సరిపడా బట్టలవీ కొని ఇచ్చేవారు. మద్రాసులో కామరాజు నాడార్ పథకం కింద ఖద్దరు నూలు చిలప లిచ్చి మా అమ్మగార్కి ఖద్దరు బట్టలు కొనేవారు. మా నాన్నగారు మమ్మల్ని ఖద్దరు తప్ప కట్టుకోనిచ్చేవారు కాదు. అప్పుడు మాకు పట్టు పరికిణీలు మన దేశంలో తయారైనవి చేత్తో నే నేసినవి అని చెప్పి కొనేవారు మా దొడ్డమ్మగారు. మా యింట్లో అద్దాల బీరువాలో బొమ్మలన్నీ మా దొడ్డమ్మ కొన్నవే. బొమ్మలుగానీ, కంచు సామానులు గానీ, దుప్పట్లు గానీ ఆవిడ రెండు కొనుక్కుంటే మా అమ్మకి ఒకటి కొనే వారు. మా నాన్నగారు ఇట్లో విలాస వస్తువులకి ఖర్చు పెట్టేవారు కాదు. చిన్నప్పుడు మా దొడ్డమ్మ వస్తే సర దాగా ఉండేది. ఆవిడ చాలా ఆసక్తిగా కబుర్లు చెప్పేవారు. కొందరు కబుర్లు చెబుతుంటే ఎంతసేపయినా ఆసక్తిగా విన బుద్ధి వేస్తుంది. వాళ్ళ కుటుంబంలో పెళ్ళిళ్ళ గురించి, ఇంకా పెద్దల గురించి, ఊళ్ళోవి ఇంకా అనేక విషయాల గురించి చెబుతుండే వారు. అన్నీ వింటూ కూర్చునే దాన్ని. ఆవిడ రోజూ సాయంత్రం అయ్యేసరికి జడ వేసుకుని, మొహం రుద్దుకొని బొట్టు పెట్టుకొని పట్టుచీర కట్టుకొని తయారయ్యే వారు. మేము ఎవరైనా తయారు కాకపోతే "ఏమిటర్రా పెద్దదాన్ని నేనే ఇలా ఉన్నాను. జడ్డితనం" అని కేకలేసే

వారు. సాయంత్రం ఊళ్ళోకి ఏ మునసబుగారింటికో ఇంకా ఊళ్ళోవి పెద్ద వారింటికో తీసుకుని వెళ్ళేవారు. ఆవిడ కూడా వెళ్ళడం సరదాగా వుండేది. ఎప్పుడూ ఉత్సాహంగా వుండే వ్యక్తి. ఇలాంటి వాళ్ళింటికి వస్తే ఇంట్లో ఉన్నంతసేపు ఏదో వెలుగు, కాంతిగా ఉంటుంది. అప్పట్లో గోడ గడియారం 10 రూపాయలు ఉండేది. కొవ్వూరులో మహిళా సమాజానికి మా దొడ్డమ్మగారు ఒక పెద్ద బిగ్ బెన్ గడియారము, పెద్ద జంబుకానా కొనిచ్చారు. తొలిచూలు అని నేను వ్రాసిన కథలో నేను పడిన ప్రసవవేదన, నొప్పులు, పిల్లని కన్నాక కలిగే అనుభూతిని వర్ణించాను. అందులో పురిటి నెప్పులు పడుతున్న స్త్రీని పురిటి గదిలోకి పెద్ద తల్లి చెయ్యి పట్టుకుని తీసుకొస్తుంది. ఇది నా జీవితంలో జరిగిందే. నేను మా పెద్దమ్మాయి రుక్మిణిని ప్రసవవేదవ పడుతున్నప్పుడు ఇంట్లో పురిటి గదిలో నులక మంచం వేశారు. పెద్దముత్తయిదువు ఎవరైనా ప్రసవ వేదన పడుతున్న స్త్రీని మంచంమీద పడుకోబెట్టాలిట. అప్పుడు మా అమ్మగారు మా దొడ్డమ్మని "పెద్దదానివి పిల్ల చేయి పట్టుకొని తీసుకెళ్ళు పురిటి గదిలోకి" అని పంపించారు.

ఇక్కడ కాకినాడలో సాహిత్య లహరి సభ్యులు ఏడుగురు కలిసి ఇంద్ర ధనుస్సు అనే కథా సంకలనం వేశాము. అందులో నా కథ ఏది తీసుకోవాలన్నప్పుడు సుప్రసిద్ధ రచయితలు శ్రీరామకృష్ణ భరద్వాజ గారు 'తొలిచూలు' కథ బాగుందని తీసుకున్నారు. నేను అన్నాను. "ఆడవాళ్ళు, పురిటి నొప్పులు, బాలింత, చూలింత ఈ కథ కాక ఇంకోటి తీసుకో కూడదా?" అని. అప్పుడు ఆయన అన్నారు. "కడుపు,

ప్రసవ వేదన, బాలింత పీటి గురించి ఉంటేనేమమ్మా! ఇదే బావుంది, పాప పురిటి పాట వ్రాయులేదా?" (పాలగుమ్మి పద్మరాజు) అని ఇదే తీసుకున్నారు. మా దొడ్డమ్మగారు ఉన్నప్పుడు నా కథా సంపుటిలు ప్రచురించ లేదు. ఇంద్ర ధనుస్సులోని తొలిచూలు అన్న కథ చదివి చాలా మెచ్చు కుని ఆ పుస్తకాన్ని తన దగ్గర ఉంచుకొన్నారు. ఈమె మను మడిని ప్రసిద్ధ రచయిత డా॥ కొమ్మూరి వేణుగోపాలరావు చెల్లెలి కిచ్చి పెళ్ళి చేశారు.

## నాన్నగారూ - కొందరు ప్రముఖులు

మా ఇంట్లో చాలా రోజులు వీధి గుమ్మం ముందు "ఆంధ్ర రాష్ట్ర జమీను రైతు సంఘం" అని రాసిన ఆకు పచ్చ అక్షరాలు గల బోర్డు ఉండేది. దానికి శ్రీ టంగుటూరి ప్రకాశంగారు అధ్యక్షులు. నాన్నగారు కార్యదర్శి. మా నాన్నగారు ఎ. ఐ. సి. సి. మెంబరుగా ఉన్నారు కొన్నాళ్ళు. శ్రీ పట్టాభి సీతారామయ్యగారు ఒకసారి పని వుండి కొవ్వూరులో మా యింటికి వచ్చారుట. కొబ్బరి మట్ట క్రింద పడి వుండడం చూచి "వీటినెందుకు ఇలా వృథాగా పడే శావు? చాపలు అల్లించ కూడదా?" అన్నారుట. ఆయనది వ్యాపార దృష్టి. "శర్మా! నువ్వు అఖండుడివోయ్! కొండకి, తల వెంట్రుకకి ముడి పెడతావు. వస్తే కొండ వస్తుంది. పోతే తల వెంట్రుక పోతుంది" అన్నారుట. ఈ మధ్య సుప్రసిద్ధ రచయితలు శ్రీ ఉప్పల లక్ష్మణరావుగారు నాకిలా వ్రాశారు: "ఆ నాటి రాష్ట్ర కమిటీ కాంగ్రెస్ సమావేశాలలో మీ

నాన్నగారిని చూస్తూ ఉండే వాడిని. నిస్స్వార్థపరులైన త్యాగ మూర్తులు. మీ నాన్నగార్ని, శ్రీ పుసులూరి కోదండ రామయ్యగార్ని ఇటువంటి గొప్ప వ్యక్తుల్ని జాతి మరచి పోవడం దురదృష్టము. నాన్నగారు తన శక్తినంతా దేశ సేవ కోసం, రాజకీయ కార్యకలాపములకు వినియోగించక పోతే గొప్ప కవిగానో, కథా నవలారచయితగానో అయ్యుండేవారు. బొమ్మలు కూడా గీసే వారాయన. ఆయన గీసిన చిత్రము ఇప్పటికీ మా యింట్లో వున్నది. ఈనాటి ప్రసిద్ధ సుప్రసిద్ధ సాహిత్య వేత్తలందరికీ ఆయన అంటే గౌరవ పరిచయము. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, తల్లావఝ్ఝుల శివశంకరస్వామి, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు, శ్రీ పురిపండా అప్పల స్వామిగారు యింకా అనేకమంది పెద్దలకు ఆయనంటే గౌర వము, పరిచయం ఉంది. అలాంటి పెద్ద లెవ్వరైనా సభలో నన్ను పరిచయము చేస్తున్నప్పుడు ముందు నా గురించి చెప్ప కుండ ఈమె శ్రీ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారి అమ్మాయి అంటారు. అలా అంటేనే నాకిష్టం కూడా. ఇటీవలే స్వర్గస్థు లైన కీ॥ శే॥ కె. వి. యన్. అప్పారావుగారు నా వ్యాస పద్మం చదివి యిలా అన్నారు. అందులోని రచన లన్నీ చాలా బాగున్నాయని, ముఖ్యంగా శారదాదేవి గూర్చిన వ్యాసము తనకెంతో నచ్చిందని, మీ నాన్నగారి కీర్తిని నిలుపుతున్నందుకు నిన్ను హృదయపూర్వకంగా అభినందిస్తు న్నానని వ్రాశారు. అదే ఆయన నాకు వ్రాసిన ఆఖరి ఉత్త రము. తర్వాత కొద్ది రోజులకే మరణించారు. అప్పారావు గారు చనిపోయినపుడు బాష్పాంజలి అనే వ్యాసం ఆంధ్ర పత్రిక డైలీకి పంపాను. అది అచ్చయింది. కొప్పర్తివారిలో

నేను పేర్కొన్న గొప్ప వ్యక్తుల్ని, యింకా నాకు తెలియని గొప్ప వ్యక్తుల్ని కూడా నాల్గు రోడ్ల కూడలిలో విగ్రహాలు ప్రతిష్ఠింపబడాలి. వీధులకి, పాఠశాలలకి వారి పేర్లు పెట్టబడాలి. వారి వర్ధంతులు జరపాలి. ఏ గ్రామంలో అయినా పట్టణంలో అయినా సరే యిలాగే గొప్పవ్యక్తుల్ని సంస్మరించుకోవాలి. ఆనాడే వారి ఋణం కొంత వరకైనా తీర్చుకోగల్గుతాము. నాన్నగారు పూర్వం భారతిలో శకుంతలని గూర్చి వ్రాసిన వ్యాసం ఆ మధ్య నాట్యకళలో మళ్ళీపడింది. అలాగే మన కన్నా ముందు తరాలలో గొప్పవారైన వారి రచనల్ని ప్రతి పేపరు అప్పుడప్పుడు ముద్రిస్తూ వుండాలి. శ్రీ గోరా గారు కూడా అప్పుడప్పుడు మా యింటికి వచ్చి నాన్న గారితో చర్చలు జరుపుతూ వుండేవారు. వారి సంఘం పేపరు నేను చదువుతూ ఉండేదాన్ని. చాలారోజులు మా యింటికి వస్తూండేది ఆ పేపరు.

## మా కుటుంబం గురించి

మా అక్కయ్య దుర్గాంబగారు ఉభయ భాషాప్రవీణ చదువుకున్నారు. ఈమెకి పెళ్ళి సంబంధాలు చూసేటప్పుడు మొదట్లో మా నాన్నగారు కట్నం ఇవ్వనని భూమి పిల్లకి యిస్తానన్నారు. కొంతమంది కట్నం ఇవ్వకపోతే చేసుకోమన్నారు. మాయింట్లో కొంతమంది కుర్చీలు, సోఫాలు వెయ్యలేదు. తివాసీలే వేశామని ఆక్షేపించారు. ఈమెని డా॥ అర్జరపు రమణారావు, యమ్. ఏ, పి హెచ్. డి. కిచ్చి వివాహం చేశారు. ఈవిడ చిన్నపిల్లగా ఉన్నప్పుడు కాకినాడ

కాంగ్రెసుకు మా నాన్నగారు మా అమ్మని, మా మేనత్తని తీసికెళ్ళారు. కస్తూరిబాయ్ అందంగా ఉన్న ఈవిడను చూసి 'అచ్ఛా లడకీ' అని ముద్దాడారు. మా అమ్మగారు కూడా చాలారోజులు ప్రకృతి చికిత్సలో ఉండేవారు. కడుపు తున్నప్పుడు పురుడు వచ్చాక పండ్లు తిని ప్రకృతి చికిత్సలో ఉండేవారు. మా నాన్నగారు నాతో ఇలా అన్నారు. మా అమ్మమ్మ అందిట- మా అక్కయ్య పుట్టేసరికి గది అంతా తేజస్సుతో నిండిపోయిందని.

మా యింట్లో అందరు అందమైనవాళ్ళే. అందరు మంచి ఛాయతో ఉండడంచూసి ఊళ్ళోవాళ్ళు అనేవారుట- రెబ్బాప్రగడ వారింట్లో ఆవులు, గేదెలు కూడా ఎరుపేనని.

భగవత్ సింగ్‌ని ఉరితీసే రోజున మా నాన్నగారు చిన్న పిల్ల అయిన మా అక్కయ్యతో రైలు ప్రయాణం చేస్తున్నారు.మా అక్కయ్య రైలులో 'నాన్నా భగవత్సింగ్' అని ఏడుపుట. పసి మనస్సును కూడా కదిలించి వేసింది ఆ దేశభక్తుని మరణం. యువకుడైన భగవత్సింగ్, రాజగురు, సుఖదేవ్ మెడకి ఉరిత్రాడు వాళ్ళే తగిలించుకున్నారు. "నైనమే ఛ్చిందంతి శస్త్రాణి నైనమే దహతి పావకహం" అనే భగవద్గీత శ్లోకాన్ని చదువుకుంటూ ఉరికంబం ఎక్కారు. ఈ ఆత్మని శస్త్రాలు ఛేదించలేవు. అగ్ని దహించలేదు. నీరు తడపలేదు. ఆత్మకి జనన మరణాలు లేవు. స్వచ్ఛంద రూపమైనది ఆత్మ. ఈ భావంగల గీత శ్లోకం యిది. అటువంటి ఉదాత్త వ్యక్తుల్ని కన్న వాళ్ళ తల్లి, భారతమాత ధన్యులు.

మా నాన్నగారు మమ్మల్ని చాలా క్రమశిక్షణలో పెంచారు. ప్రశాంతమైన ఋషి ఆశ్రమం లాటి వాతా

వరణంలో పెరిగాను నేను. కాపురానికి వెళ్ళాకే ఉమ్మడి కుటుంబాలలో ఆడవాళ్ళు ఎలా పోట్లాడుకుంటారో ఇంట్లో ఎక్కువ సంపాదించే మగవాడి భార్యకి, తక్కువ సంపాదించే మగవాడి భార్యకి తారతమ్యాలు ఎలా ఉంటాయో గమనించాను. ఇవి నాకొన్ని కథలకి ఇతి వృత్తా లయినాయి. మా నాన్నగారు ప్రకృతి చికిత్సని అవలంబించడం నుంచి మా ఇంట్లో అందరికి కారం లేకుండా ఆహారం అలవాటు చేశారు. ఊరగాయలు కూడా కారం లేకుండా పెట్టుకుంటాము. కాఫీలు అసలు అలవాటు చేయలేదు. నేను ఇప్పటికి కాఫీ తాగను. ఆ వాసన కూడా గిట్టదు. ఏదైన అలవాటయి పోతుందని నేను తమలపాకులు వక్కపొడి కూడా ఇంట్లో ఉన్నా వేసుకోను. నేను కొన్నాళ్ళు ప్రకృతి చికిత్స చేశాను. బ్రతకడం కోసం తినాలిగాని తినడం కోసం బ్రతకరాదనే వాక్యం అందరూ గుర్తుంచుకుంటే ఆరోగ్యం బాగుంటుంది. నేను చాలాకాలం నుంచి రాత్రి భోజనం మానేశాను. పగలే కారం లేకుండా ఉప్పు తక్కువ వేసి సాత్వికాహారం తింటాను.

## హోమియోపతి - ప్రకృతివైద్యం

హోమియోపతి కూడా చాలా మంచి వైద్యం. ఒక సారి ఏ వైద్యానికి లొంగని గడ్డుజబ్బులు ఇందులో తగ్గడం నేను చూశాను. స్పైజీరియా 100 పోటీన్సమాత్రలు కొంత వరకు గుండె నొప్పిని తగ్గించాయి. ఆ మధ్య శ్రీ కొడవటి గంటి కుటుంబరావుగారు హోమియోపతిలో 200 పోటీన్స

ఇచ్చి ఎన్ని వళ్ళకి తగ్గని మొండి ఉబ్బన వ్యాధిని నయం చేశానని వ్రాశారు. నేనిప్పుడు హోమియోపతి మందులు వాడుతున్నాను. హోమియోపతి మందులు అపాయం చెయ్యవు. నాకోసారి కుంటెలో ఎముక నొప్పి రాగా ఇంగ్లీషు వైద్యంలో ఎన్ని ఇంజక్షన్లకి తగ్గకపోగా హోమియోపతిలో 5 ఫాస్‌లు తీసుకొని, ఆవునెయ్యి మర్దనా చెయ్యగా తగ్గింది. ఇప్పుడు ప్రకృతి చికిత్సలుకూడా అంత కఠినంగా లేవు. ఎక్కువగా రోగుల్ని ఉపవాసం పెట్టడం, రోగులు ఎల్లప్పుడు పళ్ళు, కాయలే తినమనడం లేదు. చికిత్సలు తేలిగ్గానే ఉన్నాయి. ప్రజలు, ప్రభుత్వం హోమియోపతి, ప్రకృతి చికిత్సలు ఆదరించాలి.

## మా వంశంలో వాక్శుద్ధికల కవి

రెబ్బాప్రగడ జోగిరాజుగారని ఉండేవారు. మా ముత్తాతగారు రెబ్బాప్రగడ సుబ్బన్నగారి తండ్రి అనుకుంటాను. ఈయన గొప్ప తపస్వి, కవి, వాక్శుద్ధి కలవాడు. ఒకసారి ధర్మవరం (పశ్చిమగోదావరి జిల్లా) లో ఒక కోమటి ఈయన్ని మోసగించగా 3 పాదాలు కవిత చెప్పి 4 వ పాదంలో ఆ కోమటిని శపించబోయారట. ప్రక్కనున్న అతను "ఒరే! జోగిరాజుగారు నిన్ను శపించబోతున్నారు. కొంప మునుగుతుందిరా" అని కోమటిని పిలుచుకురాగా అతను వచ్చి 'తప్పయిపోయింది మహాప్రభో రక్షించం' డని కాళ్ళ మీాద పడ్డాడట. ఈయన వ్రాసిన పద్యాలుకూడా వ్రాత ప్రతి ఉందని మా నాన్నగారు చెప్పినట్లు గుర్తు.

## ఆనాటి పెళ్ళిళ్ళు

మానాన్నగారు ఫోర్తుఫారం చదువుతుండగా రాజమండ్రిలో వాళ్ళ నాన్నగారితో "నాన్నా, నాకు స్కూలుకి వెళ్తుంటే తలనొప్పిగా ఉం" దన్నారట. దాంతో వాళ్ళనాన్నగారు ఈయన ఒక్కడే కొడుకు అవడం వలన స్కూలు మానెయ్యరా అన్నారుట. ఆతరువాత ఆయనంతట ఆయనే యింటిదగ్గర చదువుకొని ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత భాషలలో ప్రవీణులైనారు. అందరూ ఆయనని ఎం. ఏ. అనుకొనేవారు. ఆయనతో సమానంగా గ్రాడ్యుయేట్స్ ఇంకా పెద్ద చదువులు చదివిన వాళ్ళు కూడా ఇంగ్లీషు వ్రాయలేక పోయేవారు. మానాన్నగారికి 14 సం॥ లు ఉంటాయి. మాబామ్మగారు సీతమ్మగారు రాజమండ్రిలో నిడమర్తి దుర్గయ్యగారింటికి ఏదో పెళ్ళి సందర్భంలో వెళ్ళారుట. దుర్గయ్యగారి కూతురు చిన్నచెల్లన్నగారని ఒకావిడ ఉండేదిట. మా అబ్బాయికేదైనా పెళ్ళి సంబంధం చూద్దూ! పెద్ద పిల్లని చూడు అందిట. దాని కావిడ ఓ సంబంధం ఉంది. పిల్ల పెద్ద పిల్లే. 12 సం॥రాలు. మా వదినె చెల్లెలుంది. బోడపాటి రాజన్నగారి రెండో అమ్మాయి. బొబ్బిలిలో ఉన్నారు. దివాను చేస్తున్నారు. వాళ్ళది మంచి కోవైన వంశం. పుట్టిన పిల్లలంతా బావున్నారని చెప్పిందట. మాతాత రాజన్నగారు రామయ్యగార్ని పిల్లని చూసుకోడానికి రమ్మనమని ఆహ్వానించారు. రాజమండ్రిలో ఇసుకవీధిలో మా పెద్ద మేడ ఉంది. అందులో ఉండేవారు. పెళ్ళిచూపులకి వెళ్తున్న తండ్రితో మాపెద్ద మేనత్త సీతామణి ఇలా అందిట: "నాన్నా

పిల్లని మేము చూడకుండానే ఒప్పుకుని తాంబూలాలు పుచ్చుకొని వచ్చెయ్యాక, నువ్వసలే అమాయకుడివి. మేము ఆడవాళ్ళం వెళ్ళి నాలుగూ చూసి, తెలుసుకునేదాకా నువ్వే మాట ఇవ్వ" వద్దని మరీ మరీ చెప్పిందట. ఈవిడ చాలా తెలివైన ఆవిడ. ఈవిడని రెబ్బాప్రగడవారి మంత్రి అనే వారుట అందరు. ఈవిడ వ్రాసిన జమాఖర్చుల పుస్తకాలు మొన్నటి దాకా ఉండేవి. మా తాతగారికి ఒకే ఒక చెల్లెలుండేది, కావమ్మగారు. ఈవిడని రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో పని చేస్తున్న మహామహోపాధ్యాయ కస్తూరి శివశంకరశాస్త్రి గారి కొడుకు కస్తూరి మాణిక్యాలరావు తాసిల్దారు గారికిచ్చి పెళ్ళి చేశారు. ఆరోజులలో 116 రు॥లు, జరీబుట్ట తలపాగా ఇచ్చారు. అది ఆరోజుల్లో పెద్ద కట్నం. ఈవిడ పెద్ద కుమారుడు శివశంకరానికి మా మేనత్త సీతామణి నిచ్చి పెళ్ళి చేశారు.

మా తాతగారు మాఅమ్మని చూడ్డానికి పెళ్ళి చూపులకి బొబ్బిలి వెళ్ళారు పెళ్ళిచూపులయ్యాక యింటి కెళ్ళాక ఏమాటా చెప్తానని మా తాతగారు రైలుస్టేషను కొచ్చారట. ఈయన రాజమండ్రి రైలు ఎక్కబోయే సమయానికి ఆ రైల్లోంచి బోడపాటి రామలింగేశ్వరప్పగారు దిగారు. ఆయన రాజమండ్రిలో రిజిష్ట్రారుగా ఉండేవారు. రామయ్యగారిని బాగా తెలుసు. "ఏం రామయ్యా ఏం పనిమీద వచ్చావు? ఎక్కడికి వెళ్తున్నా"వని అడిగారుట. ఈఊళ్ళో ఫలానా వారి పిల్లను చూడ్డానికి వచ్చాను అన్నారుట. రావడమేమిటి నువ్వు వెళ్ళిపోవడమేమిటి తాంబూలాలు పుచ్చుకోకుండానా? వాడు మా తమ్ముడే. మా తమ్ముడెలా వెళ్ళనిచ్చాడు నిన్ను?

పద పద ఇంటికి అని తీసుకు వచ్చారుట. ఇంటికొచ్చి "ఏం రాజన్నా! రామయ్యని అలా వెళ్ళనిచ్చావేమిటి?" అని అప్పటి కప్పుడు తాంబూలాలు ఇప్పించేశారుట. ఆనాటి పెళ్ళిళ్ళలా ఉండేవి. మా తాత ఆతరువాత యింటికి వెళ్ళగానే మా పెద్ద మేనత్త ప్రశ్నల వర్షం కురిపించిందిట. పిల్ల ఎలా ఉంది ఏమిటి? నువ్వేమన్నావు? అని. పిల్ల బావుంది అని చెప్పి పిల్లిలా తాంబూలాలు పుచ్చుకున్నానమ్మా అన్నారుట. ఏమిటి నాన్నా ఆడవాళ్ళం వెళ్ళి చూడకుండానే నువ్విలా తాంబూలాలు పుచ్చుకోడం- నువ్వన్నీ ఇలా చేస్తావేమిటి? అన్నారట.

మా అమ్మగారివి పెద్ద కళ్ళు, నల్లని పెద్ద జుట్టు. పచ్చగా అందంగా ఉంటారు. ఇప్పటికి కూడా జుట్టు తెల్లబడలేదు. మా అమ్మగార్కి ఎడం చేతిమీద కురుపు మచ్చ ఉంది. చిన్నప్పుడు ఎముకను బుట్టి కురుపు వేసింది. అప్పుడు కె. జి. హెచ్. లోని (విశాఖ) డా॥ దొరసానికి చూపించగా ఇది ఎముకలో నుండి కురుపు వేసింది. చెయ్యి కొట్టెయ్యాలన్నారు. లేకపోతే సెప్టికయి పిల్ల చచ్చి పోతుందని అన్నారుట. అప్పుడు మా అమ్మమ్మగారు వద్దు పిల్లపోతే పోయింది, చెయ్యి కొట్టేస్తే ఆడపిల్ల పెళ్ళి అవదు అన్నారుట. బొబ్బిలిలోని రాజవైద్యులు కోటగిరి అప్పన్న గార్కి చూపగా ఏదో మూలికలు అవి ఇచ్చి కురుపు మాన్చేశారు. చెయ్యి శుభ్రంగా ఉంది. ఆయుర్వేదం గొప్ప వైద్యం. సరియైన వైద్యుడుంటే ఇంగ్లీషు వైద్యంలో తగ్గదన్న జబ్బు ఆయుర్వేదంలో తగ్గింది. మా అమ్మగారి పెళ్ళికి మా తాతగారు రాజన్నగారు వెయ్యినూట పదహార్లు కట్నం ఇచ్చి రాజ

మండ్రి నుంచి బొబ్బిలిదాక మగపెళ్ళి వారందరికి రాను ఖర్చు పోను ఖర్చు ఇచ్చారు. ఆడపడుచులకి, అత్తగారికి 5 రోజులు 5 పెద్ద కాసులు, చీరెలు ఇచ్చారు. మా తాత గారు రామయ్యగారు కాసుల పేరు వడ్డాణం పెట్టగా, రాజన్నగారు కంఠి, గాజులు, గొలుసు, ఇంకా చిన్న వస్తువులు పెట్టారు మా అమ్మగారికి. సరే ఆయన దివాను. పెళ్ళి బ్రహ్మాండంగా చేశారని వేరే చెప్పక్కరలేదు. అప్పటి బంగారం మంచి మేలిమి బంగారం. పచ్చగా మెరుస్తూ ఉండేది. మా నాన్నగారు పోయాక కంఠి చెరిపించి నాకు 22 కాసుల బంగారం ఇచ్చారు మా అమ్మగారు. నేను గాజులు చెయ్యించుకున్నాను. 10 సంవత్సరాలయి గాజులు చెయ్యించుకున్నా కూడా ఇవాల్టికి ఆ గాజులు రోజూ వేసుకుంటున్నా, కొత్తగాజుల్లా తళ తళ మెరుస్తాయి. ఆ బంగారం అంత మంచిది.

ఒకసారి మా నాన్నగారికి చాలా జబ్బు చేసిందిట. మా తాతగారు బాధపడ్తూ "ఏదో మీ అమ్మాయి అదృష్టం ఇంక" అనగా మా తాత రాజన్నగారు చెయ్యి ఇలా విదిలించి ఏం లెక్క లేనట్లుగా "అంతా బాగానే ఉంటుంది. ఏం ఫర్వాలేదు" అనేశారుట. అలాగే మా నాన్నగారికి అంత సుస్తీ తగ్గింది. మా నాన్నగారు తనకి ఎప్పుడు జబ్బు చేసినా మా అమ్మని చూసి 'ఆ వెలది మంగళ సూత్ర మహాత్మ్య మెట్టిదో' అని పోతనగారి పద్యం చదివేవారు. శివుడు అమృత మధనంలో హాలాహలం మింగి బ్రతికినప్పుడు దేవతలందరూ పార్వతీదేవిని చూసి అన్న పద్యమిది.

మా తాతగారు రాజన్నగారు మా అమ్మగారికి

5 ఎకరాల భూమి ఇచ్చారు. కానీ లంచం పుచ్చుకొని ఎరుగరు. కీర్తిని సంపాదించారు. ఆయన భగవద్గీతలోని స్థితప్రజ్ఞుడు లాంటి వారు. నిష్కామ కర్మయోగి. మా దొడ్డమ్మ చెప్పేది. ఆయన చనిపోయే ముందు దండం తీసి పక్కకి పెట్టేశారుట. అంటే సన్యాసం పుచ్చుకున్నట్లు అర్థం. అసలు మా తాతగారిది అంటే బోడపాటి రాజన్నగారిది బందరుట. మొన్న ఉప్పెన కాక అంత క్రితంసారి వచ్చినపుడు అంటే 100 సం॥ ల క్రితం ఉప్పెనలో బందరు నుండి కొట్టుకొచ్చారుట. ఆ మధ్య ఒకసారి బరంపురం నుండి దారాకోట వెళ్ళాను. అప్పుడు మా తాతగారికి తెల్సిన ఒకాయన రాజుగారి కోటలో గదిలో ఒక బల్ల చూపించారు. ఇదే రాజన్ పాత్రో - పాత్రో అంటే మంత్రి రాసుకునే బల్ల అని.

## చిన్నప్పటి విశాఖపట్టణం ప్రయాణం

మా నాన్నగారు ఎప్పుడు ఏదైన ఊరు వెళ్తే పిల్లల్ని కూడా తీసుకు వెళ్ళేవారు. నాకప్పుడు ఏడెనిమిది ఏళ్ళుంటాయనుకుంటాను. అప్పుడు విజయనగరం, విశాఖపట్టణం తీసుకెళ్ళారు. విశాఖలో మేము టర్నరుచౌల్ట్రీలో బస చేశాము. మా నాన్నగారు బీచ్ ఒడ్డున సభ జరిపారు. మైక్ ముందు మాట్లాడారు. నేనప్పుడు ఇసుకలో పిచ్చుకగూళ్ళు కట్టుకొని ఆడుకొనేదాన్ని. సముద్రంలో దూరంగా కనిపించే ఆ కొండే డాల్ఫిన్స్‌నోస్ అని తెల్సింది. అప్పుడు మాడుగుల నుండి కొండజాతి వాళ్ళుకూడా సభకి వచ్చారు. వాళ్ళు వంగుని

నాన్నగార్కి దణ్ణాలు పెడ్తుంటే వాళ్ళ జేబుల్లోని డబ్బులు రాలి క్రిందపడటం నాకింకా గుర్తుంది. ఆ టర్నర్ చౌల్ట్రీలో ఒక బామ్మ గారుండేది. మానాన్నగారు, ఆచార్లుగారు అనే మిత్రుడు భార్యతో నన్ను హోటల్‌కి వెళ్ళమనేవారు. ఆ బామ్మగారు నన్నుచూసి మా మనుమరాలులా ఉన్నావని జడేసి, బొట్టుపెట్టి అన్నం పెట్టేది. నన్ను హోటల్‌కి వెళ్ళ నిచ్చేది కాదు. నాకు హోటల్‌కి వెళ్ళాలని సరదాగా ఉండేది. ఆవేళ నేను నాన్నగారు తెల్లారు ఝామున బయలుదేరి వస్తుంటే భోగి అని తలంటుపోసి జడేసి ముద్దబంతి పువ్వులో చామంతి పువ్వులోగాని పెట్టి పంపింది. ఆవిడెవరో ఇప్పటికి నాకు తెలియదు. ఆ అజ్ఞాత వ్యక్తికి నామీద ఎంత ప్రేమో! సరిగ్గా నేను ఈ వాక్యాలు వ్రాస్తున్నప్పుడు సంక్రాంతి. అంటే భోగి వెళ్ళిన మర్నాడు. 1978 సం॥ మా మేనత్త కూతుర్ని చిన్నపిల్లగా వున్నప్పుడే వార్ధా తీసుకెళ్ళారు నాన్నగారు. ఆయనకూడ చిన్నపిల్లల్ని రమ్మంటే వెళ్ళిపోయే వారు. పేచీలు పెట్టకుండా ఉండేవాళ్ళం.

## నాన్నగారు రెండవసారి జైలునుంచి తిరిగి వచ్చాక

మా నాన్నగారు రెండోసారి జైలులో ఉన్నప్పుడు సరిగ్గా ఆ తెల్లవారి జైలునుండి వచ్చాక ఆవేళో, ఆ మర్నాడోగాని తండ్రిగారు పోయారుట. మా తాతగారు రామయ్యగారు చనిపోయేసరికి 82 ఏళ్ళుండవచ్చును. ఆయన మంచంమీద చావుబ్రతుకుల్లో ఉండగా మా నాన్నగారు ఇంకా జైలు నుంచి రాలేదు. ఒక్కడే కొడుకు కర్మ చేయ డానికి రాలేదని బాధపడ్డారు. నాన్నగార్కి ఒక అన్న సుబ్బన్నగారని ఉండేవారు. ఆయన పెళ్ళి అవకుండానే

పోయారు. పెళ్ళి తాంబూలాలు పుచ్చుకున్నారుట. ఆ తర్వాత జ్వరం వచ్చి నీరుపట్టి పోయారుట. మా బామ్మ గారు ఎప్పుడు ఏడుస్తూ ఉండేవారుట. ఇలా తాంబూలాలు పుచ్చుకున్నప్పుడు నలుగురి మధ్య పిల్లాడు చుక్కల్లో చంద్రుడిలా వెలిగిపోయాడు అందంగా అని. మా తాతగారు రామయ్యగారు చాలా భక్తి విశ్వాసాలు కలవారు. రోజు సుందరకాండ పారాయణం చేసేవారు. దేవాలయానికి భూములు అవి ఇచ్చేవారు. మానాన్నగారింకా జైలునుంచి రాలేదు. ఆయన చనిపోయే ముందు ఇలా అన్నారుట. నామాలాళ్ళు వస్తున్నారు వెళ్ళిపోమనండి. వెళ్ళిపోమనండి. మా అబ్బాయింకా రాలేదు. వచ్చాక వస్తానని. "నామాలాళ్ళంటే విష్ణుదూత లన్నమాట". అలా ఆయన కొడుకు వచ్చిందాకా విష్ణుదూతలతో పోరాడి ప్రాణం నిలుపుకున్నారు. మానాన్నగారు జైలునుంచి వచ్చారు. కొడుకుని చూసి ఆయన ప్రాణం వదిలారు. ఖద్దరు వస్త్రాలతో ఆయనను దహనం చేశారు. మా నాన్నగారు 'ఒక్కడే కొడుకని నామీద ఆశ పెట్టుకున్నందుకు తండ్రిని ఇంతమట్టిచేసి వాళ్ళ ఋణం తీర్చుకున్నా'ననే వారు. సరిగ్గా ఆవేళ జైలునుంచి వచ్చాను కనుక సరిపోయిందికాని లేకపోతే లోకులు ఎంత నిందిస్తారు? ఒక్కడే కొడుకై ఉండితండ్రి దగ్గర చివరి దశలో లేకుండా వెళ్ళిపోయాడు. ఇంత మట్టి చెయ్యలేదని నాకా నిందలు తప్పాయి. ఇలా స్వాతంత్ర్య ఉద్యమంలో తల్లనక, తండ్రనక, భార్యనక అందర్నీ వదిలిపెట్టి ప్రాణాలకు తెగించి అనేక మంది జైళ్ళకి వెళ్ళబట్టి గదా? ఈనాడు మనకి స్వాతంత్ర్యం వచ్చింది.

నన్నందరూ మానాన్నగారి పోలికంటారు. ఆడపిల్లకి తండ్రిపోలిక, మగపిల్లాడికి తల్లిపోలిక వస్తే అదృష్టం. నాచేతి గుర్తులు అచ్చం మా పెద్ద మేనత్త సీతామణి చేతిగుర్తుల్లా ఉంటాయి. ఇప్పుడున్న మామేనత్త అమ్మాయమ్మగారికి నన్ను చూపించి ఇలా అనేవారు మానాన్నగారు. 'ఒసే అమ్మాయ్, అచ్చం దీని చేతిగుర్తులు అక్కయ్య చేతి గుర్తులులా ఉన్నాయి. తరం నుంచి తరానికి పోలికలు, తెలివి తేటలు, గుణాలు వారసత్వంగా వస్తూనే ఉంటాయి.'

## ఆనాటిపుస్తకాలు, చిత్రాలు, మన పండుగలు

నా చిన్నప్పుడు మా ఇంట్లో నీలం అట్టతో బైండ్ చేసిన భాగవతం ఉండేది. దేవరాజు సుధీ ప్రణీతము అని వ్రాసి ఉండేది. ఆ పుస్తకంలో అచ్చుకాగితం కూడా బావుండేది. పురాణ వ్యక్తులకి వేసిన బొమ్మలు, ఆడవాళ్ళకి వేసిన బొమ్మలు మరీ అందంగా ఉండేవి. సన్నని నడుము, ఎత్తైన వక్షోజాలు, బారెడు జుట్టు, వడ్డాణం, నగలు ఉండేవి. రామాయణంకూడ ఉండేది. ఎవరు వ్రాశారో తెలియదు. అందులో వర్షఋతువు వర్ణన చాలా అందంగా ఉండేది. మా ఇంట్లో ఒక పెద్ద గదిలో గోడనిండా రవివర్మ చిత్రాలుండేవి. చాలా కళాత్మకంగా ఉండేవి. పెద్ద పెద్ద ఫోటోలు.

సంక్రాంతికి 9 రోజులు వుండనగా మా పెద్ద హాల్లో బొమ్మలు పెట్టేవాళ్ళం. అంతస్తుల బల్లవేసి, ఊళ్ళో చాలా మందిని పేరంటానికి పిలిచేవాళ్ళం. బాగా సరదాగా గడిచేది. బలిచక్రవర్తి రాజ్యంలో రోజూ కూడా ఇలా పండుగలు

ఉండేవిట. మనం బొమ్మల కొలువు పెట్టుకొని 3 రోజులు ఎంత పండగ చేసుకుంటామో అలా ఉండేదప్పుడు. సంక్రాంతప్పుడు బలి తన రాజ్యం ఎలా ఉందో చూద్దామని భూలోకానికి వస్తాడట. మా చిన్నప్పుడు అట్లతద్దికి, ఉండ్రాళ్ళ తద్దికి ముందు రోజే గోరింటాకు పెట్టుకునే వాళ్ళం. ఎర్రగా పండేది. కడిగేసుకుని నాన్నగార్కి చూపించేదాన్ని. కొబ్బరినూనె రాసుకో ఇంకా మెరుస్తుందనేవారు. అట్లతద్దినాడు తెల్లారగట్లే లేచి గోంగూర నూపొడితో అన్నం తిని జళ్ళేసుకొని, పూలుపెట్టుకొని, కిళ్ళీ లేసుకొని ఆడుకునేందుకు బయలు దేరే వాళ్ళం. వెన్నెలలో ఆడుకోవడం సరదాగా ఉండేది. ఇప్పుడు పట్నవాసాల్లో ఆడుకునే వాళ్ళు తగ్గిపోయారు.

నా 'రెండు తరాల స్త్రీ' లనే నవల్లో తద్దినాడు గోరింటాకు పెట్టుకొని తెల్లారగట్ల భోంచేసి ఆడుకోవడం గురించి వ్రాశాను. రెండు జట్లుగా చీలి వరుసగా ఈ ఆట ఆడేవాళ్ళం. చిన్ని పిన్నికి అన్న ఆట. ఎదురెదురుగా నుంచుని ఒకరు మగ పెళ్ళివారు, ఇంకొకరు ఆడపెళ్ళివారు. ముందర ఒకజట్టు వెనక్కి ముందుకి అడుగులు వేస్తూ మగపెళ్ళివారు పాట పాడ్తారు. ఆపాట ఇది. చిన్ని పిన్నికి ఎన్నోవడు, సింగలగారికి ఎన్నోవడు, తాడిమేటికి ఎన్నోవడు. తామర సిరిమొగ్గ. ఇది ఎంతో అందమైన మాట. అప్పుడు ఆడ పెళ్ళివారు చిన్ని పిన్నికి ఒకటోవడు, సింగలగారికి ఒకటోవడు, తాడిమేటికి ఒకటోవడు తామరసిరిమొగ్గ. మళ్ళీ మగపెళ్ళివారి జట్టు వెనక్కు ముందుకు అడుగులు వేస్తూ చిన్ని పిన్నికి ఎన్నోవడు అని ఈ పాటలే పాడడం, ఆడ పెళ్ళివారు కూడా అలాగే అడుగులు వేస్తూ చిన్ని పిన్నికి రెండోవడు, సింగలగారికి రెండో

ఏడు, తాడిమేటికి రెండోఏడు అని పాటంతా చెప్పడం. ఇలా చిన్నిపిన్నికి పెళ్ళీడు వచ్చేదాకా ఏళ్ళు అడగడం ఆ తర్వాత పెళ్ళి కట్నాలు, పెళ్ళి కూతురుకి పెట్టాల్సిన నగలు, పెళ్ళితో ఈ ఆట అంతమయ్యేది.

దాగుడుమూతలు కూడా దొడ్లోంచి రోడ్డమ్మట పరిగెట్టి ఆడేవాళ్ళం. చెమ్మచెక్క ఆడేప్పుడు ఈ పాట పాడేవాళ్ళం. చెమ్మచెక్క చేరడేసి మొగ్గ, అట్లుపోయంగ ఆరగించంగ, రత్నాల చెమ్మచెక్క రంగులేయంగ, ముత్యాల చెమ్మచెక్క ముగ్గులేయంగ. ఏ అజ్ఞాతకవి ఊహోగాని ఎంత అందంగా ఉంది. ఇలాంటి వాటిలో పూర్వం నుంచి వచన కవిత ఉంది. ఇసుకలో దూదుంపుల్ల, తొక్కుడు బిళ్ళ గీసుకొని ఆడుకునే వాళ్ళం. ఇవన్నీకూడా ఉత్సాహాన్ని కల్గిస్తూ ఎక్సర్ సైజ్ గా పనికొస్తాయి. నేను చిన్నప్పుడు రింగ్ టెన్నిస్ ఆడేదాన్ని. మానాన్నగారు అప్పుడప్పుడు ఇంట్లో మాతో కలిసి పేక ఆడేవారు. ఏమీ తోచనప్పుడు, ఎవరూ లేనప్పుడు గుడ్డాడిని పెట్టి ఆడుకునే వాళ్ళం. కోమటి దివాళ ఆడేవాళ్ళం. ఈ ఆట ఎంతకి తెమిలేదికాదు. మానాన్నగారు ఒకసారి వర్డ్సు బిల్డింగ్ తెచ్చారు. చిన్ని చిన్ని అట్టముక్కల మీద ఇంగ్లీషు అక్షరాలు వ్రాసి ఉండేవి. కాట్ అంటే సి అని వ్రాసి ఉండేది. ఈ అక్షరాలన్నీ పేరిస్తే పిల్లి బొమ్మ వస్తుంది. అప్పుడప్పుడు క్యారమ్సుకూడా ఆడేవాళ్ళం.

తెల్లవారు ఝామునే లేచి సుబ్బారాయుడి షష్టి దగ్గరనుంచి భోగిదాకా నెల్లాళ్ళు గొబ్బెళ్ళు పెట్టేవాళ్ళం. మాగుమ్మం ముందు పనిమనిషి తెల్లారగట్టే ఆవుపేడతో కళ్ళాపి జల్లి ముగ్గు పెట్టి ఉంచేది. నేనుకూడా అప్పుడప్పుడు

పెట్టేదాన్ని ముగ్గు. వీనిలో గీతలతో పెట్టే నాలుగు ద్వారాల ముగ్గు, శంఖాల పద్మం, మామిడిఆకు...మాఅమ్మగారు ఒక ఇత్తడి బొట్టుపెట్టెలో పసుపు, కుంకుమ, పిండి బెల్లంముక్క పెట్టి ఇచ్చేవారు. అరలు అరలుగా ఉండేది ఆపెట్టె. గొబ్బెళ్ళకు పసుపు, కుంకుమ, పిండి పెట్టి మధ్యనే బంతి పువ్వు పెట్టేదాన్ని. పూజచేసి బెల్లం నైవేద్యం పెట్టే దాన్ని. పూజ చేస్తున్నప్పుడు ఈ పాట పాడేవాళ్ళం. సుబ్బి గొబ్బెమ్మ, గొబ్బి సుబ్బమ్మ తామరపువ్వంటి తమ్ముడ్నివ్వవే, చామంతి పువ్వంటి చెల్లెల్నివ్వవే, ఇంకా ఈపాట కొంచెం ఉంది. ఆఖరికి మొగలి పువ్వంటి మొగుడ్నివ్వవే అనేమాట అనేప్పుడు అందరు ఆడపిల్లలు కొంచెం మొహమాట పడ్తారు. గోపికలు ఈ నెల్లాళ్ళు శ్రీకృష్ణుని పతిగా కోరి మంగళ గౌరిని ఉపాసించినట్లు, గోపికల శబ్దానికి అపభ్రంశం గొబ్బెమ్మ అని ఎక్కడో చదివిన గుర్తు. ఎవరెక్కువ గొబ్బెళ్ళు పెట్టేవారని మాఅత్తయ్యగారి అమ్మాయి పద్మావతి, నేను పోటీ పడేవాళ్ళం. నెలమధ్యలో సాయంత్రం కూడా పెద్ద గొబ్బెళ్ళు చేసి సంది గొబ్బెళ్ళు పెట్టేవాళ్ళం. పిల్లలందరినీ పేరంటానికి పిలిచి చేతులు అటు ఇటు తాళాలు వేస్తూ గుండ్రంగా తిరుగుతు చప్పుడు చేస్తూ పాటలు పాడేవాళ్ళం. ఈ పాటలు చాల్హా సౌందర్యంగా ఉంటాయి. గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో చందమామ. ఓ చందమామ. చందమామకు పిల్లలెందరు, నీలగిరి కన్య, నీలగిరి కన్యకు నిచ్చెమల్లి తోట. నిచ్చెమల్లితోటకు నిమ్మలబావి, నిమ్మలబావికి మల్లెత్రాడు, మల్లెత్రాడుకి బుడుగు బుడుగు చేద ఇలా పాట ముక్తపదగ్రస్తంగా అందంగా సాగేది. ఇంకో పాట

కూడా ఇలా అందంగా ఉండేది. యిది కొంచెం వ్యవసా యానికే సంబంధించినది. అవునాట అక్కల్లారా, చంద్రగిరి భామల్లారా వామనగిరి గొబ్బెళ్ళు, దుక్కి దుక్కి దున్నేరట. ఏమి దుక్కి దున్నారట. యిలాగే పూవు పూవు పూసిందట. ఏమి పూవు పూసిందట, రాజుగారి తోటలో జామి పువ్వు పూసిందట. ఈ పాటను ఇప్పుడు రేడియోలో విన్నా మన్నారు పిల్లలు.

ఆఖరున పిల్లలందరికీ ప్రసాదం పెసరపప్పు నానపోసి అందులో కొంచెం ఉప్పు కారం వేసి నిమ్మరసం పిండి ఆకుల్లో పెట్టి ఇచ్చేవాళ్ళం. లేకపోతే నానవేసిన పెసర పప్పులో కొబ్బరికోరు, పంచదార కలిపి ఇచ్చేవాళ్ళం. ఇవి చాలా రుచిగా ఉంటాయి. పచ్చని చిట్టి చామంతిపూలు, పెద్ద చామంతులు, కనకాంబరం, పసుపు రంగులో అందంగా మెరిసే ముద్ద బంతిపూలు, సీమ బంతిపూలతో పండుగ నెల్లాళ్ళు పెరళ్ళు చాలా సౌందర్యంగా ఉంటాయి. రంగు రంగుల అందమైన ఈ పూలను గురించి నా ఉదయపవనాల నే వచన కవితలో ఆఖరి గేయం వన్నెచిన్నెల పూలు జ్ఞాపకం వస్తోంది. నేను ఉదయపవనాలు వచన కవితా సంపుటిలో ఆఖరి గేయంలో పూలన్నిటిని రాజకీయ పార్టీలకు గుర్తుగా తెలిపే గేయం వ్రాశాను. వన్నె చిన్నెలపూలు అన్న గేయంలోని కొన్ని పదాలు-పూలు, పూలు, ప్రకృతికాంత తోటలో వన్నె చిన్నెల పూలు. జాతి కెంపుల్లా ఎఱ్ఱని కాంతితో ధగధగ మెరిసే గులాబీలు, మేలిమి బంగారంలా పచ్చగా మెరిసే చామంతి సేవంతిసులు. ఆఖరి పాదంలో పూవ్వులాంటి తుఱుసున్న మానవునికి మరణం లేదు. ఈ

గేయం అందంగా అర్థవంతంగా ఉందని ఇక్కడ వ్రాశాను. ఉదయపవనాలు వచన కవితా సంపుటిమీద, నా కథల మీద రచయితలు, పండితులు, విమర్శకులు ఆర్. యస్. సుదర్శనం గారు ఇలా అన్నారు. మీ కథలన్నిట మీ రచనలన్నిట అభివ్యక్తమయ్యేది పువ్వులాంటి మీ మనస్సు అని.

## కొవ్వూరులో సంస్కృత పాఠశాల

కొవ్వూరులో మా సంస్కృత పాఠశాలలో గణపతి నవరాత్రుల ఉత్సవాలు జరిపేవారు. పెద్ద పెద్ద వాళ్ళ చేత ఉపన్యాసా లిప్పించేవారు. జొన్నలగడ్డ సత్యన్నారాయణగారి ఉపన్యాసాలు వినేదాన్ని. ఆయన కలకత్తాలో హైకోర్టు న్యాయమూర్తి ఆశుతోషు ముఖర్జి గురించి ఉత్తేజంగా చెప్పేవారు. తల్లి అంటే ఆయనకు భక్తి విశ్వాసాలని, ఆయన ధర్మ పరతను గురించి, ఇంకా ఇలాగే దేశం గురించి, కొంతమంది పెద్దనాయకుల్ని గురించి ఉత్సాహంగా మాట్లాడేవారు. ఆయన ఉపన్యాసాలు చాలా ఆవేశంగా ఉండేవి. ఆంధ్రలో బాగా ఉపన్యాసాలు ఇవ్వడంలో ప్రముఖులు ముగ్గురు- జమ్మలమడక మాధవరాయశర్మగారు, ఝుటావల్లభుల పురుషోత్తమరావుగారు, జొన్నలగడ్డ సత్యనారాయణగారు. వీరిని జకారత్రయం అందురు. జమ్మలమడక మాధవరాయశర్మ, ఝుటావల్లభుల పురుషోత్తమరావుగారితోను నాకు పరిచయం ఉంది. ఝుటావల్లభుల పురుషోత్తముగారు మా కొవ్వూరులో సంస్కృత పాఠశాలకి చాలా రోజులు ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. ఆయన తర్వాత

సోదరులు కె. వి. యస్. అప్పారావుగారు ప్రిన్సిపాల్‌గా ఉన్నారు చాలాకాలం. ఒకసారి కొన్ని పద్యాలు నేను వ్రాసి పురుషోత్తముగారికి చదవమని ఇవ్వగా చదివి ఆయనవి కొన్ని పుస్తకాలు నాకు బహూకరించారు.

## శ్రీరామనవమికి భోగం మేళం

నా చిన్నప్పుడు కొవ్వూరులో పందిళ్ళు వేసి ఉత్సవాలు జరిపేవారు. శ్రీరామనవమికి భోగం మేళం పిలిపించారు. మేళం నాయకురాలు లావుగా హుందాగా పట్టుచీర కట్టుకుని, దోసగింజాకారంలో బొట్టు పెట్టుకునేది. నడివయస్కురాలు. తక్కిన ఆరేడుగురు అమ్మాయిలుండేవారు. వీరంతా ఒక వరుసలో నిలబడి ఉండేవారు. ఇద్దరు అమ్మాయిలు పాటలు పాడేవారు. ఇద్దరు అమ్మాయిలు డ్యాన్స్ చేసేవారు. నల్లవాడే గొల్లపిల్లవాడే అని పాట పాడడం నాకు ఇంకా గుర్తుంది. నేను కూడా వెళ్ళి చూసేదాన్ని. ఎవరైనా మగవాళ్లు తాంబూలంలో డబ్బులు పెట్టిస్తే వాళ్లు మెడకి గంధం వ్రాసి చెంపమీద చిటికె వేసేవారు. ఈ వేళ భోగం మేళం లేకపోవచ్చు గాని తిండికోసం ఎవరికి పడితే వారికి శరీరాన్ని అమ్ముకునే వేశ్యలు చాలా మంది ఉన్నారు. శ్రీ సి. నారాయణరెడ్డి అన్నట్లు మన రక్తం పంచుకున్న ఆడపడుచులు, మనం జారవిడుచుకున్న జాతి పరువులు.

ఈ 1978 మహిళా దశాబ్దంలో చాలా ఊళ్ళలో వేశ్యలున్నారు. కొన్ని ఊళ్ళు వేశ్యలకి ప్రసిద్ధి. తరతరాలుగా వీళ్ళు హేయమైన వృత్తిలోనే జీవిస్తున్నారు. కందుకూరి,

గురజాడ వచ్చారు. గాంధీ, నెహ్రూలు వచ్చారు. ఇంకా ఎందరో సంఘ సంస్కర్తలుకూడా వచ్చారు. కానీ వీరి జీవితాలు ఇంకా ఇలాగే ఉన్నాయి. తరతరాలుగా ఆ జీవితానికి అలవాటు పడిపోయిన వాళ్ళలోకూడా పరివర్తన రావాలి. వాళ్ళలో ఆ పరివర్తనకు మహిళా సంఘ సేవకులు సంఘ సంస్కర్తలు, రచయితలు కృషి చేయాలి. ప్రజలు కూడా సహకరించాలి. ప్రభుత్వం ఆర్థికంగా సదుపాయం కల్గించాలి. ఈ వైజ్ఞానిక యుగంలో, సమ సమాజం కోరుకున్న యుగంలో తిండికోసం, బట్టకోసం ఒక ఆడది శరీరాన్ని అమ్ముకొని జీవిస్తోం దంటే అందరు తలవంచుకోవాల్సిన విషయం.

## పాడి పంటలు - ధన ధాన్య సమృద్ధి

కొవ్వూరులో మా ఇంట్లో ఆవులేకాక ధర్మవరంలో మాపొలంలో గేదెలుండేవి. పొద్దున్నే పాలేరు సైకిలుమీద కేన్లతో పాలు తెచ్చేవాడు. చాలామంది మజ్జిగ మా యింట్లోనే తీసుకెళ్ళేవారు. ఊళ్ళో పురుడువచ్చిన వారికి పాత బియ్యం కావల్సి వచ్చినవారు మా యింటికి వచ్చేవారు. అలాగే బాలింతరాలికి ఆవుమజ్జిగ, మూడేళ్ళ నాటి పాత బియ్యం మాయింట్లోంచి తీసుకెళ్ళేవారు. మా పొలంలో ఆవకాయ కాయ పుల్లగా పెద్ద కండతో ఉండేది. పాఠశాల లోని పండితులకు యింకా యితరులకు ఊరగాయలు పెట్టుకునేందుకు కాయలు ఇచ్చేవాళ్ళం. అలాగే మామిడిపండ్లు కూడా చెరుకు రసాలు, పంచదార కలిసే పెద్దపెద్దవి తియ్యని రసంతో ఉండేవి. మామిడి పళ్ళు అందరికి ఇచ్చేవాళ్ళం.

మాకు నిమ్మతోటకూడా ఉండేది. ఒకసారి గదినిండా నిమ్మ కాయలు పోయడం నాకింకా గుర్తుంది. కూరగాయలు దగ్గర నుంచి అపరాలు అన్నీ మాపొలంలో పండేవి. మా చుట్టాలు అందరూ మా దంపుడుబియ్యం కృష్ణకాటుకలుతిని ఉత్తన్నం తినవచ్చు, తీయగా ఉంటుందనే వారు. కూరలు బస్తాలతో వచ్చేవి. వంకాయలు, బీరకాయలు, ఆనపకాయలు, టొమేటా బచ్చలికూర ఇంకా అన్నీ పండేవి. పొలం నుండి వచ్చే కూరలు చాలా తీయగా ఉండేవి. కమ్మని నెయ్యి, ఆవు మజ్జిగ తియ్యగా ఉండేవి. యిప్పుడు వస్తున్న వస్తువులలో తియ్య దనం, రుచి కనిపించడంలేదు. మా వాళ్ళు ఆకుకూరలు, పళ్ళు అందరికీ పంచేవారు. ఇప్పటి వాళ్ళలా బజారులో అమ్మి సొమ్ము చేసుకునే ఉద్దేశ్యం లేదు. ప్రతి మనిషికీ అలాంటి శుభ్రమైన తిండి, పాడిపంటలు అతి చౌకగా లభ్యమవాలి.

## నేను పాల్గొంటున్న సాహితీ సంస్థలు- మహిళా సంస్థలు

కాకినాడ మహిళా సమాఖ్యకి నేను చాలాకాలం అధ్యక్షురాలుగా ఉన్నాను. ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్యకి చెందిన సంస్థ ఇది- కాకినాడ ఇన్కస్, సిటిజన్స ఫారమ్, వివేక వాణి ప్రచార సంఘం, సాహిత్య లహరి సంస్థ లలో సభ్యురాలిగా కార్యవర్గ సభ్యురాలిగా ఉన్నాను. హైదారాబాదు లోని ఆంధ్ర విశ్వ సాహితి, యువజన సాంస్కృతిక సమాఖ్య (విజయవాడ) మెంబరుగా ఉన్నాను. అ. ర. సం. కాకినాడశాఖ వైస్ ప్రెసిడెంట్ గా వున్నాను. 21 సెంచరీ రైటర్స్ లో కూడా ఉన్నాను.

## వివాహము-కట్నాలు

కట్నాలు ఇవ్వక పోతే వివాహం చేసుకోరని, నా వివాహానికి మా నాన్నగారికి ఆరు వేలు కట్నం ఇవ్వక తప్ప లేదు. ఆయన శక్తి, బలం ఓపిక అంతా దేశసేవకి ఖర్చయి పోగా నాకింక పెళ్ళి సంబంధాలు వెతకడానికి ఓపిక లేక పోయింది. మా బంధువులలో ఒకరు ఈ సంబంధం ఉందని చెప్పగా ఆయన వెళ్ళి చూడకుండానే సరేనని ఖాయ పర్చారు. అప్పుడు 6 వేలున్న కట్నం రేటు కొంత కాలానికి 10 వేలు అయింది. ఇప్పుడు కాస్త మంచి సంబంధం 25 వేలు కట్నం రేటు. ఇంకా కొన్ని కులాల్లో అయితే 50 వేలు, లక్ష కట్నం రేట్లు. ఈ కట్న పిశాచానికి బలై ఎంత మంది ఆడ పిల్లలు, తల్లి దండ్రులు బాధ పడుతున్నారో! కొంత మంది వృద్ధ కన్యలుగా ఉండి పోతున్నారు. మరి కొంత మంది రెండో పెళ్ళి వాడో, మూడవ పెళ్ళివాడో, వయస్సు మీరిన మగ వారికిచ్చి వివాహం చేస్తున్నారు.

తిరగబడ్డ నవతరం అనే నా నవలలో కట్నాలు ఇచ్చు కోలేక వృద్ధ వరుడిని వివాహ మాడి బాధ పడ్డ యువతులు కనిపిస్తారు. రెండు తరాల స్త్రీలనే నా నవలలో మనజీవితాలు, మన అమ్మల జీవితాలలో సంఘంలో వచ్చిన మార్పుల్ని చిత్రించాను. నా కథలన్నీ స్త్రీల సమస్యల మీద వ్రాయ బడినవే.

## సాహిత్యం నాకు హాబీకాదు

సాహిత్యం నాకు హాబీ కాదు. జీవితం కన్నా ప్రియ మైనట్టిది. బాధ్యతాయుత మైనట్టిది. మానవులందరు సుఖంగా

జీవించే సమ సమాజం రావాలని నా ఆకాంక్ష. మా చెల్లెలు శ్రీమతి సుబ్బలక్ష్మి హిందీ, విశారద చదువు కున్నారు. ఆమె తెలుగు స్వతంత్రలో చాలా రోజులు రచనలు చేశారు. హిందీలోని రచనలు తెలుగులోకి అనువదించారు. ఆంధ్ర ప్రభ వార పత్రికలో కూడా వీరి రచనలు వచ్చేవి. అప్పుడు కుమారి రెబ్బాప్రగడ సుబ్బలక్ష్మి అనే పేరుతో ఈ రచనలు ప్రకటింప బడ్డాయి. ఈ అమ్మాయిని మా మేనత్త కొడుకు శ్రీ వేమూరి విజయదత్తాత్రేయ (యమ్. ఏ. బి. ఇడి.) కిచ్చి వివాహం చేశారు. నా కన్న పదినెలలు చిన్న అయిన విజయ దత్తాత్రేయుడు ఆదర్శం ప్రకారం నడుచుకునే వ్యక్తి. యోగ్యుడు. పెద్దలంటేగౌరవం. వారికి సేవ చేయడం యిష్టం. చిన్నప్పుడు కొవ్వూరులో హైస్కూల్లో మేమిద్దరం కలసి చదువుకున్నాం.

మా నాన్నగారు తన ఆస్థిని కొంతభాగం మాడుగుల కొండజాతి ప్రజల సేవా కార్యక్రమానికి, కొంతభాగం ఆయన వ్రాసిన శ్రామిక ధర్మరాజ్య సిద్ధాంత, వైజ్ఞానిక ప్రచారానికి మరి కొంత ప్రజా ఉపయోగ కార్యాలకి విల్లు వ్రాశారు. మొన్నటి దాకా సోదరులు అప్పారావుగారు ఈ సంస్థ లన్నిటిని చూస్తూ ట్రస్ట్ అధికారిగా వుండేవారు. ఇప్పుడు మా అన్నయ్య శ్రీ రెబ్బాప్రెగడ రామచంద్ర మూర్తి (బి. ఎ. బి. యల్.) సంస్థలకి అధికారిగా వున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరులో వీ రుంటున్నారు. మా నాన్నగారు వ్రాసిన పుస్తకాలు ఎవరికైనా కావాలన్నా, ఆయన శ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతం గురించి పరిశోధన జరపాలన్నా, ఆయన సేవా కార్య క్రమాల్లో పాల్గొవాలన్నా వీరి

అడ్రస్‌కు ఉత్తరాలు వ్రాయవచ్చు. ఆ ఊరు వెళ్ళవచ్చు. మా తమ్ముడు చి॥ రాజేశ్వరరావు (ఐ. యస్‌సి., బి. యల్.) కూడ కొవ్వూరులో ఉంటున్నారు.

స్త్రీలకి జరిగే అన్యాయాలను గూర్చి, సమస్యలు గూర్చి, కథలు, నవలలు, వ్యాసాలు కవితలు వ్రాశాను. సమాజంలోని ధనిక, బీద తేడా తొలగిపోయి ఇప్పుడుజరుగు తున్న అనేక అన్యాయాలు సమసిపోయి అందమైన ఆరోగ్యకరమైన సమాజాన్ని కోరుతూ రచన చేశాను. లండన్‌లో ఉంటున్న మన తెలుగు ప్రొఫెసర్ డా॥ జి. కృష్ణమూర్తి గారీ రచనలు చదివి ఇలా అన్నారు.

## నా రచనలపై మేధావుల అభిప్రాయం

"మందారాల మాలలో కథలు కనువిప్పు గాథలులా ఉన్నాయి. అవి నాకు కథలులా తోచలేదు. ఏదో పెద్ద ఉద్యమంలో మహోపన్యాసాల్లా తోచింది. సమాజంలో అటువంటి కుళ్ళు ఉన్నప్పుడు అటువంటి రచనలు కుంభకర్ణుడి చెవిలో మరుగుతున్న నూనె పోసినట్లు సంఘం మీద పని చేయాలి.

మీ రచనలు చదివాను. గతశతాబ్ది చివరిలో 'క్లెమంటినా బ్లాక్, సారా గ్రాండ్' వంటి రచనలు గుర్తొచ్చాయి. వారి వలెనే మీ రచనలు వెనుక ఒక ఉద్యమం సమాజంలో జరుగుతున్న అన్యాయం, సంఘంలో ఓ తరహా ప్రజలు (మీ రనుకునే స్త్రీలు) అనుభవిస్తున్న బాధ, వారికి జరుగుతున్న అన్యాయం వారి రచనలోలా ఎక్కువ కన్పిస్తాయి. వారు కేవలం రచనలు చేయడమే కాక ఉద్యమాలు స్థాపించి ఉప

వ్యాసాలు యిస్తూ దేశం అంతా సంచారం చేశారు. పత్రికలు నడిపారు. పత్రికలలో ఆయా సమస్యలపై వ్యాసాలు వ్రాయడం, పత్రికల్లో సంపాదకునికి లేఖలు పంపడమో చేసేవారు."

నేను పొగిడించుకోవాలని గొప్పచేత పెద్దలకి పుస్తకాలు పంపలేదు. నా రచనల్లో ఎవరైనా లోటుపాట్లు తెలిపితే నేనెప్పుడూ ఏమీ అనుకోలేదు. వాటిని గురించి ఆలోచించి అవసరమైతే సరి చేసుకుంటాను. ఇప్పుడు మా నాన్నగారు ఎలాగూ నా రచనలు చదివి ఆనందించడానికి లేరు. వారి మిత్రులు చదివి నా పుస్తకాల గురించి వ్రాస్తూవుంటే నాకు తృప్తిగా ఉంటుంది. ప్రముఖ రాజకీయ వేత్తలు, సంఘ సేవకులు, మా నాన్నగారి మిత్రులు శ్రీ ఆచార్య రంగాగార్కి నా పుస్తకాలు పంపాను. వారి అభిప్రాయమిది.

"అమ్మాయి పార్వతీ

శుభం! నీవు పంపిన నాల్గు పుస్తకాలు చదువుకొన్నాను. నా ప్రియమిత్రుడు మందేశ్వర శర్మ పుత్రిక వనే అభిమానంతో ఇన్ని పుస్తకాలు ఇంత సుందరంగా అచ్చువేయించి ప్రీతితో పంపావని ప్రాణం లేచి వచ్చింది. చదవడం మొదలు పెట్టితిని కదా! మందేశ్వరులు ఊహించుకున్న గ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతాలకి వరవడి పెట్ట గల్గినయింతటి సుపుత్రిక మా కందరికీ కూడ పుస్తకాలిలా అందజేస్తున్నది కదా అని ఆనందమైనది. ఇప్పుడే కనుక వీరేశలింగం, ఉన్నవ లక్ష్మీనారాయణ, కవిరాజు రామస్వామి, భారతీదేవి ఉంటే ఎంత ఆనందింతురు! నీది, మాది అదృష్టమహమ్మా! నీకథలు చదువుతున్న కొలది విప్లవ జ్యోతులు రేకె

త్తించే ఈ రచనలు ఇట్టి సాహిత్యం యింకా కావాలని అని పిస్తుంది. రైతులను గిరిజనులను మేల్కొలుపుటలో నాతో భాగస్వామియైన మందేశ్వర శర్మ గారి అమ్మాయి, మా అమ్మాయిగా పెరిగి విప్లవ వంగడానికి వన్నెలు కల్గించుచు వచ్చి వెల్లువిస్తున్నావని ఆనందం నాకు కల్గుచున్నదమ్మా!

ఆనాడు ఆచలం వ్రాసిరి. ఆ బెంగాల్ లో శరత్ కూడ వ్రాసిరి. ఇక్కడ టాల్‌స్టాయ్ కూడ మాలపల్లి (నవల) లో హృదయము ఉత్తేజపరచే వారున్నారు. కనుక ఇప్పుడీ కథ లన్నీ నీద్వారా అందు చున్నవి. మన కుటుంబాలలో మన అమ్మలు, అక్కచెల్లెళ్ళు, బిడ్డలు పడుతున్న బాధలు వాస్త విక జీవితములో కలవు. ప్రతి కుటుంబములో కూడ అటు వంటి జీవితాలను చూస్తున్నారు. మా మందేశ్వరుని విప్లవ జ్యోతులకు ఇంతటి ప్రముఖులు నెయ్యి వేసి వేగం అందించు చున్నావు. ఈ పుస్తకాలు ఇలా నీద్వారా వస్తూనే వుండాలి. వీటిని చూచియైనా ఇక రాబోయే యువతీమణులు యిలాంటి అభివృద్ధి దాయకమైన విప్లవాత్మక రచనలు, పద్యాలు, పదాలు వెల్లివిరియింతురు గాక! భార్యాభర్తలు పరస్పరం ప్రేమించుకోవాలి, గౌరవించుకోవాలి, విజ్ఞాన దశను పెం పొందించుకోవాలి. అందులో సాధ్యం కావాలంటే స్త్రీ, పురుషునితో పాటు సమాన గౌరవస్థాయి, సాంఘికగౌరవాలు సౌకర్యాలు అందుకో గల్గాలి. అందుకు నీలాంటి రచనలు చేయాలి. ఈలాంటి యువతులు యిట్లు సంఘ సేవాతత్పరు లతో యిలాంటి రచనలు చేయాలి. నీకు సర్వ శుభములు సర్వేశ్వరుడు అందించుగాక!"

ప్రముఖ కళాకారులు, రచయితలు శ్రీ సంజీవదేవ్

గార్కి కూడ నా రచన పంపాను. వారిలా వ్రాశారు.

"మా యింటిముందు పారిజాతచెట్టుంది. అయితే అది అన్ని ఋతువులలో ఆకులు తప్ప పూలుండవు. కానీ ఆ చెట్టుకు ఎదురుగా కూర్చొని మీ కవిత పారిజాతాలు చదివితే పువ్వులులేని పారిజాతం చెట్టునుంచి పూలవాసన వచ్చింది. దాని పూలులేని లోటు మీ కవిత తీర్చింది. మీ పుస్తకాలలో విశేష మేమిటంటే పారిజాతాలు ప్రొద్దు తిరుగుడు వ్రాసినంత రమ్యంగా దారిద్ర్యాన్ని గురించి, ఆకలిని గురించి, వ్యసనాలను గురించి వ్రాశారు. అంటే మీకు పువ్వులూ, అన్నం సమానంగా అవసరం. సౌందర్యం, సాంఘిక సంక్షేమ రసానుభూతి ఉపయోగంకూడ సమానంగా అవసరం. మీ పెరట్లో పూలు, కూరగాయల మొక్కలున్నవి. ఒకటి శరీర ఆకలిని, రెండోది మానసిక ఆకలిని తీరుస్తాయి. ఈ సత్యం మీ పుస్తకంలో సుందరంగా అభివ్యక్తమైనందుకు మిమ్ములను అభినందిస్తున్నాను. విశేషమేమిటంటే ఈ పుస్తకాన్ని పువ్వులతో ప్రారంభించి పువ్వులతో ముగించారు. ప్రభు గేయం నాకు చాలా నచ్చింది. అందులో విరాట స్వరూపాన్ని వర్ణించాగు. కాలం గేయం విశిష్టమైనది.

మీ కథల్లో శ్రేయం, ప్రేయం రెండూ ఉన్నాయి. ఈ కథలన్నీ చాలా బాగున్నాయి. మీ కథలన్నిటిలోకి ఏది గొప్పదో తేల్చి చెప్పమంటే చెప్పలేక యున్నాను. ఎందుచేత నంటే దేని విశిష్ట గుణం దానికి యున్నది."

శ్రీ సంజీవదేవ్ గారు 'వసంత సంధ్య' అన్న చిత్రం నాకు కానుకగా ఇచ్చారు. ఆ చిత్రానికి ఫ్రేం కట్టించి అప్పు

రూపంగా యింట్లో పెట్టుకున్నాను. ఇటువంటి అభిప్రాయాలు నా కెంతో ఉత్సాహాన్ని, బలాన్ని ఇచ్చి కార్య సాధనకి పురికొల్పుతాయి.

రచయిత్రులకి కూడ నా పుస్తకాలు రిజిస్టర్ పోస్టులో పంపాను. కొంతమంది రచయిత్రులు సమాధానం కూడ వ్రాయలేదు.

## రచనలు - ప్రశంసలు

నేను స్త్రీలనుగూర్చి, స్త్రీల సమస్యలనుగూర్చి వందకు పైగా వ్యాసాలు వ్రాశాను. ఇవి చాలా పేపర్లలో అచ్చయినవి. యిందులో కొన్నింటిని ఏరి ఒక పుస్తకం క్రింద తేవాలనుకున్నాను. కానీ ప్రింటింగ్ ఛార్జీలు, కాగితం ధరలు పెరిగి పోవుటచే తేలేక ఊరుకున్నాను. పరివర్తన అన్న నా కథ ప్రతిధ్వని పేపరువారు నిర్వహించిన కథల పోటీలో ఉత్తమకథగా ఎన్నికైంది. కల్పసుందరి అన్న నా కథ అభిసారికలో అచ్చయింది. ఆకథ అచ్చయినపుడు అభిసారిక ఎడిటర్ సోదరులు శ్రీ రాంషాగారు తెలుగు సాహిత్యంలో ఇది ఉత్తమమైన కథ అన్నారు. యిప్పటికీ నేను విద్యార్థినే! యింకా సాహిత్యంలో ఎంతో నేర్చుకోవలసింది ఉన్నదని పిస్తుంది. రచయితలంటే ప్రజలలో చాలా గౌరవం ఉంది. వారిని ఒక ప్రత్యేక వ్యక్తి కింద పరిగణిస్తారు. వారి రచనలు చదివి అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూంటారు. వీలయితే రచయితతో మాట్లాడి ఆయా విషయాల మీద చర్చిస్తూ ఉంటారు. సభలలో సమావేశాలలో రచయితల ఆటోగ్రాఫ్ కోరుతూ వుంటారు. యిలా పాఠకులతో పరిచయము

రచయితకి ఆనందాన్ని, గర్వాన్ని కలిగిస్తుంది. తోటి రచయితల దగ్గర్నుంచో, సాహిత్య సంస్థలనుంచో, పాఠకులదగ్గర్నించో, పేపరువారి దగ్గర్నించో, యిలా తరచు నాకు ఉత్తరాలు వస్తుంటాయి. యించు మించు ప్రతిరోజు నాకు పోస్టు వస్తుంది. రోజూ పోస్టుకోసం ఎదురు చూస్తూవుండడం ఒక సరదా! తరచు సభలలో, సమావేశాలలో మాట్లాడమని ఆహ్వానాలు వస్తూంటాయి. ఊళ్ళో జరిగే కవి సమ్మేళనములలో, సభలలో సమావేశాలలో రచయితకి ఎప్పుడూ పిలుపే! రోటరీ క్లబ్ వారు కాకినాడలో మీటింగ్ పెట్టి నాచేత కవిత్వము మీద మాట్లాడించారు. ఆనాటి ఉపన్యాసము విన్న రసజ్ఞులు చాలా బావుందని అచ్చు వేసి ఒక ప్రశంసాపత్రం యిచ్చారు. అది చాలా భద్రంగా దాచాను. కాకినాడలో ఫీల్డ్ పబ్లిసిటీ పబ్లిక్ రిలేషన ఉమెన్ వెల్ ఫేర్ వారు మమ్మల్ని తరచు పిల్చి సభలు పెట్టి కవితలు చదివించేవారు. జాతీయ పండుగ దినాలలో పిలిచేవారు. పారితోషికాలుకూడ ఇస్తుండేవారు. రచయితలందరిపీ ఫొటోలుకూడ తీసేవారు.

రచయిత మిత్రులతోగాని, పాఠకులతోగాని, సాహిత్య చర్చలు జరుపుతుంటే గంటలకు గంటలు కాలమే తెలియదు. సాహిత్యాన్ని ఇంగ్లీష్‌లో జలసీ ఆర్ట్స్ అంటారు. సాహిత్యంలో బాగా పడిన వాళ్ళు యింకో విద్య ఉన్నా దాన్ని వాళ్ళు అలక్ష్యం చేసేస్తారు. సాహిత్యమే అతని జీవితాన్ని అంతా ఆక్రమించుకు కూర్చుంటుంది. సాహిత్యం పువ్వులంగా ఉన్న విద్యార్థి ఉన్నాడు అనుకోండి. అతను దాంట్లో పడిపోయి విద్యను అలక్ష్యం చేసేస్తాడు. ఒక డాక్టరు మంచి సాహిత్య పరుడైతే అతనికి డాక్టర్ వృత్తికన్నా సాహిత్యం

మీదే మోజు చాలా ఎక్కువ. ఏదైనా మొత్తం మీద సాహిత్యం అన్నిటికన్నా మిన్నగా రచయిత జీవితాన్ని ఆక్రమించుకొని కూర్చుంటుంది. యింకో దానికి చోటు ఇవ్వదు. నేను విశాలాంధ్రలో గుమాస్తా అన్న కథలో గుమాస్తాలు, వారి జీవితాలు, పై అధికారులు వీళ్ళని ఎలా చూసేది ఇదంతా వివరిస్తూ వ్రాశాను. ఈ కథ చదివాక కొందరు నన్ను అడిగారు-మీరెప్పుడైనా జాబ్ చేశారా? అని. నేనెప్పుడూ జాబ్ చేయలేదు. పత్రికలలో నా వ్యాసాలు చదివి మరి కొందరు మీరు యమ్. ఎ. చదివారా అని అడిగారు. ఎన్నో మంచి రచనలు, కథలు, కవితలు, వ్యాసాలు 45 దాకా పేపర్ల వారి దగ్గర పోయాయి. తిరుగు స్టాంప్స్ జత చేసినా కొంతమంది పేపర్ వారు రచనలు వేయకపోతే వెయ్యక పోయారుగానీ, మళ్ళీ తిప్పికూడ పంపరు. అసలు మనము పంపిన రచనలు వేసేదీ లేనిదీ చాలా నెలలకుకూడ చెప్పరు. వేసినదీ లేనిదీ తెలియదు. ఇంకో పేపరుకు పంపడానికి వీలుండదు. ఈ మధ్య ఈవ్స్ వీక్లీకి నాదొక గేయం పంపాను.

అది సరిగ్గా వారం రోజులకి తిరిగి వచ్చింది. ఆ గేయం మీద ఈ గేయం మీకు తిప్పి పంపుతున్నాము సంపాదకుల అనుమతితో అని లేకపోతే నేను నిజంగా అందలేదు అనుకుందును. యిలా వారాల్లో కాకపోయినా నెలకిగానీ రెండు నెలలకిగానీ రచయితకు ఏమాటా చెప్పవలసిన బాధ్యత పత్రికలకు ఉన్నది. యికనైనా ఈ సత్ సాంప్రదాయాన్ని పాటిస్తారని ఆశిస్తున్నాను. నేనొకసారి శ్రీ శంకరాచార్యుల వారి సూత్ర భాష్యంలోని జీవి, జననం, మరణం, పుట్టుక వీటి విషయాలను తీసుకొని ఒక వ్యాసం వ్రాసి ఒక పత్రికకి

పంపాను. కొన్ని నెలలు చూసి ఆ పత్రికవారికి వ్రాస్తే పోయింది రచన అన్నారు. ప్రాణము ఉసూరుమంది. సూత్ర భాష్యం వంటి గొప్ప పెద్ద పుస్తకాన్ని చదివి మళ్ళీ రచన చేయడమంటే కష్టం. యింకా మంచి రచనలు ఎన్నో పోయాయి. కాకినాడలో శ్రీ నేమాని శ్రీరామమూర్తి సిద్ధాంతిగారనే ఒక గొప్ప జ్యోతిష్కుడున్నారు. నేను ఎక్కువగా జాతకాలు చూపించుకోను. ఎందుచేతంటే జాతకాలు నిజమైతే అవుతాయి లేకపోతే లేకపోవచ్చు. ఒకసారి శ్రీరామమూర్తిగారు మాయింటికి వచ్చారు. నేను వారితో జాతకంగురించి, రచనల గురించి మాట్లాడుతున్నప్పుడు ఆయన ఇలాఅన్నారు. "మీవారు ఆమధ్య మాఇంటికి మీ జాతకం తీసుకొచ్చారు. అప్పటికి మీరు రచనలు అవి చేస్తారని నాకు తెలియదు. జాతకం చూసి మీవారిని "ఈవిడ రచనలు చేసి ఉండాలని" అడిగాను. మీజాతకంలో విద్యా స్థానంలో శుక్రుడున్నాడు. బృహస్పతి కన్నా శుక్రుడు 200ల రెట్లు తెలివైన వాడు. అందుకనే మీకు యింత సాహిత్యం, రచన అదీను. రాజాస్థానాలు ఉంటే మీరు శిబికలుమీద ఆందోళికల మీద తిరుగుతూ గౌరవించ బడవలసిన జాతకం మీ" దన్నారు. అన్ని గ్రహాలు వుండవలసిన స్థానాలలో వుండి శుభ లక్షణ సమన్వితులై ఉన్నాయి. నా చిన్నప్పుడు మా నాన్న గారు వ్రాయించిన నా జాతకంలో యిలా వుంది. ఈ అమ్మాయి సౌధాలలో నివసిస్తుందని. అది నిజమైంది. విశాఖపట్నంలో మా అత్తవారిల్లు రెండంతస్తుల పెద్దమేడ. ఎకరం నేల జాగాలో కట్టబడింది. కె జి హెచ్ డౌన్‌లో బీచ్‌కి వెళ్ళేదారిలో వుంది. పెద్ద గదులు, విశాలముగా కిటి

కీలు, తలుపులు, ఏకరం జాగా ఉన్న ఆయింటిలో క్రిందినుంచి చూసినా మేడమీదించి చూసినా, ఎటు చూసినా, ఎదురుగా వున్న పెద్ద సముద్రం, కెరటాలు కనబడతాయి. హోరుమన్న సముద్రము ఘోష వినిపిస్తుంది. నేను పెళ్ళి అయిన క్రొత్తలో మేడెక్కి వరండాలో గోడదగ్గర నిలబడి ఆ సముద్రాన్ని, వెనక్కి ముందుకొస్తున్న కెరటాల్ని కాసేపు చూస్తూండేదాన్ని. ఎండాకాలంలో ఎండకూడ అక్కడ తెలియదు. రోహిణి కార్తెలోకూడ చల్లగా ఉంటుంది. దోమల బాధ వుండదు.

కాకినాడలో గాంధీ నగరంలో మేము కట్టుకున్న సొంత డాబా కూడా చాలా పెద్దది. విశాలమైన హాలు, పాలిషు చేసి తళ తళ మెరుస్తున్న టేకు తలుపులు, ముందర పోర్టికోతో అందంగా ఉంటుంది.

## పుస్తకముద్రణ-కష్టాలు

పుస్తకం వ్రాయడం ఎంత కష్టమో అది అచ్చు వేయించడం కూడా అంతే కష్టం! ధనవ్యయం గాక చాలా శ్రమ పడవలసి వస్తుంది. ప్రూఫ్‌లు చూడడం, ముఖచిత్రాన్ని ఎన్నిక చేయడం, అది ఏ రంగులో బావుంటుందో ఆలోచించడం తర్వాత పుస్తకాలు అన్నింటినీ పంపిణీ చేయడం వీటికి చాలా శ్రమ పడవలసి వస్తుంది. పబ్లిషర్సు అందరూ కథలు, కవితలు, పద్యాలువద్దు నవలలు కావాలంటున్నారు. ఇప్పుడు చాలామంది పాఠకులు కులాసాగా తేలికగా కాలక్షేపానికి పనికివచ్చే నవలలే కావా లంటున్నారు. అలాకాక

పత్రికలు, పాఠకులు కూడ సమాజ వాస్తవికతను ప్రతిబిం బించే ఉత్తమమైన సాహిత్యం కావాలని కోరుకుని ఆదరిస్తే మంచి రచనలు ఎక్కువగా వస్తాయి.

## జీవితంలో కష్టాల్నలా వదిలేద్దాం

నా జీవితంలో కష్టాలున్నాయి. ఆపదలు వచ్చాయి. విపత్కర పరిస్థితుల నెదుర్కొన్నాను. అనారోగ్యంతో బాధ పడ్డాను. ఈ బాధలన్నింటిలో సాహిత్యం తోడుగా నిల్చింది. సరే! ఈ కష్టా లన్నిటిని అలా వదిలేద్దాం!

## మా ఇంట్లో చిన్నపాపాయి

ఈ రచన చేస్తున్నప్పుడు మా యింట్లో ఒకచిన్న పాపాయి పుట్టింది. తెల్లగా అందంగా ఉంటుంది. దాని పురిట్లోనే ఈ రచన ప్రారంభించాను. ఇది పుట్టిన శుభ సందర్భంగా పదవ నాడు పంచదార చిలకలు ఊళ్ళో వాళ్ళకి పంచాము. పద కొండవ నాడు బారసాల చేశాము. వాళ్ళనాన్న శ్రీ దుగ్గి రాల విజయరామయ్య (సి. ఏ. ) శ్రీదేవి అని నామకరణం చేశారు. మా రెండవ అమ్మాయి లక్ష్మికి (ఎమ్. ఏ) మొదటి పాప తను. ఈ పాప అమ్మమ్మలా రచయిత్రి అవుతుందో, పెద్దమ్మలా డాక్టరే అవుతుందో కాలమే నిర్ణయించాలి. మనుమరాలు పుట్టేసరికి అమ్మమ్మ ఆత్మ కథ వ్రాయడంలోకి దిగింది.

# ఆడవాళ్ళు రచనచేయడంలోని సాధకబాధకాలు

నేను ఏ సమయంలోనైనా రచన చేస్తాను. నాకు మూడ్ అక్కర్లేదు. అసలు ఆడవాళ్ళు ఇంటిని, భర్తని, పిల్లల్ని, ఇవన్నీ చూసుకుంటూ రచనలు చెయ్యడం కష్టమైన పనే. మగవాళ్ళు అయితే రాసుకోవాలన్నప్పుడు చక్కగా వారి గదిలో కూర్చుని ఏ ఆటంకము లేకుండా రాసుకుంటారు. ఆడవారికి అలా సాగదు. పిల్లలు చిన్న పిల్లలుగా ఉన్నప్పుడు మరీ కష్టము! ఏదో మూల వ్రాసుకొని కాగితాలు బల్ల మీద పెట్టి వంటింట్లోకి వెళ్తే ఇంతలో ఏ నాలుగేండ్ల పిల్లవాడో అప్పటిదాక అమ్మ వ్రాసేస్తోంది, మనము వ్రాయకపోవడం ఏమిటని ఆ కాగితాల నిండా పెన్‌తో పిచ్చి గీతలైనా గీసేస్తాడు. లేదా బల్ల మీదున్న ఇంకు బాటిల్ తీసి కాగితాల నిండా వంపేస్తాడు. కర్మచాలక ఏ రోజు వంట పాడయినా, ఆఫీసు నుండి వచ్చే సరికి కాఫీ కలవడం ఆలస్యం అయినా శ్రీ వారి సాధింపులుండనే వుంటాయి. "నీ కిల్లు, సంసారం పడితే కదా! ఎప్పుడూ కథలు కాకర కాయలు! మొగుడు ఎలా పోతే నీ కేమి అవసరం?' అన్ని పన్లు అయ్యాక అర్ధరాత్రి అయినా కూర్చుని రాద్దామనుకుంటే భార్యలని అలా రాసుకోనిచ్చే వాళ్ళెంత మంది? ఊళ్ళో ఏ సాహిత్య సమావేశాలకైనా ఏ మహిళా సమాజ మీటింగ్ కైనా వెళ్దాం అనుకున్నాం అనుకోండి. సరిగా మన యింటి పనుల్ని ఆదరా బాదరా తెముల్చుకుని జోడు తొడుక్కుంటున్న సమయానికి హఠాత్తుగా ఏ బంధువో వస్తారు. వారిని గుమ్మంలో దిగ విడిచి మనం వెళ్ళలేం కదా! లేకుంటే అప్పటి దాక

వస్తున్న పని మనిషి అవాళే మానేస్తుంది. అది, ఇది కాక పోతే ఇంట్లో పిల్లలకి ఎవరికో జ్వరాలో ఏవో తీవ్రంగా వస్తాయి.

గుడివాడలో నేను ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల సభలకి వెళ్దా మనుకున్నప్పుడు మా రెండవ అబ్బాయికి టైఫాయిడ్ జ్వరము వచ్చింది. టెంపరేచర్ కూడ ఎక్కువైంది. పిల్లాడికి జ్వరంగా వుంది, రాలేనని శ్రీమతి నాయని కృష్ణకుమారికి టెలిగ్రాం యిచ్చాను. రెండు రోజులకి జ్వరం కొంచెం తగ్గే సరికి వెళ్ళాను అనుకోండి! ఆడవాళ్ళు వ్రాస్తున్నారని కొంత మంది యిదై పోతారు గానీ మగవాళ్ళలా ఆడవాళ్ళకి వ్రాసుకోడానికి సౌలభ్యము, రచయితకి లోకానుశీలన, అభ్యాసం, సహజంగా పుట్టుకతో వచ్చే ప్రతిభ వుండాలి. చుట్టూవున్న సమాజాన్ని, ఇతర ప్రపంచాన్ని పరిశీలిస్తే గానీ సహజమైన రచనలు రావు. ఏ ఏ ప్రదేశాలకైనా వెళ్ళి అక్కడ పరిస్థితులు అన్నీ ఆకళింపు చేసుకొని రచనలు చేద్దామంటే స్త్రీలను పంపేవారు ఎంతమంది ఉంటారు? ఎక్కడకో పంపటము ఎందుకు? ఊళ్ళోనే సాహిత్య సభలకి తరుచు భార్య వెళ్తుంటే ఆమోదించగల మగవాళ్ళు ఎంతమంది ఉంటారు? రచయితలకి బాగా పైకి వెళ్ళడానికి అవకాశం ఉంటుంది. తోటి రచయితలతో సాహిత్యం గురించి, సమాజ పరిస్థితి గురించి చర్చిస్తారు. రచయిత మిత్రులతో కలసి పైఊళ్ళకి వెళ్ళి, ఆ మిత్రుల్ని ఆహ్వానించి రోజుల తరబడి వాళ్ళతో సాహిత్యం గురించి చర్చిస్తారు. ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతారు. ఇవన్నీ ఆడవాళ్ళకి వీలవుతాయా? రచయిత్రులు, రచయితలు తరుచు ఉత్తరాలు వ్రాస్తుకుంటే కొందరి భర్తలకు

ఇష్టం ఉండదు. ఆఫీస్ నుంచి వచ్చిన తర్వాతైనా వాళ్ళకి తీరుబడి ఉంటుంది. ఇంటిపని ఉండదు. కాన్పులు, పిల్లల్ని పెంచడం ఇవేమీ వుండవు. అందుకని హాయిగా ఏకాగ్రతతో వ్రాసుకోగలరు. ఆడవాళ్ళు ఇబ్బందుల మధ్యనే వ్రాయాలి.

కొంతమంది నిజానికి చాలా ప్రతిభగల రచయిత్రులు ఉంటారు. కానీ వాళ్ళని యింట్లో వాళ్ళు ఆదిలోనే అణిచేస్తారు. పురాతన కుటుంబాల్లో మరీను! పెళ్ళవక ముందు తల్లిదండ్రుల కథలు వ్రాసిన అమ్మాయి పేరు పేపర్లోకి ఎక్కితే పెళ్ళవడం కష్టమని అనుకుంటారు. ఈ 1978 సంవత్సరంలో కూడా ఇది జరుగుతున్న నిజం. ఒక అమ్మాయికి కవితలు, కథలు వ్రాయడంలో ప్రతిభ వుంటుంది. ఊళ్ళో సభలకు, సమావేశాలకు వెళ్తుంటే పెళ్ళికాని వాళ్లు తిరగటం మంచిది కాదంటారు ఇంట్లోవాళ్ళు. ఇంకా ఆడవాళ్ళు ఏదైనా కథలో కొంచెం చొరవగా ప్రేమ విషయాల గురించి వ్రాసినా దీనికి, పెళ్ళి జీవితాలకి ఏ సంబంధముందా అని ఆరా తీస్తారు కొందరు. అందుకే కొంతమంది ఆడవాళ్ళు ఏం వ్రాయాలన్నా జంకుతారు. ఏం అపవాదులొచ్చి పడతాయో అని. రచనలో అనుభూతి పల్కాలి లైబ్రరీ నుంచి పుస్తకాలు తేవడం దగ్గర్నించీ పోస్టులో ఉత్తరాలు పడేయటం, కార్డులు, కవరులు తేవటం పుస్తకాల్ని బుక్ పోస్టు చేయడం యిలాంటి పనులకికూడా మొగవాళ్ళమీద ఆధారపడుతుంటారు కొందరు స్త్రీలు. ఈ పనులకి ఆడవాళ్ళు బయటకి తిరగకూడదని కొందరి మగవాళ్ళ ఉద్దేశ్యం. ఇలా చాలా సాధకబాధకా లుంటాయి రచయిత్రులకి.

ఎన్నో బాధలున్నా వ్రాయాలని తీవ్రంగా కాంక్ష

ఉన్నా వాళ్ళని ఏమీ ఆపలేవు. మనం మంచి రచయిత అవ్వగానే సరికాదు, సహృదయతకూడ ఉండాలని శరత్ యిలా అంటాడు :

## రచయితలు - సహృదయత్వం

రచయిత రచన బాగే అతని ఆంతర్యం కూడా ఒక సుందరమైన పుష్ప గుచ్ఛంలా అలరారాలని, ఇట్టి సహృదయత తనకున్నదా లేదా అని ఎవరికి వారే ప్రశ్నించుకోవాలి. కొంతమంది తామేం వ్రాసినా గొప్ప రచయితలమని, పక్కవారు ఏం వ్రాసినా అది లోప భూయిష్ఠమని అనుకొంటారు. అవతలి వారి రచనలోని లోపాలు ఎంచడం ప్రధానాంశంగా పెట్టుకొంటారు. వీళ్లైతే అవతలి వ్యక్తిని కించపరుస్తారు. కానీ వ్రాస్తే వాళ్ళనెప్పుడు నిరాశపర్చరాదు ప్రోత్సాహం ఇవ్వాలి. ఎవరిలో అయినా లోపాలు కనిపిస్తే సున్నితంగా సహృదయంతో చెప్పాలి. ఆ రచన ముగింపు ఈ రీతిగా ఉంటే బాగుంటుందనో, ఎత్తుగడ ఇంకోలా ఉంటే బావుంటుందనో, భాష ఇలా ఉంటే సరళంగా ఉంటుందనో చెప్పాలి. ఈ రచయితకి అసలు ఓనమాలు రావు, ఎందుకూ పనికిరా డనకూడదు. కొంతమంది పెద్ద రచయితల దగ్గరకి ఇప్పుడే రచనలోకి ప్రవేశించిన యువ రచయితలు వస్తారు. తమ రచనలు సరి చూసి పెట్టమనో, ఏమైనా సలహా లివ్వమనో. మన తీరుబడిని బట్టి ఆ పనులు చేసి పెడుతూ ఉండాలి పాఠకుల నుంచి తోటి రచయితల నుండి ఉత్తరాలు వస్తుంటాయి. జవాబివ్వడం మర్యాద. నేను చిన్న వారికైనా పెద్ద

వారికైనా త్వరలో జవాబిస్తాను. ఉత్తరాల కెప్పుడూ సమాధానం ఇవ్వకుండా వుండను. ఎవరైనా మంచి రచన చేస్తే వారిని ప్రశంసిస్తూ వ్రాస్తాను. రచయిత అయినంత మాత్రాన మనమేదో గొప్పవాళ్ళమన్న అహంభావం పనికిరాదు. తోటి రచయితలని పైకి రానీయకుండా అణచి వేయడం అసలేమంచిపని కాదు. సహృదయత లేని రచయిత ఎంత గొప్ప రచయిత అయినా అతను ఉత్తమ వ్యక్తి కాడు. అతని కన్నా ఏ ఊరుపేరు లేకపోయినా మంచి గుణాలున్న మామూలు వ్యక్తి ఉత్తముడు. అందుకని రచనా రంగంలో మనకన్నా బాగా వ్రాసేవారిని చూసి ఈర్ష్యపడడం గాని, చిన్నవారిని గూర్చి సభలలో, సమావేశాలలో, పేపర్లో హేళనగా మాట్లాడడం గాని, మన చేతిలో అధికారం వుంటే తక్కువ రచయితల్ని పైకి రానీయకుండా అణచివేయడం మంచిపని కాదు. "చావుపుటకల మధ్య సందేహంలాంటి జీవితంలో నలువైపులా అంధకారం. మంచి గంధంలా పరిమళించే మానవత్వం మాకున్న ఒకే ఒక అలంకారం" అంటాడు తిలక్. ఆశ్రయింపుల్ని, అంకితాన్ని, పదవి, ధనం, రాజకీయ పార్టీల్ని బట్టి కాక ప్రతిభలను బట్టి అవార్డులు, ప్రైజులు ఇవ్వాలి. మనలో రాసేవాళ్ళు చాలామంది ఉన్నారు. కానీ రచనలు గూర్చి తెలిపే పుస్తకాలు లేవు. అసలు రచనంటే ఏమిటి? కథలు ఎలా ఉండాలి? కవితలు ఎలా వ్రాయాలి? వచన కవితలు ఎలా వ్రాయాలి? నవలలు ఎలా ఉండాలి? ఈ ఆధునిక రచనా ప్రక్రియలను గూర్చి తెల్పే పుస్తకాలు చాలా తక్కువగా ఉన్నాయి. వీటిని గూర్చి రచనలు కూడ పేపర్లలో అతి తక్కువగా వస్తున్నాయి. వర్ధమాన రచయి

తలు ఎదగడానికి పనికివచ్చే సాహిత్య గ్రంథాలు మనకు చాలా తక్కువగా ఉన్నాయి. వీని కొరత తీరాలి.

కొన్ని ఊళ్ళలో సాహితీ సంస్థలు రచయితల్ని పిలిపించి సాహిత్య విషయాల మీాద మాట్లాడమంటారు. తరుచు సాహిత్య గోష్ఠులు జరుపుతారు. ఇది వర్ధమాన రచయితలకి ఉపయోగకరంగా ఉంటుంది.

## రచనలు - వచన కవిత్వం

మొదటిలోనే ఎవరూ పెద్ద రచయితలై పోరు. మన రచన కొన్ని పేపర్ల నుంచి తిరిగి వచ్చినంత మాత్రాన విచారించ వలసిన పనిలేదు. ఇంగ్లీషులో గొప్ప రచయిత అయిన ఆర్. కె. నారాయణన్‌గారి రచనలు కొన్నిసార్లు తిరిగి వచ్చాయట. మన రచన సరిగ్గా ఉందో లేదో అని చూసుకోవాలిగాని పేపర్లనుంచి తిరిగి వచ్చినంత మాత్రాన రచన బాగోలేదని అర్థంకాదు. ఇంకా నేడు చాలామంది వచన కవిత్వం అంటే సులువు అనుకుంటారు. కర్త, కర్మ, క్రియల్ని అటు, ఇటు పేర్చేసి కొన్ని ప్రాసలను వాడితే అది కవిత్వం అయిపోతుం దనుకుంటారు. ఇది చాలా తప్పు. న్యాయానికి వచన కవిత్వం వ్రాయడం చాలా కష్టం! ఇప్పుడు నన్ను నుంచున్న పళంగా కథ వ్రాయమంటే వ్రాస్తాను. నవల మొదలుపెట్టమంటే మొదలు పెట్టచ్చు. వ్యాసం సంగతి సరేసరి! వ్యాసం అన్నప్పుడు మంచి వ్యాసం వ్రాయడం అంత సులువు కాదని ఒప్పుకోవాలి. ఆశుధార వున్న వాళ్ళు నుంచున్న పళంగా పద్యం చెప్తారు. మంచి వచన కవిత్వం మటుకు నుంచున్న పళంగా చెప్పడం అంటే కొంత

తలు ఎదగడానికి పనికివచ్చే సాహిత్య గ్రంథాలు మనకు చాలా తక్కువగా ఉన్నాయి. వీని కొరత తీరాలి.

కొన్ని ఊళ్ళలో సాహితీ సంస్థలు రచయితల్ని పిలిపించి సాహిత్య విషయాల మీద మాట్లాడమంటారు. తరుచు సాహిత్య గోష్టులు జరుపుతారు. ఇది వర్ధమాన రచయితలకి ఉపయోగకరంగా ఉంటుంది.

## రచనలు - వచన కవిత్వం

మొదటిలోనే ఎవరూ పెద్ద రచయితలై పోరు. మన రచన కొన్ని పేపర్ల నుంచి తిరిగి వచ్చినంత మాత్రాన విచారించ వలసిన పనిలేదు. ఇంగ్లీషులో గొప్ప రచయిత అయిన ఆర్. కె. నారాయణన్‌గారి రచనలు కొన్నిసార్లు తిరిగి వచ్చాయట. మన రచన సరిగ్గా ఉందో లేదో అని చూస్కోవాలిగాని పేపర్లనుంచి తిరిగి వచ్చినంత మాత్రాన రచన బాగోలేదని అర్థంకాదు. ఇంకా నేడు చాలామంది వచన కవిత్వం అంటే సులువు అనుకుంటారు. కర్త, కర్మ, క్రియల్ని అటు, ఇటు పేర్చేసి కొన్ని ప్రాసలను వాడితే అది కవిత్వం అయిపోతుం దనుకుంటారు. ఇది చాలా తప్పు. న్యాయానికి వచన కవిత్వం వ్రాయడం చాలా కష్టం! ఇప్పుడు నన్ను నుంచున్న పళంగా కథ వ్రాయమంటే వ్రాస్తాను. నవల మొదలుపెట్టమంటే మొదలు పెట్టచ్చు. వ్యాసం సంగతి సరేసరి! వ్యాసం అన్నప్పుడు మంచి వ్యాసం వ్రాయడం అంత సులువు కాదని ఒప్పుకోవాలి. ఆశుధార వున్న వాళ్ళు నుంచున్న పళంగా పద్యం చెప్తారు. మంచి వచన కవిత్వం మటుకు నుంచున్న పళంగా చెప్పడం అంటే కొంత

కష్టమే! కర్త, కర్మ, క్రియల్ని అటు, ఇటు పేర్చి చెప్పడం కాదు వచన కవిత్వం. దానికి ఛందస్సు అవసరం లేదు. పూర్వ కవుల్లా శబ్దాడంబరాలు పనికి రావంటున్నారు ఆధునికులు. ఎడ తెగని సమాసాలు పనికిరావు. ఇంక కేవలం సరళమైన భాషలో అర్థవంతమైన పదాలతో ప్రతి లైను నిగ్గుదేరి భావస్ఫూర్తిగా వుండాలి. అందం, ఆనందంతో పాటు అభ్యుదయాన్ని కల్గించాలి.

కనుక మంచి వచన కవిత వ్రాయడం కష్టమే అని ఒప్పుకోవాలి.

"ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పర పీడన పరాయణత్వం —" అంటారు శ్రీ శ్రీ.

మహా ప్రస్థానంలోని ఈ కవిత చదువుతున్నప్పుడు పైకి మామూలుగా తేలికగా ఉంటుంది. నేనూ రాసేయగలను అని అనుకొంటాం. కానీ ఇలా మామూలు చిన్నమాటలతో కొద్ది లైనలలో మహార్థం దాగి ఉంది. యిలా చెప్పడం మహా కవులకే చేతనౌతుంది. అందరికీ రాదు. శ్రీశ్రీ, తిలక్ చేతిలో శబ్దాలు వంపులు తిరిగి అందాన్ని సంతరించుకుంటాయి. భాష వారి చేతులో ఒదిగిపోతుంది. శ్రీ తిలక్ తన కవిత్వము గూర్చి యిలా అంటారు.

"నా అక్షరాలు ప్రజా శక్తుల నావహించే విజయ
ఐరావతాలు
నా అక్షరాలు కన్నీటి జల్లులలో తడిసే దయా
పారావతాలు

నా అక్షరాలు ఈ వెన్నెలలో ఆడుకునే అందమైన
ఆడపిల్లలు!

ఎంత చక్కనైన ఊహ ఇది. పరికిణీలు, జాకెట్లు వేసుకొని పెద్ద జడ వేసుకొని, జడ గంటలు పెట్టుకొని చెవులకు జూకాలు పెట్టుకొని నుదుట బొట్టు, కళ్ళకు కాటుక పెట్టుకొని అందంగా, ఆనందంగా ఉత్సాహంతో వెన్నెలలో ఆడుకొనే ఆడపిల్లలు మన కళ్ళ ముందు కన్పిస్తారు. అభ్యుదయం, అందం, ఆనందం ఉన్నాయి తిలక్ కవిత్వములో. మేము సాహిత్య లహరి తరఫున వేసిన ఇంద్రధనస్సు కథా సంపుటిలో మేము ఏడుగురు రచయితలం కలసి ఏడు కథలు వ్రాశాము అన్నాను గదా! అందుకని ఆ పుస్తకానికి ఇంద్రధనస్సు అని పేరు పెట్టాము. నేను చాలా రోజులు ఆ పుస్తకాన్ని ఎవరైనా రచయిత మిత్రులకు యిచ్చినప్పుడు ఈ తిలక్ కవితను ఆ పుస్తకంపై వ్రాసేదాన్ని. "ఆగామి ఆశల వర్షాగగనం మీద అదిగో ఆనందం అనే ఇంద్రధనస్సు, అలముటించే లోకానికి అండగా నిలుస్తుంది, నవకవి వచస్సుధా సుమనస్సు."

ఇంక ప్రాచీన కవులు పోతన, శ్రీనాథుడు, పెద్దన, మొల్ల, కవిత్రయం ఇంకా అటువంటి మరి కొంతమంది పెద్ద కవుల గ్రంథాలు కూడ మనం చదవటం అవసరం. దానివల్ల భాష మీద ఆధిపత్యం బాగా లభిస్తుంది.

## మా తాతగారు - వారి ధర్మకార్యాలు

మా తాతగారు రెబ్బాప్రగడ రామయ్యగారు, నాలుగు వందల ఎకరముల భూస్వామి. రాజమండ్రిలో పెద్ద మేడ,

చిన్న మేడ ఉండేది. బజారులో కొట్టు (షాపులకి అద్దెకిచ్చేది) ఉండేది. కొవ్వూరులో రెండిళ్ళు, ఇంకా ఇళ్ళ స్థలాలు, తోటలు, భూములు ఉన్నవి. కోరు మామిడిలో, ధర్మవరంలో పెద్ద పెంకుటిల్లు ఉండేది. మా నాన్నగారికి మూడు వందల ఎకరాల భూమి, తోటలు, మేడలు, కొట్లు, ఇళ్ళ స్థలాలు చాలా ఆస్థిని ఇచ్చారు. మా బామ్మగారు సీతమ్మ గారు చాలా ఉత్తమురాలు. ముగ్గురు మరుదుల్ని, ఆడపడుచుల్ని ఆవిడే పెంచి పెద్ద చేశారు. వాళ్ళకి పెళ్ళిళ్ళు చేసి, పురుళ్ళు పోసి, వాళ్ళ సంసారాలు చాలా మటుకు చూశారు. మా తాతగారు రామయ్యగారు ఎంతో మంది బీదవాళ్ళకి పెళ్ళిళ్ళు, వడుగులు చేయించారు. కొవ్వూరులోని శంకర మఠానికి, శివాలయానికి భూమి వ్రాసిచ్చారు. శంకర మఠం ఉత్సవాలు వైశాఖ మాసంలో అనుకుంటాను జరిపేవారు. నృసింహ జయంతినాడో, మర్నాడో మా సంతర్పణ ఉండేది. పిండివంటలతో అందరికీ భోజనాలు పెట్టేవారు. విసనకర్రలు, మామిడి పళ్ళు ఇచ్చేవారు. నేను కూడ వెళ్ళేదాన్ని. శంకరాచార్యుల వారికి పూజచేసి మంత్ర పుష్పం చెప్పేటప్పుడు మటుకు మంత్రం పుష్పం వేరే ఉంటుంది. అది చెప్పేవారు. "వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థహా యతయః శుద్ధ సత్వాహా" అని. దీనిని తెలుగులో పద్యం కింద వ్రాశాను. "యతులు వేదాంత వివరణ మందు నిశ్చయాత్మకమ్మగు బుద్ధి." ఇది యతుల మంత్ర పుష్పం. శంకరాచార్యుల వారి సూత్ర భాష్యము వావిళ్ళవారు తెలుగులో అచ్చు వేశారు. నేను కొంత మటుకు చదివాను. శ్రీ అప్పారావుగారు ఆయన పుస్తకము వేసిన అట్టమీద శంకరాచార్యుల వారి శ్లోకం యిలా

వ్రాసేవారు. దాని తెలుగు అర్థమిది. ఆయన దేవిని స్తుతిస్తూ ఇలా అంటారు. "అమ్మా! లోకంలో ఎక్కడైనా చెడ్డ కుమారుడు వుంటాడు గానీ చెడ్డ తల్లి ఉండదు గదా!" అని. భారతీయులు తల్లికి చాలా గౌరవమిస్తారు. తల్లి వ్యభిచారి అయినా సరే ప్రశ్నించే హక్కు పిల్లలకి లేదు అని ధర్మ శాస్త్రాలు చెప్పాయి. ఎవరైనా సన్యాసము పుచ్చుకొంటే వాళ్లు ఎవరికీ నమస్కరించ నక్కరలేదు ఆఖరికి తండ్రికి కూడ! తల్లికి మాత్రము నమస్కరించాలి. ఈ శరీరం వృద్ధి చెంది పెంపొందటానికి తల్లి కారణం. శ్రీ శంకరాచార్యుల వారు మహా మేధావి. మహాకవి. అద్వైత మత స్థాపకుడు.

## వేదాంత విషయాలు

మనకు మూడు శరీరాలుంటాయి. స్థూలశరీరము పైకి కనపడేది. ఇది జాయతే, వర్థతే, పరిణతే అంటే పుట్టుతుంది పెరుగుతుంది పరిణామం పొందుతుంది. "భస్మాంతాని శరీరాణి". అంటే ఆఖర్న భస్మంచేత అంతమవుతుంది. ఆకలి దప్పులు సూక్ష్మ శరీరానివి. శరీరం నశించినా ఇది ఉంటుందని భారతీయ సిద్ధాంతం. శోకమోహాలు కారణ శరీరానివి. సూక్ష్మశరీరానికి మూలమైనది కారణ శరీరం. కారణ శరీరానికి శోకమోహాలు ఉంటాయి. ఈ మూడు శరీరాలు మనకు ఉంటాయి. ఈలోకమునందు మోహము నశించి ఎవరైతే ఆత్మస్వరూపాన్ని తానని తెలుసుకొని జ్ఞాన నిష్ఠులై ఉంటారో ఇంద్రియాన్ని జయించి తపోమార్గంలో ఉన్నవారు ఈ భవబంధాల్నించి తప్పించుకుంటారు. జనన మరణ రహితమయిన పరమాత్మయందే లీనమై పోతారు.

షాయింట్లో మా నాన్నగారు దసరాలో దేవీనవరాత్రులు చేసేవారు. పూజ అయ్యాక మంత్రపుష్పం చదివేవారు. అందులో "నీవార శూకవ ర్తన్వీ పీతాభాస్వత్యణూపమా తస్యాయా శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః సబ్రహ్మ సశ్శివః." అంటే హృదయపద్మంలోని నీవార ధాన్యపుముల్లు కన్నా సూక్ష్మంగా తేజస్సుతో పరమాత్మ వెలిగి పోతుంటాడని. అతనే బ్రహ్మ, శివుడు, రుద్రుడు, విరాటస్వరూపుడని అర్థం. మంత్రపుష్పం చాలా గంభీరంగా ఉచ్ఛైస్వరంతో గానం చేస్తారు.

## త్రామిక ధర్మరాజ్య సిద్ధాంతం గురించి కొంత వివరణ

మా నాన్నగారు కారల్ మార్క్స్ సమసమాజ సిద్ధాంతాలు కొన్ని, శంకరాచార్యుని అద్వైతవాదం, గాంధీ సిద్ధాంతాన్ని తీసుకొని సమన్వయం చేస్తూ "త్రామిక ధర్మ రాజ్యము" అనే కొత్త సిద్ధాంతాన్ని రూపొందించారు. చాలా గ్రంథాలు చదివి రీసెర్చ్ చేసి కనిపెట్టిన సిద్ధాంతం యిది. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతన ఆంధ్రా యూనివర్సిటీలో ఈ సిద్ధాంతంపై ఉపన్యసించారు. మన దేశంలో పండితులు మేధావులు రాజకీయవేత్తలు, చాలా మంది ఈ సిద్ధాంతాన్ని ప్రశంసించారు. మూడో ప్రపంచ యుద్ధం రాకుండా వుండాలంటే ఇటువంటి సిద్ధాంతం చాలా అవసరం అని పెద్దలన్నారు. మా నాన్నగారు ఒక జెండా కూడ ఈ సిద్ధాంతానికి రూపొందించారు. దాని అర్థాన్ని తెలిపే వచన కవిత కూడ వ్రాశారు.

# ఆదర్శంగా తీసుకోవలసిన ఏకపత్నీవ్రతుడు

మా నాన్నగారు మనుచరిత్రలో "అటజనిగాంచె భూమి సురుడంబర చుంబిత" అనే పద్యాన్ని అప్పుడప్పుడు ప్రీతిగా చదివేవారు. ఈ పద్యంలో ఒక లయ ఊపు ఉంటుంది. ఉరకలు పరుగులు వేస్తూ హిమవత్ పర్వతంనుంచి గంగా నది ప్రవహిస్తున్నట్లుగా ఉంటుంది. ఈ పద్యం అంటే నాకు చాలా ఇష్టం.

ఉ॥ ఆపురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షా పరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీ
క్షా పర తంత్రుడంబురుహ గర్భ కులాభరణుం డనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్య తనూ
విలాసుడై.

ప్రవరుని అందాన్ని చిత్రిస్తూ ఆఖరున ఒక్కమాటలో కొట్టేస్తూ అలేఖ్యతనూవిలాసుడై అన్నారు పెద్దనగారు. ప్రవరాఖ్యుని చిత్రించిన పెద్దన ఇంతలు కన్నులుండ తెరువెవ్వరు వేడుదు భూసురేంద్ర అన్న పద్యాన్ని కూడా రసజ్ఞులు మెచ్చుకుంటారు. 'ఇంతలు' అన్న పదంలో ఔచిత్యం ఉందంటారు. వరూధిని వంటి అందమైన అప్సరస్త్రీ కామించి, కౌగలించుకున్నా కూడా చలించని మనోనిగ్రహం కలవాడు ప్రవరుడు. తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియల్ అంటాడు ప్రవరుడు. అతను ఏకపత్నీ వ్రతుడు. శ్రీరామ చంద్రుని ఏకపత్నీ వ్రతాన్ని వాల్మీకి మహాకవి రామాయణంలో చిత్రించాడు. ఏకపత్నీవ్రతుడైన ప్రవరుడు, శ్రీరామ చంద్రునిలాంటివారు తక్కువగా ఉంటారు.

# శ్రీరామకృష్ణ పరమహంస

ఈ యుగంలో శ్రీ రామకృష్ణ పరమహంస భార్య దగ్గర ఉండి కూడా బ్రహ్మ చర్యంగా ఉన్నాడు. యిలాంటి పురుషులు దేవుళ్ళలో కూడా లేరు. బహుశా అలాంటి వారు ప్రపంచంలో ఎక్కడా లేరు. పరిపూర్ణ ఆరోగ్యవంతుడై భార్య దగ్గరే ఉన్నా సంసార సుఖం అనుభవించ కుండా ఇంద్రియ నిగ్రహం ఉన్న ఏకైక మనీషి ఆయనే. ఆయన శ్రీ శారదా దేవిని తన దగ్గరకు వచ్చినపుడు ఇలా అడిగాడు. "నన్ను సంసార మాయలోకి దించుట నీ అభీష్టమా?" అని. అందుకావిడ "కాదు. మీకు పారమార్థిక మార్గంలో సహాయ పడడానికి వచ్చా" నని చెప్పారు. అలా భర్త దగ్గరే ఉండి ఆనందంతో పరిపూర్ణ బ్రహ్మచర్యం అవలంబించిన ఉత్తమ మహిళ శారదాదేవి. శ్రీరామకృష్ణ పరమహంస గ్రంథాలన్నీ చాలా ఉత్తమంగా ఉంటాయి. అవి ఎంతో అభేద్యమైన విషయాలు కూడా చిన్న ఉపమానాలతో సులువుగా బోధిస్తాయి. శారదాదేవి యిలా అన్నారు. ఎవ్వరూ పొద్దస్తమానం జపతపాలతో కూర్చోలేరు. అందుకని వివేకానందుడు రామకృష్ణ పరమహంస మఠాల్ని స్థాపించాడు. అవి సేవా కార్యక్రమాలు చేపడుతున్నాయి. స్వామి వివేకానందుడు భారతీయ ఆధ్యాత్మికతను ప్రపంచం అంతా బోధించాడు. శ్రీ అరవిందుడు కూడా గొప్ప ఆధ్యాత్మిక సంపన్నుడైన వ్యక్తి. ఆయన వ్రాసిన కావ్యం సావిత్రి చాలా గొప్పదని చెప్తారు. నేను విశాఖపట్టణంలో మహారాణి పేటలోని రామకృష్ణపరమహంస మఠానికి వెళ్తూండేదాన్ని,

నేను ఒకసారి నా పద్యాలు వినిపించినపుడు స్వామిజీ ఒక పుస్తకం నాకు బహూకరించారు. మఠంలో శ్రీ రామకృష్ణ పరమహంస పెద్దఫొటో ఉంటుంది. ఆయన చూపులు అలౌకికంగా ఉంటాయి. ఎదురుగా ఎప్పుడు పెద్ద పెద్ద కెరటాలతో కల్లోలంగా ఉండే మహాసాగరం ఈ సంసారాన్ని జ్ఞాపకం చేస్తోంది. ఆ సముద్రం గర్జిస్తూ క్రిందికి మీదికి ఉరకలు వేస్తూ ఎంత ఆటు పోటులతో వుంటుందో ఎదురుగా ఉన్న శ్రీ రామకృష్ణపరమహంస చూపులు అంత నిశ్చలంగాను, ఈ ప్రపంచంతో తనకి సంబంధం లేనట్టుగాను అతీంద్రియ వ్యక్తి లాగ ఉంటాడు. సంసారంలో ఎల్లప్పుడు వచ్చే కష్ట సుఖాలకి తట్టుకొని మనం కూడా అంత నిశ్చలంగా ఉండాలి- అని ప్రబోధిస్తున్నట్లుంటుంది. మనం కూడా ఆత్మ స్వరూప జ్ఞాన సంపన్నులమై ఉండాలని చెప్పినట్లు నా కనిపిస్తుంది.

## సౌందర్యం

సృష్టిలో కష్టాలు బాధలే కాక సౌందర్యంకూడా ఉంది. ప్రభాతవేళ ఉదయిస్తున్న గులాబీ, తడిసిన పారిజాతం మల్లెలలో ఎంత అందం దాగి ఉంది! రాత్రి వెలిగి పోయే నక్షత్రాలు, నీలాకాశం ఇవన్నీకూడా మనకి ఎంత ఆనందాన్నిస్తున్నాయి! మన కష్టాల్ని అన్నిటిని వీటిని చూస్తూ మర్చిపోవా లనిపిస్తుంది. మన కష్టాల్ని మనలోనే దిగమింగుకొని ఎదుటివారికి చిరునవ్వే పంచి ఇవ్వాలని మహాత్ములన్నారు. అందాన్ని గురించి చెప్పినప్పుడు శ్లోకాలు కూడా జ్ఞాపకం వస్తున్నాయి. పెళ్ళిళ్ళలో చదివే మహా సంకల్పంకూడా చాలా సౌందర్యంగా అందంగా ఉంటుంది.

అందులో నదీనదులు, భారతదేశపు ఎల్లలు, వ్యాస వాల్మీకి వంటి మహాకవులందరు వస్తారు. ఆ తమసా నదీతీరాన్ని మాలినీ నదీతీరాన్ని తల్చుకుంటే ఒళ్ళు పులకరిస్తుంది. ఆ కణ్వుడు, వాల్మీకి ఎంత దయామయులు, పవిత్రులు.

## కాకినాడ సాహిత్యసభలో

కాకినాడలో సాహిత్య లహరి సంస్థకు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వచ్చారు. అప్పుడు మేమందరం కలిసి ఆయనతో ఫొటో తీయించుకున్నాము. సాయంత్ర సమయం ఆయన రోడ్డుకేసి చూస్తూ కాకినాడ చాలా సుందరమైన నగరం అన్నారు. నన్ను చూసి మీరు బాగా చదువుకున్నారు. పండితుల కుటుంబం మీది అన్నారు.

శ్రీకృష్ణదేవరాయలు అష్టదిగ్గజాలతో ఆనాటి సభను చూపించే భువనవిజయంకూడా చాలా బావుంటుంది. శ్రీ జమ్మలమడక మాధవరాయ శర్మగారు తిమ్మరుసు పాత్రని ధరించారు. ఆయన ఆపాత్రని చాలా సమర్థవంతంగా పోషించారు.

సాహితీవేత్తలకి పండిత పామరులకి భువనవిజయం చాలా బావుంటుంది. కాకినాడలో చూశాను ఇది. అష్టావధానం కూడా మానవుల తెలివితేటలకి మేధస్సుకి పాండిత్యానికి, జ్ఞాపక శక్తికి పరాకాష్ఠ. నేను కాకినాడలో శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావుగారు, దివాకర్ల వెంకటావధాని గారు ఇంకా కొంతమందిని చూశాను. వీరు సమర్థవంతంగా నిర్వహించారు.

# శ్రీ అల్లూరి సీతారామరాజు

మా నాన్నగారు కొంతకాలం యుగధర్మ అనే పత్రికని ఇంగ్లీష్, తెలుగు భాషలలో నిర్వహించారు. మా నాన్నగారి గురించి మళ్ళీ కొంత చెప్తాను. అల్లూరి సీతారామరాజుగారి సహచరులు గంటందొరో, మల్లుదొరోగాని మా నాన్నగారి దగ్గరికి కొన్నాళ్ళు వచ్చారు. వారితో మాట్లాడేవారు. నాన్నగారు తన గ్రామికధర్మరాజ్య సభాసమక్షాన విశాఖజిల్లాలో కృష్ణదేవిపేటలో గంటందొర దహన పవిత్ర క్షేత్రాన 1950లో వేదికను, శిలాశాసనంను నిర్మించారు. ఇచ్చట రామరాజ గ్రామిక ధర్మరాజ్య కేంద్రంకూడా నెలకొల్పారు. ఇది కొండజాతి సేవ చేయాలని ప్రారంభించారు. శ్రీ అల్లూరి సీతారామరాజు వంటి యోగిని, వీరుని కన్న భారతమాత ఆంధ్రమాత ఎంతో ధన్యురాలు.

ఆమధ్య శ్రీకాకుళం జిల్లా స్త్రీ సమాజంవారు ఉమస్సు సావనీర్ వేస్తున్నప్పుడు పూజ్యులు శ్రీ మహీధర జగన్మోహనరావుగారు ఆ సావనీర్‌కి నన్ను సీతారామరాజు గురించి, నాన్నగారు కొండజాతివారికి చేసిన సేవగురించి వ్యాసం వ్రాయమన్నారు. 'ఆదివాసికి అరుణోదయం' అనే వ్యాసం వ్రాశాను. మా నాన్నగారున్నప్పుడు ఒకసారి సుప్రసిద్ధ నటుడు శ్రీ ఎన్. టి. రామారావుగారు అల్లూరి సీతారామరాజు చిత్రం నిర్మిస్తానని వివరాలు కోసం మా నాన్నగారి దగ్గరి కొస్తానని వ్రాశారు. ఎందుకో ఆ చిత్రం నిర్మించలేదు. మళ్ళీ నాన్నగారి దగ్గరకు రాలేదు.

# నాన్నగారి కాంగ్రెస్ చరిత్ర

రాజమండ్రిలో బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసం (మన దేశంగురించి) విని మానాన్నగారు ఉత్తేజితులయ్యారు. తిలక్ స్వరాజ్య నిధికి మానాన్నగారు తన వంతు 6 వేలు రూపాయలు వసూలుచేసి ఇచ్చారు. చిన్నప్పుడు నాన్నగారు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి నడిపిన రచనల పోటీలలో బంగారు పతకం పొందారు. ఆయన ఉపన్యాసాలు ఉత్సాహంగా, ఉత్తేజంగా ఇచ్చేవారు. అప్పుడు స్వరాజ్య ఉద్యమంలో మానాన్నగారు ఊరూరా తిరిగి ఉపన్యాసాలిచ్చారు. పల్లెటూళ్ళలోని రైతులందరు బొజ్జలు తడుముకుంటూ ఆహా ఓహో అనేవారుట. సహాయ నిరాకరణోద్యమంలో బ్రిటిష్ ప్రభుత్వం ఆస్తులు జప్తుచేసినా పన్నులు కట్టలేదు. మా అమ్మగారు తనకున్న బెనారస్ పట్టుచీరలు, ఇంకా పట్టు చీరలు విసర్జించి ఖద్దరు బట్టలు కట్టారు. ఒకసారి నేను అప్పారావుగారితో ఇలా అన్నాను. "ఏమండీ! ఎవరు మానాన్నగారి గురించి చెప్పినా ఆయన ఎంత దేశభక్తుడు, త్యాగధనుడు, నిస్వార్థపరుడు అంటారు. ఇంకోరకంగా ఎవరూ అనరు" అన్నాను. మీనాన్నగారిని గురించి మంచిగా కాక ఇంకోరకంగా ఎలా అంటారమ్మా అన్నారాయన.

శ్రీ నాన్నగారు పోయినపుడు సుప్రసిద్ధ రచయితలు శ్రీ చలంగారు ఉత్తరం నా కిలా వ్రాశారు. మీకు తండ్రి గానే కాక ఒక ప్రాణమిత్రుని పోయినట్టుందని. అందరిలాగే నాన్నగారు చనిపోయారు. ఆయనకు మరణం ఉంటుందా అనిపించేది. చాలారోజులు బెంగ పడిపోయాను నేను. ఊళ్ళో

కూడా ఆయనంటే చాలా గౌరవం ఉండేది. ఎంత పెద్ద వాళ్ళయినా కలెక్టర్ దగ్గర్నుంచి ఆయన కబురు పెడితే చాలు వచ్చేవారు ఇంటికి.

## నా నవలగురించి

తిరగబడ్డ నవతరం అన్న నా నవల జయశ్రీ మాస పత్రికలో ప్రచురిస్తున్నప్పుడు జయశ్రీ సబ్ ఎడిటర్ కొండపనేని ఉమామహేశ్వరరావుగారు నాకిలా వ్రాశారు. ఆ నవల తనకి చాలా నచ్చిందని, నాటకం కింద రూపొందిస్తా మని, విజయవాడ రేడియో వారికి ప్రసార నిమిత్తం ఇస్తా నని నా అనుమతి కావాలని వ్రాశారు. ఆ నాటకం ఇంకా వెలుగు చూడలేదు. జయశ్రీలో తిరగబడ్డ నవతరం ప్రచు రించినప్పుడు మొదట సంచికలో నా గురించి పరిచయం సుప్ర సిద్ధ జర్నలిస్ట్ సోదరులు శ్రీ జి. వి. యల్. నరసింహారావు గారు వ్రాశారు. ఆయన ఒకసారిలా అన్నారు. "మనిషి బుద్ధి ఎంత వరకు ఆలోచిస్తుందో అంతవరకు ఆలోచిస్తారు మీరు." వీరు నా సన్నిహిత మిత్రులు. భరతమాత బిడ్డలం అనే నా గేయం సుప్రసిద్ధ గాయకులు శ్రీ కపాలేశ్వరరావుగారు హైదరాబాదులో రేడియోలో పాడే పిల్లలకి నేర్పించా వన్నారు. బాపుంది అని వ్రాశారు. నేనువ్రాసిన మరికొన్ని పాటలు కొందరు మిత్రులు పాడుటకు బాగున్నాయి, పాడతా మన్నారు. నేనుకూడా నా పాటలు కొన్ని పాడి టేప్ చేశాను.

ఇటీవల విశాఖపట్నంలోనున్న విశాఖ వాలీ బిల్డింగ్ సొసైటీ ప్రెసిడెంటు శ్రీ వి. ఆర్. గుప్తాగారు నాకిలా

వ్రాశారు. వారు త్వరలో ఫిల్మ్ స్టుడియో నిర్మించబోతున్నారని నా కథాసంపుటిలో కథలు తనకి చాలా నచ్చాయని వాటిని సినిమాకింద తీయాలని ఉందని, ఇంగ్లీష్ పిక్చర్ లా కొద్ది గంటలు మాత్రము ఉండే సినిమాలు తీయాలని చూస్తున్నానని మీకథలు అందుకు అనువుగా ఉన్నాయని అన్నారు.

## ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల సభలు - సన్మానాలు

నేను గుడివాడలో ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభకి వెళ్ళాను. అందులో నేను పాల్గొనవలసి ఉంది. అప్పుడు రాష్ట్రపతి శ్రీ జాకీర్ హుస్సేన్ మరణించారు. సభలు పూర్తిగా జరగలేదు. రాజమండ్రిలో జరిపిన రచయిత్రుల మహాసభలో కూడ పాల్గొన్నాను. సుప్రసిద్ధ సినీనటి, గాయకురాలు, రచయిత్రి శ్రీమతి భానుమతీరామకృష్ణ, నేను, మరికొందరు ఆరోజు సభలో మాట్లాడాము. ఆ సభలో రచయిత్రులకి జరీచీరలు, వెండికుంకుమ భరిణెలు ఇచ్చి సన్మానం చేశారు. భానుమతీరామకృష్ణ ఇంకాకొందరు, కలిసి ఫొటోలు తీయించుకున్నాము. యువతీ యువకులందరూ రచయిత్రులను ఆటోగ్రాఫ్ అడుగుతారు. పరిచయంకోసం తహతహ పడ్తారు. ఆమధ్య ఎవరో అన్నారు. సినీతారల తరువాత ప్రజలలో రచయిత్రులంటేనే గ్లామరు వుందని. రచయిత్రులు వారి మనస్సులో తొంగిచూడడం, వారిఆవేదనని, ఆనందాన్ని పంచుకోవడం ఇందుకు కారణం కావచ్చు.

కాకినాడ దగ్గర మల్లాం సాహిత్యసభలో నేను, సుప్రసిద్ధ సంఘసేవకులు, రచయిత్రి, రంగరాయ మెడికల్, కాలేజీ లెక్చరర్, సోదరి శ్రీమతి చిరంజీవినీకుమారి కలసి

వెళ్ళాం. మల్లాం సాహిత్య సభలో ఉపన్యసించాను. శ్రీ. కె. వి. కొండలరావుగారు, తూర్పు గోదావరి జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్ మమ్మల్ని ఆహ్వానించారు. వారు సభలో నన్ను గులాబీ రంగు కాశ్మీరు శాలువాతో సత్కరించారు. వారు మంచి సాహిత్య పరులు. సేవా కార్య క్రమాల్ని చేపట్టిన వారు. ఆ వేళ సభలో నేను కవిత్వము మీద ప్రసంగించాను.

నా శరీర ఆరోగ్యం సహకరించక పోవుటచే ఎక్కు వగా పై ఊళ్ళోని సభలకి, సమావేశాలకి వెళ్ళడం లేదు. నా గేయాలు కొన్ని ఇంగ్లీషు పత్రికల్లో ప్రచురింప బడ్డాయి. రేడియోలో ప్రసారితం అయ్యాయి. నేను ఎంత అనారోగ్యంగా ఉన్నా, భయాల్లో, బాధల్లో, కష్టాల్లో సాహిత్యాన్ని విడువను. ఈ జీవితంలో, ఈ లోకంలో ఎదు రయ్యే బాధలు, కష్టములు అన్నీ మరచి పోవటానికి, ఎది రించటానికి సాహిత్యాన్ని తోడు తెచ్చుకున్నాను. సాహి త్యం నిజంగా ఒక అపూర్వమైన వరం. తెచ్చుకుందామన్నా అందరికీ రాదు. కవిత్వం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం ఈ నాలుగు పుట్టుకతో రావాలిగాని, నేర్చుకుంటే వచ్చేవి కావని పండితులు అన్నారు. శ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతం అందరూ పరిశీలించ వలసినది.

## మా నాన్నగారి శ్రామిక ధర్మరాజ్యం గురించి కొంత చెప్తాను

మా నాన్నగారు శ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతములో పని చేయటానికి యువకులు, స్కాలర్స్ అయిన శ్రీ పేరి

సర్వేశ్వర శర్మగారు, (ఎమ్. ఎ.), శ్రీ వంగల కృష్ణదత్త శర్మ గారు (ఎమ్. ఎ.) వచ్చారు. ఇంకా అనేకమంది పెద్దలు, యువకులు, పండితులు కూడా ఈ సిద్ధాంతం మీద నమ్మకం వుండి దీన్ని గురించి కృషి చేశారు.

హేగెల్ భావ వాదాన్ని తాను తల క్రిందులుగా అన్వయం చేస్తున్నానని మార్క్స్ అన్నాడు. హేగెల్ భావ వాదానికి భారతీయ సిద్ధాంతం మూలం. ఈ విషయం నాన్న గారు చెప్పారు. దేశంలో, ప్రపంచంలో ఎక్కడ చూచినా అల్లకల్లోలం అశాంతి. ఎన్నో సిద్ధాంతాలు, రాజకీయ పార్టీలు. ఇటువంటి సమయంలో దేశం అంతా ఒక మంచి సిద్ధాంతాన్ని ఎన్నుకోవాలి. విజ్ఞానులైన స్కాలర్స్, రాజకీయ నాయకులు, మేధావులు అందరూ శ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతంలోని మంచిని గ్రహించాలి. ఆ సిద్ధాంతం మీద పరిశోధన చేసి దాన్ని వెల్గులోకి తీసుకు రావాలి. దీన్ని గూర్చి తేలిగ్గా అర్థమయ్యేలా మా నాన్నగారు చిన్న చిన్న పుస్తకాలు వ్రాశారు. యువతరం ఎక్కువగా ఈ రచనలు పరిశీలించాలి.

మా నాన్నగారు చదువుకొన్న అమ్మాయిల్ని చూసి చదువే కాదు ఆడవాళ్ళకి కావల్సింది. వంట! అది రావాలి. దోసెలు పల్చగా వేయడం మీకు వచ్చునా అనేవారు. నిజంగా వంట బాగా చేయడం కూడ ఒక కళే అని ఆయన అంటూ ఉండేవారు.

## మా అమ్మమ్మగారి గురించి

మా అమ్మమ్మ పార్వతమ్మగారు బంగాళా దుంపల వేపుడు బూరెల్లా ఎంత కమ్మగా వేయించేదని! నాన్నగారనే వారు. శుచి, శుభ్రం కూడ ఎక్కువే. పనివాళ్ళు చేస్తే నచ్చక సోపు సామాన్లు అవీ బావుచేసుకొనే వారు. మా యింట్లో ఒక తెల్లని గ్లాస్కో డోరియా రవిక నేను పెద్ద అయాక కూడా ఉండేది. ఇప్పటి లాగానే పొడుగు చేతుల జాకెట్టు అది. అది చేత్తో మా అమ్మమ్మగారు కుట్టినది. మిషను కుట్టంత సన్నగా ఉంది ఆవిడ చేతి కుట్టు. కల్లా కప టం ఎరుగని వ్యక్తి ఈమె.

## అందాలు-అలంకరణలు

అందంలో, అలంకారాలలో వెనుకటివి కొన్నిప్పుడు కొత్త రూపు దాల్చి వస్తున్నవి. అందరిలోకి మన తెలుగు వారి చీర కట్టు చాలా బావుంటుందని అంటారు. శ్రీనాథుడు తన గ్రంథాలలో మన తెలుగు జాతి ఆడపడుచుల కట్టు, బొట్టు, నగలతో సహా వర్ణించాడు.

తెలుగు భాష చాలా అందమైంది. తెనుగు నేల సిరి సంపదలకు నిలయం. తెలుగు వారిలో ఎంతోమంది మేధా వులు, శూరులు, కవులు, దేశభక్తులు వున్నారు. తెలుగు వారందరూ ఐకమత్యంతో ఉండి జాతిని, భాషను ఇంకా వెలుగులోకి తీసుకు రావాలి.

# నా రచనలకి పిల్లల సహకారం

ఇప్పుడు నాకు 47 వ సంవత్సరము నడుస్తోంది. 500 రచనలు చేశాను. ఇప్పటికి 25 ఏళ్ళనుండి సాహిత్య కృషి కొనసాగిస్తున్నాను. ఆంధ్రలో చాలా మంది రచయితలతో పరిచయం నాకు వుంది. వారికి, నాకు ఉత్తర ప్రత్యుత్తరాలున్నాయి. నేనేమంత గొప్పవ్యక్తిని కాను. గొప్ప చెప్పుకోడం కోసం ఈ ఆత్మకథ మొదలు పెట్టలేదు. నాకు తోచిన విషయాలు కొన్ని వ్రాశాను. చాలారోజుల బట్టి ఈ రచన చేద్దాం అనుకుంటున్నాన. ఈ మధ్యన అనారోగ్యం చేత ఎవరైనా వ్రాసే వాళ్ళుండ వలసి వస్తున్నది. మొన్న మా పెద్దబ్బాయి చి॥ గోపాలరావు (బి.ఎ.బియల్), కోడలు లలిత ఈ ఊరు వచ్చారు "అత్తయ్యగారూ! మీరూ వ్రాయకూడదూ ఆత్మకథ" అంది చి॥ సౌ॥ లలిత. "చాలా రోజులబట్టి వ్రాయా లనుకుంటున్నాను. వ్రాసిపెట్టే వాళ్ళు లేరు. నువ్వు వ్రాస్తావా?" అన్నాను. అలాగే వ్రాస్తానని నేను చెప్తుంటే కొంత భాగం వ్రాసింది. తరువాత మా ఆఖరు అమ్మాయి ఇందిర, మూడవ అమ్మాయి అరుణ వ్రాశారు.

నేను ఇటీవల అనారోగ్యంగా ఉండడంచేత చెప్పిన రచనల్ని వ్రాయడం, ఫెయిర్ చేయడం నా రచయిత మిత్రులకి ఉత్తరాలు వ్రాయడం ఆఖరు అమ్మాయి ఇందిర చేస్తోంది. ఈ పనిలో బాగా నలిగిందికూడా. మా మూడో అమ్మాయి అరుణకూడ చెప్పిన రచనల్ని వ్రాస్తూ ఉంటుంది. ఈ అమ్మాయి బొమ్మలు గీస్తుంది. మా రెండవ అబ్బాయి

వెంకటేశ్వర్లు ఉత్తరాలు పోస్టుచేయడం, బుక్సు పార్శిలు చేయడం, ప్రెస్‌నుండి ప్రూఫ్‌లు తేవడం చేస్తుంటాడు. మొదట్లో వీళ్ళు చిన్నవాళ్ళుగా ఉన్నప్పుడు పుస్తకాలు బుక్‌పోస్టు చేయడంగాని, రిజిష్టరు పోస్టుచేయడంగాని సరిగ్గా వచ్చేదికాదు. తీరా పుస్తకాలు కట్టి పోస్టాఫీసుకి తీసు కెళ్ళాక దారం సరిగ్గా కట్టలేదనో, జిగురు సరిగా అంటించ లేదనో మళ్ళీ ఇంటికి వెళ్ళి కట్ట మనేవారు. అలా చాలా సార్లు అవస్తపడ్డాను. ఇప్పుడీ పనులన్నింటిలో రాటుదేలి నారు. మా పెద్ద అమ్మాయి డా॥ రుక్మిణి, మా రెండవ అమ్మాయి లక్ష్మికూడ కొంచెం రచనలు చేస్తారు. చి॥ లక్ష్మాజీ ఎమ్. ఎస్‌సి. రెండవ సం ॥ చదువుతున్నాడు. నన్ను స్వంత తల్లిలా అభిమానిస్తాడు. మాయింట్లో ఒకడుగా కలసిపోయాడు. తను కూడ రచనలు చేస్తాడు. చదువులో ఫస్టు వస్తాడు; బుక్ సెల్లర్సు దగ్గరకి వెళ్ళడం, బుక్సు అమ్మ కం విషయం చేస్తాడు. శ్రీ డి. రాధాకృష్ణమూర్తిగారి అబ్బాయి. ఇటీవలే వివాహమైన మా పెద్ద అబ్బాయి వివా హానికి శ్రీ మంథా వెంకట రమణరావుగారు ఒక వచన కవిత పంపారు. అది అత్తలైన ప్రతి స్త్రీ చదవదగ్గది.

## అప్పగింతలు

నువ్వు నీ చిన్ననాడు తప్పటడుగులు వేసి
చిన్ని కృష్ణుడిలా ఆడినప్పుడు
నీ ఆటలు చూసి ఆనందించాను
ముద్దు ముద్దుగా ముద్దు పలుకులు పలుకగా

నీ పలుకులు విని పరవశించి పోయాను
నాకేసి అనురాగపు దృక్కులు సాగించినప్పుడు
ఆ ప్రేమకి ఆనందించి పోయాను
నీవు చదువులలో మిన్న వైనప్పుడు
ఆటలలో మేటి వైనప్పుడు
నీ ప్రయోజకతకి పులకరించి పోయాను !
ఇవన్నీ నువ్వు నాకిచ్చిన ఆనంద చంద్రికలే !
ప్రేమ ముత్యాలే !
నువ్వు పెద్దవాడవయ్యావు
ఓ యింటివాడ వయ్యావు
నాకింక నీనుంచి ఏమీవద్దు
నీఆనందమే నా పరమానందము.

## అత్తగార్ల ప్రవర్తన

చాలామంది తాము అత్తలము అయ్యేసరికి అదివరకు తాము పడిన కోడంట్రికాలు మరచిపోతారు. కోడళ్ళని బాధ పెట్టాలని చూస్తారు. కొడుకు కోడలిమాట వింటే బాధ పడ్తారు. కొంతమంది అత్తలు కొడుకు సంసారంలో కలతలు పెట్టి, కోడళ్ళని, కొడుకులనుకూడ వేరుచేస్తారు. కోడలు అవి ఇవి తేలేదని సాధిస్తారు. లాంఛనాలు సరిగ్గా తేలేదని దెప్పు తారు. ఇవన్నీ స్త్రీలు మానుకోవాలి. ఒక రచయిత స్త్రీకి స్త్రీనే శత్రువు అన్నారు. అలాకాకుండా మన స్త్రీలు హృదయ విశాలత్వమును నైర్మల్యత్వాన్ని పెంపొందించు కోవాలి. సంకుచితత్వాన్ని విడనాడాలి. ఒకరి దుఃఖాన్ని

తొలగించాలిగానీ, దుఃఖానికి హేతువు కాకూడదు. స్త్రీ, పురుషులు, పిల్లలు, పెద్దలు, మానవులందరూకూడ ఉత్తమ గుణాల్ని పెంపొందించుకోవాలి. నిత్యం ఆత్మ పరిశీలన చేసుకోవాలి. ఈ శ్లోకం మన కందరికీ శిరోధార్యం.

నత్వహం కామయే రాజ్యమ్
నస్వర్గం నా పునర్భవం
కామయే దుఃఖతప్తానమ్
ప్రాణినాం ఆర్తినాశనం.

దీనికి తెలుగు అర్థం యిది. నేను రాజ్యాన్ని కోరను. స్వర్గమునుకూడ కోరను. ఏమి కోరుతాను అంటే దుఃఖం చేత పీడితులైన ప్రాణులయొక్క ఆర్తిని నాశనం చేయడమే కోరతాను. నాకు కాళిదాసుని ఈ శ్లోకం ఎంతో యిష్టం.

## యోగము

శైశవేభ్యస్త విద్యానాం
యావ్వనే విషయేషిణాః
వార్ధక్యే మునివృత్తీనాం
యోగేనాన్తే తనుత్యజః

ఈ శ్లోకాన్ని సేకరించాను. ఈ శ్లోకాన్ని తరచు చదువుతుంటాను.

బాల్యమున విద్య లభ్యసింపంగ వలయు
యవ్వనమున విషయమ్ము లంట వలయు
వార్ధక్యమునందు మునివృత్తి బడయ వలయు
తనువు యోగమున విడుట తగునుᳵ దుదిని.

యోగహః చిత్తవృత్తి నిరోధహః - యోగమనగా చిత్తవృత్తులన్నీ నిరోధించడం. ఇంక యోగము అంటే అరిషడ్వర్గాలు అయిన కామ, క్రోధ, లోభ, మద, మోహ, మాత్సర్యములన్నీ నిగ్రహించి సత్శీలుడై చిత్తాన్ని అటు, ఇటు పోనీయక మంచిపనులందే దృఢముగా నిలపడం. "యోగః సుకర్మ కౌశలం" అని శ్రీకృష్ణుడు గీతలో సెలవిచ్చాడు. అంటే మనము చేసే పనులన్నీ జాగ్రత్తగా నిపుణతతో నిర్వహించాలి. ఇదే యోగం అనికూడ శ్రీకృష్ణ పరమాత్ముడన్నాడు. అంటే ఎవరు ఏ ఏ వృత్తులయందు నియమింపబడి ఉన్నారో ఆ వృత్తులయందు మనస్సును లగ్నం చేసి చాలా నిపుణతతో ఆపనిని నిర్వహించాలి. యోగశబ్దానికి ఈ రెండు అర్థాలు భగవానుడు సెలవిచ్చాడు. అందుకని యోగమనగా హఠయోగః, రాజయోగః యివేకావు. మన యొక్క చిత్తాన్ని అటు, ఇటు పోనీయక ఏకాగ్రత కలిగి చిత్తశుద్ధితో చేసేపనిని నెరవేర్చడం యోగాలే. ఇది అందరూ గుర్తుంచుకోవాలి. నే నివి రోజూ మననం చేసుకుంటాను.

## ప్రస్థానత్రయము

సూత్రభాష్యాన్ని, ఉపనిషత్తుల్ని, భగవద్గీతని కలిపి ప్రస్థానత్రయను అంటారు. వేదాలలో కర్మకాండను తెలిపే భాగాన్ని పూర్వమీమాంస అంటారు. జ్ఞానభాగాన్ని తెలిపే దానిని ఉత్తర మీమాంస అంటారు. సంస్కృతములో సూత్రభాష్యమును మానాన్నగారికి కొవ్వూరులో శంకర

మఠములోని స్వాములవారు ప్రతిదినము వచ్చి చెప్పేవారు. శంకరాచార్యులవారి మేధస్సు చాలా గొప్పది. సూత్ర భాష్యమును అర్థం చేసుకోవడం చాలా కష్టం. శంకరాచార్యులవారు యావద్భారతదేశము తిరిగి అన్ని మతాల వారిని వాదనలలో గెలిచి అద్వైతమతాన్ని స్థాపించారు, నాన్నగారు చెప్పేవారు. క్షణికవాదులని ఉండేవారు. ఈ క్షణంలో ఉన్నది నీవు. మరో క్షణంలో నీవు కాదు. క్షణక్షణం అణువులలో మార్పు వస్తుందని అన్నారుట. సాంఖ్యవాదం కూడా సైన్సుకు దగ్గరగా ఉంటుంది. కపిలుడు భాగవతంలో తల్లి దేవభూతికి సాంఖ్యయోగ సిద్ధాంతం బోధిస్తాడు. న్యాయ వైశేషిక మీమాంస వాదులున్నారు. ఇవన్నీ కూడ మానవుడు బుద్ధి వికసించి పరిశోధించి తెలుసుకున్న విషయాలు. బౌద్ధుల మాధ్యమిక వాదంకూడ నేను కొంత చదివాను. ఇవన్నీ చదువుతుంటే అసలు నేను, నేను కాదా అవునా అన్పిస్తుంది. ఆచార్య నాగార్జునుడు మాధ్యమిక సిద్ధాంతాల్ని ప్రవేశపెట్టినాడు. అన్నిమతాలు, శాస్త్రాలు చదివాక ఆఖరుసారిగా తేలేది ఈ విశ్వాన్నంతా నడిపిస్తున్న శక్తి ఒకటేనని, ఆ శక్తి నీలోవున్నదని. నీవు ఈ శరీరంచేత బద్ధుడైన జీవుడవు కావు. పరమాత్మ స్వరూపాన్ని అది నీకు బాగా ఆగూఢమయినప్పుడు ఈ జన్మ పరంపరలనుంచి విముక్తి అవుతుందని. అందుకని అద్వైతమతము "శివోహం, అహం, బ్రహ్మాస్మి" అనుకోమంటుంది. ప్రజ్ఞానం బ్రహ్మ, చైతన్యం, బ్రహ్మానందో బ్రహ్మ అంటుంది వేదం.

యోగులు ఆత్మస్వరూపాన్ని సాక్షాత్కరించుకొని అంత్యకాలమందు ఆత్మ స్వరూపనిష్ఠులై శిరస్సులో బ్రహ్మ

రంధ్రంగుండా ప్రాణం వదిలేస్తారని, వారికి పునర్జన్మ రహిత మైన మోక్షము సిద్ధిస్తుందని శాస్త్రము చెబుతుంది. యిలా యోగాభ్యాసం చేత ప్రాణము వదిలిన వారు రామాయణములో శబరి, మాతంగ మహర్షి కన్పిస్తారు. స్వచ్ఛంద మరణం పొందిన భీష్ముడు యోగంచేత ప్రాణాన్ని వదిలాడు. ఆయనలోంచి ఒక తేజస్సు వచ్చి పరమాత్మలో కలిసి పోయిందని మహాభారతం చెప్తుంది. విదురుడుకూడ అలా ప్రాణాలు వదిలేసినవాడే. రోగాలతో రొచ్చులతో తీసుకు తీసుకు ప్రాణాన్ని వదుల్తూ మృత్యువు సమీపించిందనే సరికి భయపడి అందర్నిచూసి కళ్ళమ్మట నీళ్ళెట్టుకుని ఈ బంధాలొదులుకోలేక బాధపడ్డంకన్నా వాళ్ళలా ఆనందంగా ప్రాణాన్నొదిలి ఆవిశ్వశక్తిలో కల్సిపోవడం ఎంత అదృష్టం! ఏ దేశంలో వారికైనా చివరికి మానవ జీవితం పరమార్థం అదే!

ఈమనస్సు చంచలం అయినది. గాలిలా అటు, ఇటు కదులుతుంటుంది. ఎలా దీనిని స్థిరంగా నిలపడం అని అర్జునుడు గీతలో శ్రీకృష్ణుడిని అడుగుతాడు. వైరాగ్యంచేత, అభ్యాసంచేత మనస్సుని జయించమని చెప్తాడు శ్రీకృష్ణుడు. భర్తృహరికూడ తన సుభాషితాలలో భోగే రోగభయం కులేచ్చ్యుతి భయం అంటాడు.

## ప్రబంధ పఠనం

నేను కాకినాడలో సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమర యోధులు, పండితులు, కవులు అయిన శ్రీ సోమంచి సూర్యనారాయణశర్మగారి దగ్గర కొన్నేళ్ళు ప్రబంధాలు, కావ్యాలు

చదువుకున్నాను. ఆయన రోజు సాయంత్రం మాయింటికి వచ్చి చదివి వినిపించి అర్థం చెపుతూ ఉండేవారు. తారా శశాంక విజయం, విజయవిలాసం, క్రీడాభిరామం, కాళహస్తీశ్వర మహాత్యం, శృంగార నైషధం, మనుచరిత్ర, దశకుమారచరిత్ర, కాళిదాసు మేఘసందేశము, పారిజాతాపహరణము ఇంకా మరికొన్ని కావ్యాలు చదువుకున్నాను. పాండురంగ మహాత్యం, ఆముక్తమాల్యద, శృంగార నైషధం కూడ కొంతభాగం, భారత, భాగవతాలుకూడ కొంతవరకు చదివాను. అందులో బావున్న పద్యాలు పుస్తకంలో వ్రాసుకొని కంఠతా పట్టేదాన్ని. ఇవన్నీ చదువుతున్నప్పుడు ఒక్కొసారి నిద్రలో వీటిలో పద్యాలుకాక ఏవో పద్యాలు మనస్సులో ఆశువుగా వచ్చేస్తూ ఉండేవి. రోజూ తీరిక వేళలోగానీ, రాత్రి పడుకోబోయే ముందుగానీ, ఇంట్లో అందరూ కూర్చొని ఎవరి అభిరుచిని బట్టి వారు పద్యాలుగానీ, కావ్యాలుగానీ, మంచి గ్రంథాలుగానీ, చదువుకోవాలి. ఏ పురాణం, శాస్త్రం, కావ్యం చెప్పినా అన్నీ మానవతని బోధిస్తాయి. ఉత్తమవ్యక్తుల జీవితచరిత్రను తెలుపుతాయి. మనిషిని వ్యసనానికి బానిసకావద్దని అంటాయి. సప్తవ్యసనాలంటారు. అంటే వీటిలో తాగుడు, జూదం, వ్యభిచారం, వేట, దొంగతనమేకాదు. ఎప్పుడూ పరుషంగా మాట్లాడటం, కఠినంగా దండించటంకూడ వ్యసనాలే అని మహాభారతం చెప్తోంది. కొంత మందుంటారు చూడండి. ఎప్పుడూ వాళ్ళ నోటమ్మట ఎదుటివార్ని బాధపెట్టే పరుష వాక్యాలే కానీ సౌమ్యంగా మాట్లాడరు. మరి కొంతమంది చిన్న తప్పైనా కఠినంగా శిక్షిస్తారు. తమక్రింద పనిచేసే వారినైనా

సరే తమ యింటిలో పనిచేసే వారినైనాసరే లేక ఎవరినైనా సరే! పిల్లల్ని అయినాసరే! ఈ విషయాల్నికూడ వ్యాస భగవానులు వ్యసనాలకిందే చెప్పారు. ఆయన బుద్ధి ఎంత నిశితమైనది! మానవ మనస్తత్వాన్ని ఎంత బాగా పరిశీలించారు! అందుకే కాళిదాసు తనకావ్యాన్ని రఘువంశాన్ని వ్రాస్తూ ముందుమాటగా మందమః కవియశః ప్రార్థిగమిష్యామ్యుపహాస్యతాం" అన్నాడు. అంటే వ్యాస వాల్మీకుల కీర్తిని తానందుకోలేనని కాళిదాసు అన్నాడు.

సంస్కృతంలో వ్యాసులవారు వ్రాసిన భాగవతాన్ని పోతనగారు మందార మకరంద మాధుర్యం ఒలికిస్తూ పద్యాల్లో ఆంధ్రీకరించారు. భాగవతంలోని పద్యాలు నేను చాలా వాటిని కంఠస్థం చేశాను. నేను పోతనగారి ఈ పద్యాన్ని కొంత మనస్సులో ఉంచుకొని—

("క్షోణితలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతు సైకతశ్రేణికిన్...
దోయజాత భవచిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ సుఖ వారిజ పుస్తక రమ్య పాణికిన్)

ఈ క్రింది పద్యం వ్రాశాను. ఈక్రింది పద్యాన్ని నీలాంబరాలు అనే వచన కావ్యంలో (నీలాంబరాలు పుస్తక రూపములో రావాలి) మొదటి పద్యంగా వ్రాశాను.

వాణిని సురసంశ్లాఘ్య గీర్వాణినిఁ గర
పల్లవ మృదుపాణిని నబ్జ భవుని రాణిఁ
గరయుగంబును మోడ్చుచు గదలకుండ
భక్తిభావమ్ము మీఱ నాసక్తిఁ గొలుతు.

ఈ మధ్య పద్య కవితకు కొంత ఆదరణ తగ్గింది. వచన కవిత ప్రాచుర్యంలో వుంది. సరే! ఏది ఏమైనా అందంగా ఆకర్షణీయంగా, అర్థవంతంగా చక్కని శైలిలో పద్యాలు వ్రాయడం,వచనకవిత వ్రాయడం కష్టమే. మన వచన కవితలో అప్పుడప్పుడు చిన్న చిన్న సూక్తులలో సత్యాలు యిమిడి ఉంటాయి. అవి ఎంతో బావుండి కలకాలం జ్ఞాపకం చేసుకో వలసినవిగా ఉంటాయి. ఆరుద్ర తన కవితలో ఒకచోట "మనం ఎక్కవలసిన రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు" అంటాడు. మనం అనుకొని ఆశించి ఎదురుచూసిన పని నెర వేరక పోయినా, లేకపోతే ఎప్పుడో ఆఖరికాలంలో నెరవేరినా మనకీ సూక్తి జ్ఞాపకం వస్తుంది. శ్రీ శ్రీ తన వచన కవితలో దోసెడు తీరుబాటు, పిడికెడు సానుభూతి చాలన్నాడు. ఇది కూడ మనకి అప్పుడప్పుడు జ్ఞాపకం వస్తుంది.

ఈ మధ్య కొందరు యువకులు కూడ మినీ కవితల్లో వచన కవిత బాగా వ్రాస్తున్నారు. ఏమైనా మంచి వచన కవితలు పేపర్లో పడినప్పుడు నేను కటింగ్స్ చింపి దాచు కుంటాను. అలా నన్ను ఆకర్షించిన ఈ గేయం చాలా రమణీయంగా ఉన్నదని యిక్కడ కొంత యిస్తున్నాను. ఆధునిక కవులలో శ్రీ ముదిగొండ శివప్రసాదు గారు కూడ చాలా అందంగా అర్థవంతంగా వచన కవిత వ్రాస్తారు. వారి వచన కవిత శబ్దముద్ర అన్నది చాలా సౌందర్యంగా, భావ స్ఫూర్తిగా ఉంటుంది. రస హృదయులు చదివి ఆనందిస్తారనే ఆ పెద్ద గేయంలోని కొంత భాగాన్ని యిస్తున్నాను.

# నాకు నచ్చిన ఉత్తమ కవిత - 'శబ్దసముద్ర'

వేలహంసలు, కల ధౌత పక్షాలు విప్పుకొని
వియత్తలం నుండి జారినప్పుడు
వేయి రేకుల కమలాన్ని చుంబించడం కోసం
విను వీధికి, చలువ కలువ క్రిందఉన్న చిలువ కన్ను లేచిన
వేల వాయులీనాలు వీణలూ నిశ్శబ్ద గాంధర్వాన్ని
విశ్వనాథ రూపాలు సంతరించుకొని ఆరు మెట్లపై
పలికించి నపుడు
ఉషస్సు ఆ సుముహూర్తంలో
అమృతం చిద్రుపలు చిద్రుపలుగా తోణికి
అక్షరాలుగా రాలి
అర్థాలుగా మారి
భావాలుగా తోచినపుడు
అమ్మా!
నీ అవతారం ఈ మృణ్మయ ఖండానికి
సుహాసిని!.........

ఈ గేయంలో యోగ శాస్త్రం కూడా ఇమిడి ఉంది. బొడ్డు దగ్గర కుండలినీ శక్తి శిరస్సులో ఉన్న సహస్రవాన్ని (సహస్ర దళ కమలం) చుంబించటం ఉంది.

సరస్వతీ దేవి ఉపాసన సారస్వతోపాసన రెండూ ఉన్నాయి. అసలు తెలుగు భాష చాలా అందంగా ఉంటుంది. మహాకవులు దాన్ని మరింత సుందరంగా చేస్తారు. శ్రీ విశ్వనాథ సత్యన్నారాయణ గారు కవిత్వంలోనే గాక వచన గేయం వ్రాయడంలో కూడా ప్రసిద్ధులు. వారి ఆంధ్ర

పౌరుషం అన్న కవిత చాలా మనోజ్ఞంగా ఉంటుంది. కొన్ని పాదా లిస్తున్నా.

గోదావరి పావనోదార పూర
మఖిల భారతము నా దన్న నాడు...
విమల కృష్ణానది సైకతముల యందు కోకిల పూబాట
పిచ్చుక గూడుకట్టే నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు

ఎంత అర్థవంతమైన భావమిది! ఎంత అందమైన పదాలివి! అందుకే దేశభాషలయందు తెలుగు లెస్స అన్నాడు శ్రీనాథుడు క్రీడాభిరామంలో. ఆ తర్వాత అప్పటి రాజులు కూడ కవుల నాదరించి గ్రంథాలు వ్రాయించారు. శ్రీకృష్ణదేవరాయలు కవుల నాదరించిన గొప్ప ప్రభువు. అంత మహా ప్రభువు అయివుండి పండితుల్ని తనతో సమానంగా గౌరవించాడు. శ్రీకృష్ణదేవరాయలు మహా ప్రభువులేకాక మహాకవి. ఆయన ఆముక్తమాల్యదలో ప్రజాజీవితాన్ని, చాలా పరిశీలించి మామూలువారుకూడ గమనించలేని ఎన్నో విషయాలు వ్రాశారు. ఆముక్తమాల్యదలోని "తలబక్షచ్ఛట గ్రుక్కి బాతువులు కేదారంపు......యూరెకులుప స్నాత ప్రయాత...వానిగని నవ్వు శాలిగోప్యోఘముల్." ఈ పద్యం నాకెంతో యిష్టం. దీన్ని చదివినప్పుడు రాయలవారి రాజ్యంలో దొంగతనాలు లేవని, రక్షకభటులు చాలా అప్రమత్తతతో వ్యవహరించేవారని నా కన్పిస్తుంది. ఆముక్తమాల్యదలో 'శయపూజాంబుజముల్' అన్న పద్యంకూడ నాకెంతో యిష్టం. శ్రీకృష్ణదేవరాయలు మరణించిన తర్వాత అతనినిగూర్చి పెద్దన్నగారన్న ఈ పద్యములు మానాన్న గారు చదువుతూ ఉండేవారు. నాకు కొంచెం జ్ఞాపకం ఉన్నది.

రాయలవారు ఎప్పుడైనా పురవీధులయందు పట్టపుటేనుగు నెక్కి సంచారము చేస్తుంటే పెద్దన్న ఎదురైనప్పుడు "ఎదురైనచో తన మద కరీంద్రము దిగి చేయూతనిచ్చి తన పట్టపు టేనుగుపై ఎక్కించుకొని సరసన కూర్చోబెట్టుకొని ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన్న" అని స్తుతించేవారు. అంతలా గౌరవించిన శ్రీకృష్ణదేవరాయలతో స్వర్గంలోకి వెళ్ళలేక జీవచ్ఛవములె బ్రతికి ఉన్నానని శ్రీకృష్ణ దేవ రాయలు పోయిన తర్వాత విచారిస్తాడు పెద్దన్న.

కవిసార్వభౌముడు శ్రీనాథుని జీవితంకూడ తన్నాదరించే రాజులు పోయాక చివరిదశలో కష్టాలతో గడిచింది. అతని చివరిదశలో చెప్పిన ఈపద్యం విద్వాంసులందరినోట వింటూనే ఉంటాము. "పంటని బిలబిలాక్షులు తినిపోయాయిట. టంకమేడు నూర్లు ఎట్లు చెల్లించ దినవెచ్చమే రాజు ప్రస్తుతింతు" అంటారు. శ్రీనాథుని పన్ను చెల్లించలేకపోతే అధికారులు బండకొయ్యవేసి శిక్షించారని వినికిడి. ఆఖరున శ్రీనాథుడు యిలా అన్నాడు. "దివిజ కవివరుల్ గుండెలు దిగ్గురనగా శ్రీనాథుడేగుచున్నా డమర పురికి!" చనిపోయే ముందుకూడ ఎంత రాజసం? ఎంత ఠీవి? చివరి జీవితం తల్చుకుంటే విచారమేస్తుంది. శ్రీనాథుడు యిక్కడ దినవెచ్చము అని తెలుగు, సంస్కృతము కలిపి కొత్తసమాసము (వైరిసమాసం) చేసినాడు. శ్రీనాథునికి ముందు శివకవులు ఇటువంటి ప్రయోగం చేశారు. సమగ్రాంధ్ర సాహిత్యగ్రంథ నిర్మాత ఆరుద్ర కూడ ఒక కవితలో "దినక్రొత్త" అని తెలుగు, సంస్కృత సమాసమును అందంగా చేశాడు. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం చాలా బాగా వ్రాశాడు.

ఇది చరిత్రైనా ఒక మంచి నవలలా విసుగు కలగకుండా ఆసక్తిగా చదివిస్తుంది. మహాకవులు శబ్దాలతో నూతన ప్రయోగాలు చేస్తుంటారు. శ్రీనాథుని చివరిదశలోని పద్యము వ్రాస్తున్నప్పుడు నాకొక విషయము జ్ఞాపకం వచ్చింది. ఇక్కడ చెప్పటం అప్రస్తుతం కాదనుకుంటాను. శ్రీ శ్రీ తిలక్ మరణించినపుడు ఇలా అన్నాడు. శ్రీనాథకవి మరణిస్తూ చెప్పిన పద్యాన్ని వ్రాస్తుంటే నాకు యిది జ్ఞాపకం వచ్చింది. ఒక కవి మరణించినపుడు అతను ఫ్రెంచికవి రామ్‌బోయో లేక ఫ్రెంచికవి రామ్‌బో మరణించినపుడు ఇంకో కవి చెప్పిందోకాని నాకు అంత గుర్తులేదు. కానీ ఈవాక్యాలు అన్నాడు. "అన్నా! వంట అయింది. అమ్మ నిన్ను భోజనానికి పిలుచుకు రమ్మంది. నేను నీ గుడిసె వద్దకు వచ్చాను. తలుపుకి తాళము వేసి వున్నది. నాకోసం వెతకవద్దు అని చీటీ వ్రాసి వున్నది" అని శ్రీ శ్రీ యిలా అన్నాడు. ప్రపంచంలో చిన్న వయస్సులో మరణించిన ఏకవికైనా (రచయితకైనా) యిది వర్తిస్తుంది అని. పై మాటలు ఎంత హృదయ విదారకంగా ఉన్నాయి! ఆ కవి మరణాన్ని గురించిన వాక్యాలు తల్చుకున్న కొద్దీ మరీ విచారం వేస్తున్నది. సుప్రసిద్ధ నవలా రచయిత ప్రేమ్‌చంద్ ఇలా అంటాడు- తన నవల రంగభూమిలో. "ఈ ప్రపంచం అనే రంగస్థలంపై చిన్న, పెద్ద అందరూ ఎవరివంతు పాత్రను వారు నిర్వహించి కాలం తీరగానే తెర వెనక్కి తప్పుకుంటారు."

## ప్రపంచ కవితా సంకలనం

డాక్టర్ అమల్ ఘోష్ సంపాదకత్వంలో వెలువడు తున్న ప్రపంచకవితాసంలనం 'Okarina of friendship Bridge' (ఆంగ్లం)లో నాగేయంకూడ ప్రచురింపబడుతోంది. ఈగేయ సంపుటిలో ప్రపంచంలోని ప్రసిద్ధ కవుల గేయాలే ప్రచు రింప బడతాయి. నాగేయాలు మిర్రర్ మరికొన్ని ఇంగ్లీష్ పేపర్లలోకూడ ప్రచురింప బడ్డాయి.

నాకు గొగోల్ (రష్యన్ మహారచయిత) వ్రాసిన ఓవర్ కోట్ కథ చాలా ఇష్టం. ఆకథ ఎన్నిసార్లు చదివినా ఇంకా చదవాలనే అన్పిస్తుంది. ఆకథని నేనొక పేపర్లో సమీక్ష చేశాను. టాల్‌స్టాయ్, హోవార్డ్‌ఫాస్ట్, ఇంకా మరి కొందరి ప్రసిద్ధ రచయితల రచనలంటేకూడ నేనెక్కువ ఇష్ట పడతాను. గోర్కీ వ్రాసిన నవల A very much afraid in foama gardio కూడ చాలాసార్లు చదివాను. ఆ పుస్తకాన్ని గూర్చి గోర్కీ శతజయంతి సందర్భంగా నేను సోదరులు శ్రీ సోమసుందర్ గారి కళాకేళి పేపర్లో సమీక్ష చేశాను. ఇంకో పేపర్లోకూడ ఆ పుస్తకాన్ని సమీక్ష చేశాను.

## సెక్స్ లేక కామము

ధర్మార్థ, కామ, మోక్షాల్లో కామానికి తృతీయ స్థానం ఇవ్వబడింది. ముందర ధర్మ శబ్దానికి ప్రాధాన్యం ఇచ్చారు మనవాళ్ళు. ఈ ధర్మాన్ని మొదట చెప్పడం వల్ల ధర్మంగానే అర్థం సంపాదంచాలి, ధర్మంగానే కామాన్ని అనుభవించాలి. మన వివాహాల్లో వధూవరులు ఒకరి నెత్తిన

ఒకరు చేయిపెట్టి యిలా ప్రమాణం చేస్తారు. "ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి." అంటే ధర్మాన్ని చేస్తున్నప్పుడు గానీ, అర్థాన్ని సంపాదించేటప్పుడు గానీ, కామాన్ని అనుభవించేటప్పుడు గానీ, ఒకర్ని విడిచి ఒకరు చరించమని. అంటే ధర్మకార్యాలు చేస్తున్నప్పుడు భార్యాభర్త లిద్దరూ సమ భాగులుగా ఉండాలి. అర్థాన్ని అనుభవిస్తున్నప్పుడు కూడా ఇద్దరిదీ సమమైన వాటాయే! అలాగే కామాన్ని అనుభవిస్తున్నప్పుడు కూడా ఇద్దరూ సమానమైన భాగస్వాములుగా వుండి ఆనందం అనుభవించాలి. వేరొకరితో ఇవేమి పంచుకోకూడదు. గృహస్థు ఏదైనా ధర్మకార్యం చేస్తున్నాడంటే భార్య ప్రక్కనే వుండాలి. అతను ఏదైనా దానం చేస్తున్నాడంటే చేతిలో నీళ్ళు పోయాలి. గృహస్థు యజ్ఞానికి సంబారాలు బండిమీద వేసి తీసుకుపోయేటప్పుడు అతని భార్య ఆ శకటం మీద చేయివేసి సరుకులు తీసుకెళ్ళడానికి అనుమతివ్వాలి. ఇలా పూర్వులు భార్యాభర్తలిద్దర్నీ అన్నింటిలో సమభాగులుగా నిర్ణయించారు. మానవుడు తరతరాల అనుభవం జీర్ణించుకొని వివాహవ్యవస్థ నెలకొల్పాడు. ఒకే పురుషుడు ఒకే స్త్రీ అన్నది పరిణతి చెందిన సమాజం యొక్క చిహ్నం.

మానాన్నగార్ని ఒకసారిలా అడిగాను. "నాన్నా! పెళ్ళి చేసుకోపోతే ఏం? పెళ్ళి మానేసి మోక్ష సంపాదనకి ప్రయత్నం చేయకూడదా?" అన్నాను. అప్పుడు మానాన్నగారన్నారు. "ఏ శంకరాచార్యులో, రామకృష్ణ పరమహంసో, వివేకానందో అలాంటి గొప్ప మహామహులు ఏకంగా సన్యాస్యాశ్రమం స్వీకరించ గలరు. మోక్షంకోసం మామూలు

మానవులందరూ నాలుగు ఆశ్రమాలు అవలంబించాలి. గృహస్థాశ్రమంలో ప్రవేశించకుండా ఏకంగా సన్యాసి అయి తపోనిష్ఠలో ఉంటాడనుకో! ఎప్పుడైనా అతనిమనస్సు చలించవచ్చు. ఇంద్రియాలకి లొంగిపోయి పతనం అవచ్చు. సంసారుల్ని చూసి వీళ్ళంతా చాలా సుఖపడుతున్నారు. ఇందులో ఏదో వుందని తనకి లేదని భ్రమపడవచ్చు. అలాకాక కొన్నాళ్ళు గృహస్థుగా ఉండి కొన్నాళ్ళు సంసార సుఖాల్ని అనుభవించి ఇందులో అనుకున్నంత ఏమీలేదు. ఈ సుఖం కన్నా మిన్న అయిన ఆత్మ సుఖం వేరే వుందని దీనిమీద విరక్తి కల్గాక సన్యాసి ఆశ్రమంలోకి వెళ్తే అతని విజ్ఞానం స్థిరంగా వుంటుంది. పతనం అవడానికి అవకాశం వుండదు" అన్నారు. అలా మామూలు మానవు లందరూ తప్పకుండా గృహస్థాశ్రమం అవలంబించి దాంపత్య సుఖాలు పొందవలసిందే! ప్రాణి కోటి అంతటికీ ఆహార, నిద్ర, భయ, మైథునాదులు సహజం! అయితే తక్కిన ప్రాణికోటి నుంచి మానవుడిని వేరు చేసేది అతని జ్ఞానమే కాబట్టి మైథునాదులకి కొన్ని హద్దులు ఏర్పరచుకొన్నాడు. భార్య భర్తయందు, భర్త భార్య యందే సుఖించాలి. ఇంతకు మించి వేరెవరితోనైనా చరిస్తే దాన్ని వ్యభిచార మంటారు. వ్యభిచారాన్ని మహా పాపమని ధర్మశాస్త్రం చెప్తోంది. పాపం, పుణ్యం ఎవరు చూశారు? ఇప్పుడు సుఖిస్తున్నాం గదా! చనిపోయాక స్వర్గం, నరకం అన్నది ఎవరు చూశారు? ఎప్పటికప్పుడు ఎందులో సుఖం వుంటే అది అనుభవించేయడమే బ్రతుక్కి పరమార్థమని కొందరనుకో వచ్చు. ఈ పాపం అన్నది మనం చనిపోయాక మరోజన్మలో

పీడించేది అవునో కాదో, అనుకునే వార్కి కూడ ఒకటుంది. ఇప్పుడే ఇక్కడే మనం చేసిన తప్పు పనికి పీడిస్తుంది. అదేమి టంటే వ్యభిచారి అయినవార్కి బయటా గౌరవం వుండదు. ఇంట్లోను భార్య, పిల్లలు అసహ్యించుకుంటారు. ఎంత జాగ్రత్తగా ఆధునిక వైద్య పద్ధతుల నవలంబించినా సుఖ రోగాలంటుకోక మానవు. శరీరం గుల్లవుతుంది. డబ్బు ఖర్చవు తుంది- పరాయి స్త్రీల కోసం.

మనం చేసే పనికి పరిణామం మంచిగా వుండక చెడుగా ఏది వుంటుందో అదే పాపం! అసలు వ్యభిచారం ఎందుకు చేస్తారు అని ప్రశ్నించుకుంటే కొంతమందికి సహజంగా వారి పుట్టుకతోనే వ్యభిచార గుణం వుంటుం దనుకోవాలి. వారు ఒక స్త్రీతోనే సుఖించలేరు. రుచులు మారుతూ వుండాలి. వావి వరుసలక్కర్లేదు. కనబడిన పువ్వునల్లా ఆఘ్రాణించడమే వారి ఆశయం.

న్యాయశాస్త్ర పుస్తకాల్లోకూడ కొందరి రక్తంలోనే దొంగగుణం, వ్యభిచారగుణం వుంటాయని వ్రాశారు. మరి కొంతమంది ఇంట్లో సుఖం తక్కువై పైగా చరించే వాళ్ళుంటారు. అయితే స్త్రీలలో వ్యభిచారిణులు లేరా అని అడగవచ్చు. తరతరాలుగా వేశ్యావృత్తిలో జీవిస్తున్నవాళ్ళు తప్ప తక్కిన స్త్రీలలో వ్యభిచారిణులు చాలా తక్కువగానే వుంటారు. అసలు ప్రపంచంలో ఎక్కడైనా సరే స్త్రీ పురు షుల స్వభావంలోనే తేడావుంది కామంలో. పురుషునికి కామం చూసినంత మాత్రంచేతే పుట్టుకొస్తుంది. స్త్రీ కలా కాదు. ఆమెలో నిగ్రహ శక్తి ఎక్కువగా ఉంటుంది. అందుకే పురుషులకన్నా స్త్రీలు సులువుగా బ్రహ్మచర్యం

అవలంబించగలరు. మనదేశంలో స్త్రీలకి చిన్నప్పట్నుంచీ ధర్మాన్నే ఎక్కువగా ప్రబోధించడం వల్ల వారిలో కామ వాంఛ కొంచెం తక్కువగానే వుందని చెప్పుకోవచ్చు. కామశాస్త్రంకూడ ఒక కళే! స్త్రీని పురుషుడెలా సుఖ పెట్టాలో, దాంపత్య జీవితంలో పురుషుడ్ని స్త్రీ ఎలా అల రించాలో, ఒకర్నొకరు ఎలా సుఖపెట్టుకోవాలి, వారి శరీరంలో వున్న తేడాల్ని స్త్రీ తన సౌందర్యంచేత, హావ భావ విలాసాలచేత భర్తనెలా ఆకర్షించాలో, పురుషుడు తన వీర్యశక్తిని పెంపొందించుకొని భార్యయందు చూపవలసిన రసికత, ఆమెని ఆనందింపచేయడం, ఇవన్నీ సరియైన కామ శాస్త్ర గ్రంథాలు మనకి బోధిస్తాయి. స్త్రీని సున్నితంగా వాడుకోవాలి. కొన్ని వేల యేళ్ళక్రితం వ్రాసిన వాత్స్యాయన కామసూత్రాలు ఈనాటికీ గొప్పవని, పరిశోధించి వ్రాసినవని ఆధునిక వైద్య శాస్త్రజ్ఞులుకూడ ఒప్పుకుంటున్నారు. హేవ లక్ ఎల్లీస్, ఫ్రాయిడ్, మొదలగు మన స్తత్వ శాస్త్ర వేత్తలుకూడ సెక్సుని గురించి సరియైన సమాచారాన్ని అందించారు. ఇంకా ఎందరో మంచి గ్రంథాలు వ్రాశారు. ఇవన్నీ తెలుగులో కూడ వున్నాయి. దంపతులు సరియైన శాస్త్ర సమాచారాన్ని అందించే కామశాస్త్ర గ్రంథాలు చదివి తమ జీవితాన్ని ఆనందమయం చేసుకొని ఒకరి లోటు పాట్లు ఒకరు తెలుసుకొని వారిలోవారు ఆనందించిననాడు పై సుఖాలకోసం వెతుక్కునే అవకాశం అంతగా ఉండదు. పెళ్ళయిన మొదట్లో సహజంగా వుండే కామ తీవ్రతచేత భార్యాభర్తలిద్దరిలో ఒకరి లోపాలొకరికి అంతగా కనపడవు. ఆ తీవ్రత తగ్గాక ఒకరి లోపా లొకరికి కన్పిస్తాయి. అయితే

ఇద్దరి స్వభావాలు ఎప్పుడూ ఒకేరకంగా వుండవు. తేడా లుంటాయి. వాట్ని సర్దుకుపోవడంలోనే నేర్పుండాలి. కొందరు మగవాళ్ళు మొదట్లో బాగానే వుంటారు. భార్యకి నలభై ఏళ్ళు దగ్గరపడి కొంచెం అందం, లావణ్యం తగ్గేసరికీ, దీనికితోడు ఆ సమయానికి వారిచేతిలో డబ్బు ఎక్కువగా ఆడేసరికి పరాయి స్త్రీల వెంట పడతారు. 'నలభైఏళ్ళు దాటిన ప్రతి మగవాడు పోకిరీయే' అని ఆంగ్లంలో సామెత వుంది. ఈ వయస్సులో ఆడవాళ్ళు భర్త విషయం ఇంక అట్టే పట్టించుకోరు. ఎలాగో ఇద్దరం పెద్దవాళ్ళ మయ్యామని ఇంట్లో పిల్లలు, సంసారంలో ఎక్కువ శ్రద్ధ చూపుతారు. అలాకాక భార్యకూడ నిత్యనూతనంగా, అందంగా, ఆకర్షణీయంగా భర్తలకే కన్పడాలి. అయితే ఏళ్ళు వస్తున్నకొద్దీ భార్యాభర్తలు ఇంద్రియ నిగ్రహం అలవర్చుకొని దాంపత్య సుఖానికి ఒక నియమం అవలంబిస్తే అది శరీర ఆరోగ్యానికి మంచిది. భార్యలోగానీ, భర్తలోగానీ, అందచందాలు వయస్సు వస్తున్నకొద్దీ తగ్గిపోతాయి. శరీర ఆరోగ్యం సన్నగిల్లవచ్చు. లేకపోతే ఇరువురిలో ఏ ఒకరైనా వ్యాధిగ్రస్తులవచ్చు. దీన్ని సాకుగా తీసుకొని ఇంకొకరితో వ్యభిచరించడం మానవత్వం ఉన్నవాళ్ళు చేయవలసిన పనికాదు. కష్టసుఖాల్లో, బాధల్లో, భయాల్లో ఒకరికొకరు తోడుగావుంటారని, జీవితాంతం విడువకుండా వుంటారనే వివాహంలోని ముఖ్య ఉద్దేశ్యం. వివాహం కేవలం కామంకోసం కాదు. అందుకే ధర్మ శబ్దం ముందుగా ధర్మేచ అని ప్రయోగింపబడింది. ఇప్పుడు వివాహాల్లో ధర్మశబ్దంకి ప్రాముఖ్యం తగ్గిపోతూంది. కేవలం అర్థ కామానికి ప్రాధాన్యం ఇస్తున్నారు.

కొంతమంది పురుషులు కొన్నాళ్ళు భార్యతో సుఖా లనుభ వించి మరల వేరొక ఆమె ఆకర్షణలోపడి ఆమెని వివాహ మాడుతున్నారు. చాలా మేధావులు, గొప్పవాళ్ళు, సంఘ సేవకుల్లోకూడ ఆలా చేసే వాళ్ళున్నారు.

కొంతమంది పూర్తిగా రెండోఆమె ఆకర్షణలోపడి ఏపాపం ఎరుగని మొదటి భార్యకి విడాకు లిస్తున్నారు. మొదటి భార్యకే, పిల్లలకి ఏదో చాలీచాలని మనోవర్తి పడేస్తారు. నిస్సహాయురాలైన ఆ స్త్రీ ఏం చేస్తుంది? ఏడవ డం తప్ప! వ్యభిచారం అలవడకుండా వుండాలేగానీ, అల వడితే భార్యలందు వైముఖ్యం ఏర్పడుతుంది పురుషులకి. చివరికి ఆ విముఖత ఎంతదాకా వెళ్తుందంటే రెండో ఆమెతో తాను సుఖం అనుభవించడానికి భార్య అడ్డుగా వుందని ఆమె మీద లేనిపోని నేరాలు మోపి కోర్టులో దావావేసి విడాకు లిచ్చేయడం, అది కుదరకపోతే ఆమె నేదోవిధంగా మందు పెట్టో, విషంపెట్టో చంపేయడం జరుగుతుంది. ఇలాంటివి చాలా కేసులు చూస్తున్నాం మనం. అంత యిష్టంలేనివాళ్ళు స్త్రీ అయినా పురుషుడైనా మర్యాదగా విడిపోవడం మంచిది గానీ ఒకళ్ళ నొకళ్ళు చంపుకోవడం చాలా రాక్షసకృత్యం. మనస్మృతులలో ఒకస్మృతిలో ఇలా వ్రాసివుంది. "భార్య నెవడైనా వదిలిపెడితే అతనికి శిక్షేమిటంటే ఇంటింటికి తిరిగి నేను భార్యని వదిలిపెట్టినవాడిని, మహాపాపిని, నాకు భిక్ష వేయండని అడుక్కొని తినాలి.

# ఇంక మంచి రచనల గురించి కొంత చెప్తాను

స్వర్గీయులు కీ॥ శే॥ బాలగంగాధర తిలక్ వ్రాసిన "అమృతం కురిసిన రాత్రి" వచన కవిత చదివాను. అది నాకు ఎంతో యిష్టం. ఇది చాలా రోజులుగా నా మంచం దగ్గర కిటికీలో పెట్టుకొని చదువుతుండేదాన్ని. శ్రీ తిలక్ కవిత్వం ఎంతబాగా వ్రాశారో కథలు కూడ అంత బాగా వ్రాశారు. మన తెలుగు పేపర్లోను ఒక్కొక్కప్పుడు రేడియోల్లో ఎన్నో మంచి కథలు, కవిత్వాలు వస్తుంటాయి. యిలాంటి వాటిని ఏ వేటి కావేడు వేరి పుస్తకంగా ముద్రిస్తే బావుంటుంది. ఆ పని ప్రభుత్వం చేయాలి. ఎంతోమంది రచయితలు తమ పుస్తకాలు అచ్చు వేయించుకోలేరు. ధనం లేక ఎన్నో మంచి రచనలు అట్టడుగున పడి ఉన్నాయి. వీటన్నింటిని ముఖ్యంగా ప్రజలు ప్రోత్సహించాలి. చాలామంది రచయితలు బీద స్థితిలో ఉండి ఉన్నారు. నటులకి, సంగీత విద్వాంసులకి (కొంతమంది) నెలకి గౌరవ వేతనాన్నిస్తున్నట్లు రచయితలకి కూడ ఇవ్వాలి. నేడు వ్యవహారిక భాష అమలులో వుంది. కాలేజీల్లోను, స్కూళ్ళలోను, విశ్వవిద్యాలయాల్లోను ఆ గ్రంథాల్ని నాండిటైలుగా పెట్టాలి. సమకాలీన వాతావరణం వల్ల విద్యార్థులకి అర్థమవుతుంది.

నాకు 1978 అక్టోబర్ లో శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారిలా రాశారు. విశాఖపట్నంలో ఆంధ్రా యూనివర్సిటి తెలుగు ప్రొఫెసర్ శ్రీ ఎస్. వి. జోగారావు గారింట్లో నా పుస్తకాలు చూశానని, వ్యాసపద్మం అనే నా వ్యాస సంపుటి లోని వ్యాసం స్వాతంత్ర్యాజిత తనకు చాలా

నచ్చిందని, 1978_80 సంవత్సరాలకి ఇంటర్మీడియట్ విద్యార్థులకి పెట్టబోయే గద్య పద్య సంకలనంలో నా వ్యాసం చేరుస్తున్నానని వ్రాశారు. ఈ ఆత్మకథని డా॥ జి. శ్రీరామమూర్తిగారు త్వరలోనే ఇంగ్లీష్ లోకి అనువాదం చేస్తానన్నారు. ఇది ఆయనకు వచ్చితే ఢిల్లీలోని పబ్లిషర్స్ కిస్తానని మద్రాసు నుంచి డా॥ అమల్ ఘోష్‌గారు వ్రాశారు.

## ఉత్తమ గ్రంథాలే నిజమైన మిత్రులు

రచయితల్ని, కళాకారుల్ని గౌరవించని దేశం వెలుగులోకి పయనించలేదు. ఎందరో అజ్ఞాతంగావున్న రచయితల్ని పైకి తీసుకు రావాలి. ఆ గ్రంథాల్ని అచ్చు వేయించాలి. అసలు ప్రతి కుటుంబము తమకు వచ్చే ఆదాయంలో కొంత ధనాన్ని మంచి పుస్తకాలు కొనడానికి కేటాయించాలి. చాలా మంది డబ్బువున్న వాళ్ళు కూడ పుస్తకాలు కొంటే డబ్బు ఖర్చు అని బాధపడ్తారు. డబ్బు వున్నవాళ్ళు, లేని వాళ్ళు కూడ తమ డబ్బుని సినిమాలకి, చీరలకి, నగలకి, విలాసాలకీ ఖర్చు చేస్తారు. కాని ఒక పేపరు కొనడానికి, పుస్తకం కొనడానికి ఇష్టపడరు. ఎవరి దగ్గరనైన చదివి ఇచ్చేద్దాం అని మానేస్తారు. కొంతమంది అసలు చదవరు. వీరు ధన్యాత్ములు. ఏ గొడవ అక్కర లేదు. మామూలుగా సృష్టిలో ప్రతి ప్రాణికి తిండి నిద్ర కామం అన్నీ ఉన్నాయి. వీటన్నిటి నుంచి వేరు చేసి మనిషికి ఆధిక్యత నిచ్చేది విజ్ఞానమే. ఈ విజ్ఞానం మంచి పుస్తకాలు చదవడం వలన వస్తుంది. ఉత్తమ గ్రంథాలే నిజమైన మిత్రులు...! పుస్తకాలు ఒకసారి చదివి అవతల

పారేసేవి కావు. ఉత్తమ గ్రంథాలు తర తరాలుగా భద్ర పరుచుకోవాలి. మంచి వాక్యాల్ని డైరీలో వ్రాసుకోవాలి. కాలం సృష్టిలో చాలా విలువైంది. సృష్టిలో అన్ని ప్రాణుల కన్న మానవ జన్మ ఉత్కృష్టమైంది యిలాంటి మానవ జన్మలో ఉన్నందుకు గర్వించాలి. మహాకవి కాళిదాసు ఇలా అంటాడు. చనిపోయాక మళ్ళీ పుడతామో పుట్టమో ఎవరికీ తెలియదు. అందుకని మనం బ్రతికి ఉన్న క్షణాలు చాలా ఆనంద దాయకమైనవని గుర్తుంచుకోవాలి. ప్రస్తుతం మేము కాకినాడలో ఉంటున్నాం. ఇన్నాళ్ళు నన్నాదరించిన పత్రికాధి పతులకు, పాఠకులకు, రచయిత మిత్రులకి, పెద్దలకి, పిన్నలకి అందరికీ నా ధన్యవాదాలు.

అడవికొలను పార్వతి

గాంధీనగర్

కాకినాడ_4

# శ్రీమతి అడవికొలను పార్వతిగారి రచనలు

ఆనందంతో పాటు ఆలోచనలను రేకెత్తించే రచనలు

సామాజిక అభ్యుదయ సమస్యలకు దర్పణాలు.

1. ఉదయపవనాలు : (వచన కవిత) GT III 799 రు. 3-00

మీ శైలి, భావన ఎంతో నచ్చాయి."— శ్రీ దాశరథి

2. వలయంలో వానిస : (కథల సంపుటి) రు. 6-50

10751/ T 5 B/2912

"ఇంత మంచి ప్రయోజనాత్మకమైన కథలు
వ్రాసినందుకు హృదయ పూర్వకాభినందనలు"

—శ్రీ నవీన్

3. పద్మాలు-పారిజాతాలు : (కథల సంపుటి) రు. 5-50

10757/ T 5B/ 291

1975 వనితా సంవత్సరానికి ఇది ఉత్తమమైన కానుక.
కథలన్నీ చాలా బావున్నాయి."

—శ్రీ దేవులపల్లి రామానుజరావు.

4. మందారాలమాల : (కథల సంపుటి) రు 6-50

12309/ T 5B/ 3400

5. అరుణ కిరణాలు : (వచన కవితా సంపుటి) రు. 5-00

6. వ్యాసపద్మం : (వ్యాస సంపుటి) రు. 6-50

13530/ T 7B/ 497

7. రెండుతరాల స్త్రీలు : (నవల) రు. 6-50

10610/ T 5A/ 2764

జయంతి పబ్లికేషన్స్, విజయవాడ

8. తిరగబడ్డ నవతరం : (నవల) రు. 6-00

వాహినీ పబ్లికేషన్స్, విజయవాడ

(అచ్చులోనున్న గ్రంథములు)

9. నీలాంబరాలు : (పద్య కవిత)

ప్రతులకు : అడవికొలను పార్వతి,
అపర్ణా పబ్లికేషన్స్,
గాంధీ నగర్, కాకినాడ- 4

పై పుస్తకములు విజయవాడ న్యూ స్టూడెంటు బుక్ సెంటరులో, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌లో, నవజీవన్ బుక్ లింక్సులో, మద్రాసు రాణీ బుక్ స్టాల్‌లో సికింద్రాబాద్ ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, కాకినాడ మమతా ఎంటర్ ప్రైజెస్. (పిఠాపురం బస్ స్టాండ్) హిగ్గిన్ బాదమ్స్‌లో దొరుకును.